POW

మహిళా గొంతుక

# మాతృక

ప్రగతిశీల మహిళా సంఘం (పీవోడబ్ల్యూ) అధికార మాసపత్రిక

MAHILA GONTUKA MATRUKA

సంపుటి : 5 సంచిక : 9 సెప్టెంబర్ : 2019 57 పేజీలు : 52 వెల : 15 రూ.లు

కారాగారంలో

## కశ్మీర్

కుంకుం పూల పెదవుల మీద
ముల్లు గుచ్చుకున్న చిర్నవ్వులా ఉన్నాను
కన్నీటి మంచుకొండలా కరిగి
కలల దేవదారువృక్షంలా కూలిపోయాను

కర్ఫ్యూ గొంతులోని స్వేచ్ఛా గీతాన్ని!
పెల్లెట్ రాళ్ల వానలో రక్త గాయాన్ని!!
దహన కశ్మీర హృదయాన్ని నేను






# క్షమాపణ పత్రం

నబీఖాన్

అడవి పువ్వులిప్పుడు
చెట్టు చెట్టుకు కాకుండా
చెమటచుక్కకో
చెమ్మగిల్లిన కళ్లకో
పూస్తుంటే
వాడు కాన్సన్‌ట్రేషన్ క్యాంపులో
సమాధుతొవ్వి సిద్ధం చేస్తున్నాడు

గ్రీన్ హంట్‌లో గాయపడిన
లేడిపిల్లల పక్షానో
జై శ్రీరాం నినాదం నిరాకరించి
నెత్తుటి ముద్దయిన
తెల్లపావురాళ్ల పక్షానో
పాటపాడిన కోయిలమ్మల కోసం
ఇనుప సంకెళ్ల వలలు సిద్ధమౌతున్న
సందర్భమిది

ఇక ప్రశ్నలన్నీ జవాబుకోసం కాకుండా
ఇక ప్రశ్నలన్నీ హక్కుల కోసం కాకుండా
ఇక ప్రశ్నలన్నీ ఆదివాసిల కోసమో
మూలవాసుల కోసమో కాకుండా
అండా గృహాలలో నిర్బంధాల కోసం
సంసిద్ధం చేసుకోవాలి

కాళ్లకు గజ్జెలు కట్టి చిందేసే కళాకారుడా
ముసుగులువిప్పి మనిషిని
నగ్నంగా నిలబెట్టే మేధావీ, కవీ,
పాత్రికేయుడా, నా ప్రియమైన
ప్రజాస్వామ్య ప్రేమికుడా
నీ ఆలోచనలిప్పుడు
అదృశ్యమవుతున్న ఆజాదీని
సవాల్ చేయకూడదు
పరమత హననపు దయామయ రాజ్యంలో
సమానత్వం లేని
స్వేచ్ఛా స్వాతంత్ర్యాన్ని
పంద్రాగష్టున
పరమ పవిత్రంగా భావించాలి

మధ్య యుగాల మతాల సారంకోసం
మాబ్ లించింగ్ కాబడిన మత సామరస్యంలా
నీ దేహమిప్పుడు
రక్తసిక్త గాయాల పాలైన
నా దేశమంత గొప్పగా ఉంది

క్షమించు పాటగాడా
నీగొంతుకు కోరస్ పాడనందుకు
క్షమించు పోరాటగాడా
నీ పిడికిలిని బిగుసుకునే బలాన్ని
కాలేకపోయినందుకు
మేధావీ, కవీ
పాత్రికేయుడా, నా ప్రియమైన
ప్రజాస్వామ్య ప్రేమికుడా
క్షమించు... ✿



KLVA 106M173




మహిళా సంఘటిత శక్తి
ఉద్యమించే మహిళల ఊపిరి

మహిళా గొంతుక

# మాతృక

MAHILA GONTUKA MATRUKA

సంపుటి : 5 | సంచిక : 9 | పేజీలు : 52 | సెప్టెంబర్ - 2019



రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సమానత్వం కోసం పోరాడుదాం

ధరణి ఎంటర్ ప్రైజెస్
డిటిపి & డిజైనింగ్
హైదరాబాద్ - 500 044.
సెల్ : 9491875063

ముద్రణ : నవ్య ప్రింటర్స్,
హిమాయత్ నగర్, హైదరాబాద్ - 29

రచనలు, చందాలు పంపవలసిన చిరునామా

మహిళా గొంతుక
మాతృక
ఇం.నెం. 35-3-6931 (4)
కామ్రేడ్ మాదాల నారాయణస్వామి భవన్, సంజయగాంధీ కాలనీ,
శర్మ కాలేజీ దగ్గర,
ఒంగోలు - 523 001
సెల్ : 9676206230
ఫోన్ : 08592 - 238350
e-mail : matruka2015@gmail.com

## విషయ సూచిక





# కశ్మీర్‌పై మౌనాన్ని వీడుదాం

శతాబ్దాల తరబడి దేశ ప్రజలు నిర్మించుకున్న భారతీయ, లౌకిక, ప్రజాస్వామిక భావనలకు ఒక పెద్ద ఎదురుదెబ్బ హిందూత్వశక్తుల నుండి తగిలింది. జమ్ము & కాశ్మీర్ రాష్ట్రం 70 ఏళ్లుగా, రాజ్యాంగబద్ధంగా అనుభవిస్తున్న స్వయం ప్రతిపత్తి హక్కు (370, 35ఏ ఆర్టికల్స్)ను, కేంద్రంలోని బిజేపీ ప్రభుత్వం రద్దు చేసింది. అంతేకాకుండా, కశ్మీర్ రాష్ట్రాన్ని, రాజకీయ హక్కుల్లేని, కేంద్రానికే సర్వాధికారాలుండేలా రెండు కేంద్ర పాలిత ప్రాంతాలుగా (అసెంబ్లీతో కూడిన జమ్ము & కాశ్మీర్, లద్దాక్) విభజించారు. ఇది రాజ్యాంగ, ప్రజాస్వామిక వ్యతిరేక చర్య. ఈ ప్రక్రియలో, కశ్మీర్ రాష్ట్ర ప్రజల, పార్టీల అభిప్రాయాలను తెలుసుకునే, కనీస ప్రజాస్వామిక పద్ధతులను పాటించలేదు. రాష్ట్రాన్ని ఒక బహిరంగ జైలుగా మార్చి, రాష్ట్ర హోదాను రద్దు చేయడం ఇదే మొదటిసారి. దీనితో, కశ్మీర్‌కు భారత్‌తో వున్న స్వయం ప్రతిపత్తి సంబంధం తెగిపోయి, భారత్‌కు వలసగా, మిలటరీ ఆక్రమణ ప్రాంతంగా మారింది.

370 ఆర్టికల్ వలనే కశ్మీర్, దేశం లోపలే విడిగా వుంటూ, దేశ అభివృద్ధి ఫలాలను అందుకోవడంలో వెనుకబడిందనీ, ఇకపై సంపూర్ణ విలీనంతో, అభివృద్ధిలో దూసుకు పోతుందనీ, తీవ్రవాదం అంతం అవుతుందనీ - మోడీ మూక చేసే ప్రచారంలో వాస్తమెంత? దేశంలోని రాష్ట్రాలలో మానవాభివృద్ధి సూచికలో, గుజరాత్‌ను కూడా అధిగమించి, కశ్మీర్ 11వ స్థానంలో వుంది. భారత రాజ్యాంగం నుండి తొలిగించినా, కశ్మీర్‌లో ఆస్తి హక్కు ప్రాథమిక హక్కుగా కొనసాగుతుంది. భూసంస్కరణలను అమలుచేసి, దేశానికే ఆదర్శంగా వుంది. ఇలా మాట్లాడుతున్నామంటే, కశ్మీర్ ఇక అభివృద్ధి చెందాల్సిందేమి లేదని కాదు. 370 ఆర్టికల్ కశ్మీర్ అభివృద్ధికి ఆటంకం కాదనీ, పైగా రక్షణ కవచంగా నిలిచి, అభివృద్ధికి తోడ్పడేదనీ, తెలియజెప్పడం కోసమే పై ప్రస్తావన. కశ్మీర్ స్వతంత్ర సంస్థాన రాజ్యానికీ - భారత ప్రభుత్వానికీ మధ్య జరిగిన ఒప్పందాల (కశ్మీర్ స్వయం నిర్ణయాధికారాన్ని నిర్ణయించే ప్రజాభిప్రాయ సేకరణతో సహా) నుండి భారత్ వైదొలిగింది. వరుస విద్రోహాలకూ, కుట్రలకూ పాల్పడి, స్వయంప్రతిపత్తిని నీరుగార్చింది. ఈ పరిస్థితులలో, కోల్పోయిన రాజకీయ హక్కులను తిరిగి పొందడానికి, శాంతియుతంగా మొదలైన కశ్మీరీల పోరాటానికి, రాజకీయ పరిష్కారాన్ని- భారత ప్రభుత్వం చూపలేదు. ప్రతిగా, లక్షలాది సాయుధ బలగాలతో, క్రూరంగా అణచివేస్తూ, నాలుగు దశాబ్దాలుగా కశ్మీర్‌ను నెత్తురోడుతున్న గాయంగా మార్చారు. ఇక, తీవ్రవాదాన్ని అణచడానికి, మోడీ ప్రభుత్వానికి 370 ఆర్టికల్ అడ్డుగా వున్నదెక్కడ?

కాశ్మీర్ స్వయం ప్రతిపత్తిని అనుసరించి, ప్రజల ఆర్థిక, సాంస్కృతిక ప్రయోజనాలను, మెజారిటీ (హిందూ) మతాధిపత్య ప్రమాదాన్ని దృష్టిలోవుంచుకొని, రచించుకున్న రాజ్యాంగమూ, అందులోని చట్టాలు-భారత సార్వభౌమాధాకారానికి లోబడి వుండేవే- అని సుప్రీం కోర్టు కూడా తీర్పునిచ్చింది. ఆస్తుల బదలాయింపు, ప్రత్యేక నేరాల చట్టాలతో సహా, ప్రత్యేక హక్కులున్న రాష్ట్రాలు కశ్మీర్‌తో పాటూ, తొమ్మిది రాష్ట్రాలున్నాయి. కానీ, కశ్మీర్‌కే ప్రత్యేక హక్కులున్నట్లుగా మోడీ మూక అబద్ధపు ప్రచారాన్ని చేపట్టి-ముస్లింలు మెజారిటీగా వున్న, లౌకిక సంస్కృతి కలిగిన ఏకైక రాష్ట్రం ఉనికినీ, గుర్తింపునూ ధ్వంసం చేసారు.

"మనుస్మృతి చట్టాలపై ఆధారపడకుండా అమలులోకి రానున్న రాజ్యాంగాన్ని తిరస్కరిస్తున్నాను" అని, ఆర్ఎస్ఎస్. సిద్ధాంతకర్త గోల్వాల్కర్ ప్రకటించాడు. దీనికి ముందు, "అధికారం చేతిలోకి వచ్చినపుడు, హిందూమత ఆచార, సాంప్రదాయాలపై, సంస్కృతిపై, కోరికలపై ఆధారపడి హిందూ రాజ్యాన్ని, హిందువులే ఏర్పరచుకుంటారు" అని ఆర్ఎస్ఎస్. పత్రిక ఆర్గనైజర్ (1947-ఆగస్ట్ 14న) ప్రకటించింది. నాడు ప్రకటించినట్టు, నేడు కేంద్రంలో హిందూ మత రాజ్య స్థాపన లక్ష్యం కలిగిన ఆర్ఎస్ఎస్ -బిజేపీలు (హిందూత్వ) అధికారంలో ఉన్నాయి. ఈ అధికారాన్ని ఉపయోగించి, రాజ్యాంగంలోని లౌకిక, సమానత్వ, ప్రజాస్వామిక, రాష్ట్రాల హక్కులను కాలరాస్తూ -నియంతృత్వ హిందూ రాజ్య స్థాపనకు ఒక్కొక్క ఇటుకను పేర్చుతున్నారు. దేశ ప్రయోజనాల ముసుగులో, ముస్లిం విద్వేషాన్నీ, పొరుగునున్న ముస్లిం (పాక్) దేశ వ్యతిరేక ఉన్మాదాన్ని రెచ్చగొట్టడం వలన, 'హిందూత్వ అజెండా'కు, ముఖ్యంగా హిందూ సమాజపు మధ్యతరగతి మద్దతుగా నిలుస్తున్నది. లౌకిక జాతీయవాదం నుండి (అగ్రవర్ణ) హిందూ జాతీయవాదం వైపు భారత సమాజం వేగంగా అడుగులేస్తున్నది. హిందూ-ముస్లిం భావన నుండే, 'కశ్మీర్ జాతి స్వయం ప్రతిపత్తిని నియంతృత్వంగా రద్దు చేసినా',

ముస్లింలపై మూక హత్యలకు పాల్పడుతున్నా- మధ్యతరగతి ప్రజల నుండీ, ప్రాంతీయ పార్టీల నుండీ, కాంగ్రెస్‌లోని కొన్ని శక్తుల నుండీ మద్దతు లభించడం. అంబేద్కర్ సిద్ధాంతాల వెలుగులో నడుస్తున్నట్లు చెప్పుకునే -బిఎస్‌పి, ఎల్‌జేపి, ఆర్‌పిఐ పార్టీలు కూడా మద్దతునివ్వడం, 'మెజారిటీ హిందూ మత' భావనకు లొంగడమే.

నాడు కశ్మీర్ జాతిని బ్రిటీష్ పాలకులు 75 లక్షలకు హిందూ రాజైన గులాబ్ సింగ్‌కు కట్టబెట్టారు. నేడు అదే కశ్మీర్‌జాతిని హిందూత్వ పాలకులు 'అభివృద్ధి' పేరుతో, హిందూ పెట్టుబడిదారీ-కార్పోరేట్ పిశాచులకు అప్పగించారు. తన రాజ్యంలోని, ఒక జాతి రాజకీయ హక్కుల్నీ, స్వేచ్ఛనీ మిలటరీ ట్యాంకులతో హరించి, బానిసని చేసి- దాని భూమినీ, అందాల వనరులనీ, లౌకిక సంస్కృతినీ - పెట్టుబడి రాక్షసికి ఆహారంగా వేయడం- గ్లోబలీకరణ యుగంలో మోడీనే చివరి నియంత కావొచ్చు. ఇక్కడ చరిత్రని జ్ఞప్తికి తెచ్చుకుందాం:" వరుస వలస పాలకుల పాలనలో - ఈ పర్వతాలు, లోయలు కని, పెంచిన రైతాంగ ముద్దుబిడ్డలు తొమ్మిదంగుళాల నేలతో సరిపెట్టుకొని దిగంబర జీవితాలు గడిపారు" అని, కశ్మీర్ ప్రధాని మంత్రి హోదాలో షేక్ అబ్దుల్లా అన్నాడు. తిరిగి అదే కశ్మీరీ జాతి, నేడు హిందూత్వ పాలకులకు వలసగా మారింది. ఇక కశ్మీరీ జాతి విముక్తి 'స్వయం నిర్ణయాధికార హక్కు' సాధించుకోవడంలోనే వుంది. అందుకోసం, స్వేచ్ఛా సంస్కృతిని జీవంగా కలిగిన కశ్మీరీజాతి అణుబాంబుని మించిన శక్తిగా తన్ను తాను మలచుకుంటుంది. అణచివేయబడుతున్న జాతి తన హక్కులకై, స్వేచ్ఛకై జరిపే పోరాటాన్ని బలపర్చడంలోనే, ఇతర అణగారిన జాతుల, సమూహాల హక్కులూ, స్వేచ్ఛా పరిరక్షించబడతాయి. భారతీయులుగా మౌనం వీడుదాం. కశ్మీరీ జాతికి అండగా నిలుద్దాం.






## వలస పోవటం

డానియల్ హాసన్

అనువాదం : బొల్లోజు బాబా

శ్రీనగర్ ఎయిర్ పోర్టులో
ఎదురుచూసే ఫర్నిచర్‌కి వేళ్లు పెరిగి
మంచునేలలోకి చొచ్చుకుపోయాయి.

చెక్కపై ద్రాక్ష లతల్ని చెక్కిన
వడ్రంగి పదునైన ఉలి
నా అరచేతిపై ఏవో గీతల్ని మెత్తగా
చెక్కుతుంది

మంచుతో కప్పబడిన తలుపులు తోసుకొని
జ్ఞాపకం ప్రవేశిస్తుంది తిరిగి
వెళ్లిపోవటానికి

ఈ మట్టిలో కూరుకుపోయిన నా కాళ్లు,
చేతులకు
ఈ నిష్క్రమణ కదలిక తెస్తుంది.
నన్నిక్కడనుంచి బయటకు

మోసుకువెళ్లటానికి
ఎంత బలమైన పాదాలు కావాలి?

నా పాదముద్రలు వీధులలో
శిధిలమౌతాయి మెల్లమెల్లగా

నా ధైర్యాన్నంతా గుప్పెట్లో పెట్టుకొని
మరో ఇల్లులేనితనంలోకి వలస పోవాలి

మా హృదయాలు అగ్నికి ఆహుతి అయ్యాకా
మిగిలిన బూడిద రూపమే
రన్ వే పై పరచుకొన్న ఈ వలస
పొగమంచు

మేం కోల్పోతున్న మా మాతృభూమి స్పర్శ
వెనుక
అస్థిపంజరాల వరుసలు,
చరిత్రతో, యుద్ధంతో తుప్పు పట్టిన ఇంటి
రేకులు,
మిగిలినవన్నీ ఉత్త ఖాళీ మేఘాల
జ్ఞాపకాలు

మూడు సార్లు విమానాలు కాన్సిల్ అయ్యాయి
'ఎవరో కుట్రలు చేస్తున్నారు' అంటుంది అమ్మ

మరో ఆరు ఇంచుల మంచు పెరిగి
నాళాలలో ఇంధనం గడ్డకట్టి
విమానాల గుండెలు ఆగిపోయాకా
ఒక్క విమానం కూడా ఎగరదు
అమ్మ ఎన్ని పూజలు చేసినా
వాటి ఇనుప రెక్కలు నిర్దయగా
నిలిచిపోతాయి

మృత్యువు వదంతిలా వ్యాపిస్తుంది.
దేశ బహిష్కృతునికి అంతిమ సంస్కారాలు
ఎవరు చేస్తారూ?

# కుంకుమ పువ్వు!

బమ్మిడి జగదీశ్వరరావు



గోరు వెచ్చని పాలల్లో కుంకుమ పువ్వు నానింది! చిక్కగా యెర్రగా మారింది?! అమ్మ ఆశగా తాగింది! ఎప్పటిలా కొద్దిగా చేదుగా తియ్యగా లేదు?! రుచి మారింది!? తేనె కలిపింది! అయినా మునిపటి రుచి రాలేదు! సరేనని పటిక పంచదార వేసుకుంది! లేదు, రోజూలా అయితే లేదు?!

అమ్మ గ్లాసులోకి తొంగి చూసింది! పాలల్లో యెప్పటిలా యెర్రని జీరలు లేవు?! కలపక ముందే చిక్కగా రక్తంలా వుంది! ఎందుకో అమ్మకి ఆందోళనయ్యింది! అర్ధంకానట్టు చూసింది!

నాన్న వచ్చాడు! పక్కన పెట్టిన గ్లాసును తిరిగి అమ్మకు అందించాడు! అమ్మని అర్ధం చేసుకోకుండా పొట్టమీద ముద్దు పెట్టాడు! 'నీకంటే నాకంటే నాకూతురు రంగొస్తుంది, యెర్ర గులాబీ లెక్క' అన్నాడు! తరువాత అమ్మ ముఖం చూశాడు! అర్ధం చేసుకున్నాడు! 'అప్పుడప్పుడూ అలా నోటికి అనిపిస్తుంది, కళ్లు మూసుకొని తాగేయ్' అన్నాడు!

పుట్టబోయే బిడ్డకోసం అమ్మ యేమయినా చేస్తుంది! నాన్న చెప్పినట్టే చేసింది! 'నిద్ర బాగా పడుతుందిలే' నాన్న అనునయంగా అమ్మ వీపు నిమిరాడు!

చల్లగా గాలి! తోడుగా కురుస్తున్న వాన! పగలు యెండ! రాత్రి చలి!

'సంవత్సరానికి మూడు కాలాలు కావు, వొక రోజుకే రెండు కాలాలు! పగలు యెండా కాలం! రాత్రి శీతా కాలం!' అని నాన్న అమ్మకు కశ్మీరీ శాలువా కప్పాడు!

అమ్మ శాలువాని తడిమింది!

ఆ శాలువా కశ్మీరు వెళ్లినప్పుడు కొన్నది! ఎండాకాలంలో పెళ్లి! పెళ్లయ్యాక హనీమూను కోసం కశ్మీరుకు వెళ్లారు! కశ్మీరు లోయ... జీలం నది... వొడ్డున మొదలైన జీవనది! ఒక్కసారే వెళ్లినా పచ్చని పర్వత శ్రేణులూ స్వచ్ఛమైన నీటి ప్రవాహాలూ యిప్పటికీ జ్ఞాపకాలుగా ప్రవహిస్తూనే వున్నాయి! పుణ్యక్షేత్రాలు సరే, రేపటి కలల్లా విస్తరించిన తోటలూ! అక్కడ ఘనీభవించినవి సరస్సులు కావు, తమ మనస్సులని అనుకున్నారు! ప్రేమ కవిత్వం! నవ జీవన కవులయ్యారిద్దరూ!

వేసవికి శ్రీనగరం రాజధాని! శీతాకాలానికి జమ్మూ రాజధాని! మనమే చక్రవర్తులం! మనలాగే యెందరో చక్రవర్తులు! వచ్చీ పోయే వలస పక్షులు!

'ఇటు యీ కాంత... అటు ఆ ప్రకృతి కాంత... యిద్దరు కాంతల నడుమన నేను' అతడు ఆటపట్టించాలనే అన్నాడు! ఆమె తక్కువ తినలేదు! 'ఇటు యీ పురుషుడు... అటు ఆ ప్రకృతి పురుషుడు నడుమన నేను' నవ్వింది!

'ఎవరు కావాలి?' యిద్దరిలో అన్నట్టు!

'రెండూ వేరు కాదు, కలిపి కాపాడుకోవాలి!' తన ఆవరణం పర్యావరణం అయినట్టు!

'స్వర్గం భూమి మీదికి దిగొచ్చింది!'

'నిజమే, యిక్కడికొచ్చాక యెవరయినా మొఘల్ చక్రవర్తి జహంగీర్ కాకుండా యెలా వుండగలరు? మాట్లాడగలరు?'

'సరే, కుంకుమ పువ్వు పాలల్లో కలిపి యివ్వనా?'

'తప్పకుండా... కాని యిప్పుడే కాదు!'

నవ్విన ఆమె కశ్మీరీ దుస్తుల్లో వంగపండులా మెరిసింది! ముసుగు లేకుండా మేలి ముసుగు కప్పుకుంది! చెవులకు పెద్ద పెద్ద బుట్టాలు! పూసలు కావవి మణి హారాలు! నేల వేసుకున్న ఆకుపచ్చరంగూ నింగి వేసుకున్న నీలిరంగూ సరస్సులో మునిగి తేలియాడుతున్న తెలి మబ్బుల రంగూ... అన్నిరంగుల్నీ దేహం నిండా వస్త్రాల్ని చేసి కప్పుకుంది! ఇంద్రధనస్సు రెండు చేతులమధ్య బందీ అయినట్టయింది!

వివశుడైన అతని కంటి కాన్వాసుమీద ఆమె అపరంజపు నెగటివ్! రెప్ప మూస్తే మనసు కెమెరా క్లిక్ మంది! 'ఇంత అందం

యెక్కడిది?' అడిగాడు! 'నాది కాదు, కశ్మీరానిది' నవ్వింది!

అభినందనగా కశ్మీరీ శాలువా కప్పాడు!

వెచ్చదనం... చిన్నప్పుడెప్పుడో చలికాలంలో అమ్మమ్మ మంచం కింద కుంపటి పెట్టినట్టు వెచ్చదనం! మంచులో మంట! పులిలాంటి చలి పిల్లిలా అయిపోయి తోక ముడుచుకుంది!

అదే శాలువాని అమ్మ యిప్పుడు మరింతగా కప్పుకుంది! అయినా యెప్పటిలా చలి తగ్గలేదు!

'నీకేమయింది?' అన్నట్టు చూసిన నాన్న- అమ్మ నుదుటిమీద చెయ్యి పెట్టి చూశాడు! 'ఒంట్లో నలతగా వుందా?' అడిగాడు! అమ్మ తల అడ్డంగా వూపింది! 'సరిగ్గా తిన్నావో లేదో' గొణుక్కున్నట్టు నాన్న అన్నాడు! 'కశ్మీరీ ఆపిల్' అని తెచ్చి చేతిలో పెట్టాడు! తినమన్నాడు! వద్దంది! నాన్న వొప్పుకోలేదు! అమ్మ బుగ్గలు నిమిరి 'యీ ఆపిల్స్ రెండూ నాకు' అని నవ్వి కవ్వించాడు!

అమ్మ ఆపిల్ పండుని కొరికింది! తెల్లని గుజ్జు క్షణాల్లో యెర్రగా మారుతూ వుంది!

అమ్మా నాన్నా యిద్దరూ వొకరి ముఖాలు వొకరు చూసుకున్నారు! పంటి చిగుళ్ల వల్ల రక్తం అంటిందేమో? అనుమానపడ్డాడు నాన్న! అదే మాట అన్నాడు! లేదన్నట్టు అమ్మ అడ్డంగా తలూపింది!

వెంటనే నాన్న మిగతా ఆపిల్ పళ్లన్నీ కోశాడు! అన్నిటికీ లోపల తెల్లగానే వుంది గుజ్జు! కొత్తది అమ్మకు అందించాడు!

అమ్మ ఆపిల్ పండుని మళ్లీ కొరికింది! తెల్లని గుజ్జు క్షణాల్లో యెర్రగా మారుతూ వుంది! అమ్మ ముఖంలో ఆందోళన! గమనించి 'అరే యేమీ లేదురా కన్నా... నువ్విందాక కుంకుమ పువ్వు తాగావుగా' అదీ సంగతి అన్నట్టు తేలికగా వూపిరి పీల్చుకున్నాడు నాన్న!

అమ్మ ముఖంలో ఆందోళన మాత్రం మాయమవలేదు!

నాన్న రూఢి పరిచే వుద్దేశంతో కొత్త ఆపిల్ పండు ముక్కని కొద్దిగా కొరికాడు! అంతే అలా కొరికిన మరుక్షణమే ఆపిల్ పండు గుజ్జు మీద పంటి అచ్చులు పడ్డ చోటు నుండి యెర్రదనం కమ్ముకుంటూ పండంతా విస్తరిస్తూ వుంది! నాన్న చేతిలో నుండి కొరికిన ఆపిల్ పండు జారి కింద పడింది!

ఉలికిపాటుకి గురయిన నాన్న! 'ఇంతకు ముందు ఆపిల్ తిన్నావా?' అని వణుకుతున్న గొంతుతో అడిగాడు! 'ఊ..' తలాడించింది అమ్మ!

పిచ్చివాడిలా చూసిన నాన్న 'డాక్టరు దగ్గరకు వెళ్దాం పద' అన్నాడు! 'ఈ రాత్రిమీదా?' వద్దన్నట్టు అమ్మ తలడ్డంగా వూపింది! 'అదికాదు...' నాన్న సర్ది చెప్పబోయాడు! 'రేపు తెల్లవారి చూద్దాం' అమ్మ ఆవలింత తీసి అలాగే బెడ్ మీద నెమ్మదిగా చేరబడింది! నాన్న యేదో చెప్పబోయాడు! అప్పటికే అమ్మ కళ్లు మూసుకుంది!

అమ్మ బెడ్ కు యెదురుగా బెదురుగా కుర్చీలో అలాగే కూర్చున్నాడు నాన్న!

నిశ్శబ్దం!

ఆలోచిస్తూ సెల్ చూసుకుంటున్నాడు నాన్న! మధ్యలో తలెత్తి అమ్మ పొట్ట వంక చూశాడు! కడుపులోని బిడ్డ కలియదిరుగుతోన్న కదలికలు చూసి తలతిప్పి అమ్మని చూశాడు! కళ్లు మూసుకొనే వుంది! సెల్ పక్కన పడేసి కుర్చీ చప్పుడు కాకుండా ముందుకు జరుపుకొని వుత్సుకతగా అమ్మ కడుపుకి ఆనీ ఆననట్టు తలానించాడు! అమ్మ కళ్లు తెరచి చూసిన విషయం నాన్న గమనించలేదు!

నిశ్శబ్దాన్ని చిన్ని గొంతుక చెదరగొట్టింది!

'అమ్మా... కథ చెప్పవూ?'

ఉలిక్కిపడ్డాడు నాన్న! హతాశుడయాడు! భ్రమనుకున్నాడు! భ్రాంతనుకున్నాడు! నమ్మలేకపోయాడు! అమ్మని పేరు పెట్టి పిలిచాడు! 'ఊ...' అంది అమ్మ!

'అమ్మా...'

'నాకు వొంట్లో నీరసంగా వుంది నాన్నా'

తల్లీ బిడ్డల మాటలు విన్న నాన్నకు తల దిమ్మెక్కిపోయి మాట్లాడకుండా వుండిపోయాడు!

'నువ్వు కథ చెప్పకపోతే నాకు నిద్రెలా వస్తుంది చెప్పు?'

'రేపు చెప్తాలే!'

'నీకు నిద్రొస్తోందా అమ్మా?'

'లేదురా... తలనొప్పిగా అలసటగా వుందిరా చిన్నా'

'పోనీ నేను చెప్పనా?' అడగాలనుకున్నాడు నాన్న, సిద్ధమవుతూ అంతదాకా బిగబట్టుకున్న వూపిరిని మెల్లగా వదిలాడు!

'నేను చెప్పనా?'

ఉలిక్కిపడ్డాడు నాన్న, యెవరిదా గొంతన్నట్టు! ట్వీన్సా... అనుమానం అరక్షణంలో తీరిపోయింది!

'ఎవరది?'

'నేను... కుంకుమ పువ్వుని!'

'ఏంటి... యివాళ మరీ యింత యెర్రగా వున్నావ్?'

'నువ్వు యెర్రగా కావాలి కదా?'

'అదిసరే నీకింత యెరుపు యెక్కడిది?'

'ఆ కథ వద్దులే!'

'ఔనూ... నువ్వు కశ్మీరు నుండి నా కోసం వచ్చావటగా- అమ్మ చెప్పింది!'

'నీలాంటి పిల్లలకోసం అమ్మల నమ్మకం కోసం రాకుండా యెలా వుండను?'

'ప్చ్... కిలో కేసారాలు తయారు చేయాలంటే రెండు లక్షల పువ్వులు అవసరమవుతాయట కదా?'

'మీ అమ్మ నీకు చాలా విషయాలు చెప్పిందే?'

'ఇవాళ నీ యెరుపు చూసి అమ్మ భయపడింది... అమ్మ భయమే నాది కూడా!'

'.................................................'

'ఓ కుంకుమ పువ్వా... నీ యెరుపుని నా దగ్గర కూడా దాస్తావా?'

'లేదు, నేను పుట్టిన నేలంతా యెర్రని రక్తమే యింకింది... అందుకేనేమో నాకింత యెరుపు!'

'ఔనూ... అమ్మకి నాన్న చెపుతుంటే విన్నాను... యిక కశ్మీరు కశ్మీరీలది కాదట?'

ఇంతలో నాన్న ఫోను మోగింది! సైలెంటు బటన్ నొక్కాడు! ఊళ్లోని వాళ్ళ అమ్మానాన్న దగ్గర్నుండి ఫోను! అదీ యీ అపరాత్రి వేళలో! అనుమానంగా అప్రయత్నంగా లిఫ్ట్ చేశాడు! అమ్మ లేస్తుంది అన్నట్టు కాస్త దూరంగా వెళ్లాడు!

'నాన్నా... చెప్పండి' నాన్న అయిష్టంగానే అన్నాడు!

'తిన్నారా... యింకా నిద్రపోలేదా?' ఫోనులో అవతలి గొంతు నిశ్శబ్దానికి స్పష్టంగా వినిపిస్తోంది!

'చెప్పండి...' నాన్న గొంతులో ఆగలేనితనం!

'ఏం లేదురా... తెల్లవారే చేద్దామనుకున్నాను, మీ అమ్మ వొప్పుకోలేదు... మీ పెద్దమ్మ కొడుకు సూర్యనారాయణ లేడూ...?' అని అవతలి గొంతు ఆగింది!

'ఏమయింది?' ఆగలేక నాన్న!

'వాణ్ని చంపేశార్రా...' ఫోను గొంతు రుద్దమైంది!

'ఏమైంది? ఎవరు చంపేశారు? ఎందుకు చంపేశారు?' నాన్న ప్రశ్నలమీద ప్రశ్నలు వేస్తున్నాడు!

'ఏం చెప్పన్రా?, ఊళ్లో వున్నప్పుడు యేదో వొక పార్టీతో వుండాలి! ఊళ్లు యిన్నాళ్లలా లేవు! ఇన్నాళ్లి రోజులా కావు! వయ్యెస్సార్ కాంగ్రెస్తోనైనా వుండాలి, కాదంటే తెలుగుదేశంతోనైనా వుండాలి! ఎవరితో వుండకుండా నామట్టుకు నేను వుంటానంటే, నా బతుకు నేను బతుకుతానంటే అవుతుందా? అవదు కదా? కళ్లగ్గసం... కడుపు మంట... మాట కాద మాట... దన్నులేదు... మాటు కాసి వేస్తారు...'

నాన్న యేమీ మాట్లాడలేదు!

'నువ్వు రానక్కరలేదు! నేనే వెళ్తాను, కోడలికి రేపో మాపో పురుడొచ్చేలా వుంది కదా– ఆమాటే చెప్తాను! కోడలు పిల్ల బాగుంది కదా, అన్నీ బాగుండి నువ్వు కార్యం నాటికి రాగలిగితే రా! జాగ్రత్తరా! మీ అమ్మ రేపు మాట్లాడుతుందిలే...' అవతలి ఫోనూ గొంతూ తెగినట్టు మూగబోయింది!

నిశ్శబ్దం ఆవరించింది!

నాన్న అలా వచ్చి కుర్చీలో కూలబడ్డాడు!

అమ్మ నాన్నని చూసింది! 'ఏం లేదు, నువ్వు నిద్రపో' అన్నాడు నాన్న! అమ్మ రెప్పలార్పకుండా చూసింది, అంతా విన్నట్టు!

భయపెట్టే నిశ్శబ్దం!

కొన్ని క్షణాలు గడిచాయి!

కడుపులో బిడ్డ కలియదిరిగింది!

'అమ్మా నువ్వెందుకు భయపడుతున్నావ్? నువ్వు భయపడితే నాకూ భయమేస్తుందే!'

ఆ గొంతు విని అమ్మా నాన్నా యిద్దరూ వొకరి ముఖాలు వొకరు చూసుకున్నారు!

'అమ్మా...'

అమ్మ పలకలేదు! ఏమని పలకాలో తెలీలేదు!

'ఓ కుంకుమ పువ్వా నువ్వయినా మాట్లాడు!'

'.................................................'

'తొలి సుగంధమా... నిన్నే... మాట్లాడు!'

'ఏం మాట్లాడను? మనిషయినా దేశమయినా వొక్కటే! ఎటో వొక వైపు వుండాలి! విన్నావుగా, లేకపోతే చావే! బతుకు లేదు! ఉండదు!'

'అంటే?'

'బలవంతుల మధ్య బలహీనులు బతకలేరు! వాళ్ళ కాళ్ల కింద పడి నలిగి నాశనమైపోవాల్సిందే! కోడిబెయ్యలు కోడిబెయ్యలు కుమ్ముకుని లేగబెయ్యల ప్రాణం తీసినట్టు!'

'ఎవరా బలవంతులు?'

'.................................................'

'ఊ... పర్లేదు, చెప్పు...'

'.................................................'

'నువ్వలా మాట్లాడకుండా వుండకు! నేను అమ్మ కడుపులో వున్నాను, స్వచ్ఛంగా!'

'.................................................'

'భయపడకు... నాకు దేశభక్తి లేదు! నువ్వు నన్ను నమ్మొచ్చు!'

'సరే, నువ్వున్నది యెక్కడ?'

'మా అమ్మ కడుపులో!'

'మీ అమ్మ కడుపులో నువ్వున్నట్టే మా అమ్మ కడుపులో మేమున్నాం! మా అమ్మ కడుపు మా నేల! కశ్మీరం! దాన్ని యిటు నుంచి పాకిస్తానూ ఆక్రమించింది! అటు నుంచి చైనా ఆక్రమించింది! మధ్యలో భారతదేశం 'తొలినుండి మాతో విలీనంకండి... మాతో వుండండి... మీకు బలమవుతాం బలగమవుతాం' అని, 'మీ పౌరసత్వం మీకు వుంటుంది' అని యిన్నాళ్లూ నమ్మబలికింది! కానీ పాకిస్తానూ చైనాలు చేసిందే భారతదేశమూ చేసింది! కాకపోతే నమ్మించి చేసింది! అధికారికంగా చేసింది! రాజముద్ర వేసి మరీ నమ్మక ద్రోహం చేసింది!'

'అసలు మీరు యెందుకు నమ్మారు?'

'మా అమ్మ చిన్నది! అందుకే లోకువ! పాకిస్తాను మా అమ్మ కడుపులోకి చొరబడుతుంటే చేసేది లేక దారి లేక మీ దేశాన్ని ఆశ్రయం అడిగాం... మీ గొడుగు కిందకు వచ్చి నిలబడ్డాం! మళ్లీ బయటకు వెళ్లే అవకాశమే లేదు! బయటికెళ్తే భూతము! వెళ్లకుండా వుంటే పిశాచము!'

'పోనీ వుండి సుఖపడ్డారా?'

'ఊ... పడ్డాం! ఏళ్లకు యేళ్లుగా దాడులు పడ్డాం! దగా పడ్డాం! పాకిస్తాను ఏజెంట్లుగా ముద్ర పడ్డాం! మీ దేశానికి యిన్ఫార్మర్లగా మారలేక చిత్రహింసలు పడ్డాం! టెర్రరిస్టులుగా ముద్ర పడ్డాం! మానభంగాలు పడ్డాం! మృత్యువాత పడ్డాం! ఆచూకీ లేకుండా పోయాం! మాయమై పోయాం! మా దేశమూ మేమూ నిత్య గాయమై పోయాం!'

పైకి ప్రశాంతంగా కనిపించే కశ్మీరం నిప్పుల కుంపటిలా తోచింది అమ్మ నాన్నలకి! మొఘల్ చక్రవర్తి జహంగీర్ తప్పు మాట్లాడాడు! విహారులకు మాత్రమే స్వర్గం! స్థానికులకు నరకం!

'చేసుకున్న భాషలు?'

'చెరిగిపోలేదు, చరిత్రలో అలాగే వున్నాయి! విలీన సమయంలో జరిపిన ప్రజాభిప్రాయ సేకరణకి కట్టుబడి వుంటాం! అక్కడి ప్రజలు మనలను విడిచి వెళ్లాలని కోరుకున్నపుడు కశ్మీరును వదిలి రావడంలో వెనుకాడేది లేదు! కశ్మీరీ ప్రజలదే అంతిమ నిర్ణయం! ఆ నిర్ణయానికి మేం కట్టుబడి వుంటాం! గొప్ప దేశంగా యిచ్చిన మాటను తప్పి వెనక్కి వెళ్లం... అని మీ దేశ తొలి ప్రధాని అంతర్జాతీయ వేదికల మీద అన్నారు!'

'మరి ఎందుకిదంతా?'

'శాంతి కోసం!'

'అవునా?'

'చెప్పేవాడు బలవంతుడయితే వినాలి! నమ్మాలి! పడాలి!'

'ఈ సత్యం ప్రపంచానికి తెలీదా?'

'ఎందుకు తెలీదు? తెలుసు! మతాన్ని మధ్యపెట్టి మీ దేశ ప్రజలకే సత్యం తెలీకుండా అసత్యాలు ప్రచారం చేశారు! అవే మీరు నమ్మారు!'

అమ్మా నాన్నా ముఖాముఖాలు చూసుకున్నారు! చేయని తప్పుకు తలవంచుకున్నట్టు మౌనంగా వున్నారు!

'మీ అమ్మ కడుపులో మీకు చోటు లేకపోతే యెలా?'

'మా నేలమ్మ మాది యెప్పుడూ కాదు! అప్పుడు తెల్లవాడు మమ్మల్నీ మాదేశాన్నీ మా సర్వస్వాన్ని మా ప్రమేయం లేకుండా డబ్బై అయిదు లక్షలకు గులాబ్ సింగుకు అమ్మేశాడు! ఇప్పుడు కూడా మా ప్రమేయం లేకుండా మా అభిప్రాయాలతో సంబంధం లేకుండా కార్పోరేట్లకు అమ్మడానికి మా నేలపై గుత్తాధిపత్యం చెలాయించడానికి మా అమ్మ కడుపులోకి దేశసరిహద్దులు దాటి టెర్రరిస్టులు చొరబడినట్టు చొరబడ్డారు!'

'అదెలా?'

అమ్మానాన్నా వొకరి ముఖాలు వొకరు చూసుకున్నారు! వారి కళ్ల ముందు కశ్మీరు దిగ్బంధనం కదలాడింది!

'పర్యాటకుల్ని తరలించారు! కశ్మీరులోకి ప్రవేశం నిషేధించారు! పారామిలటరీ బలగాలను తెచ్చి పాగా వేయించారు! ఫోన్లూ నెట్ వర్కులూ పనిచేయకుండా చేశారు! ఇళ్లలోనే యెక్కడి వాళ్లని అక్కడే ఖైదు చేయించారు! ఇంటి చుట్టూ మనుషుల చుట్టూ యినుప చువ్వల ముళ్లకంచెలతో కట్టి పడేశారు! కాదన్న వాళ్లని కనిపించకుండా చేశారు! హింసతో చిత్రహింసలతో భయభ్రాంతులకు గురి చేస్తూనేవున్నారు!'

'ప్చ్...'

'మావొంటి మీది దెబ్బలు మా తరువాతి తరం లెక్కకట్టి అప్పు తీర్చుకుంటుంది!'

ఆ మాటకు అమ్మా నాన్నా వులిక్కిపడ్డారు!

'మా పాలకుల చర్యలతో ప్రజలకు సంబంధం లేదు! లేదు గాక లేదు!' అమ్మా నాన్నా గట్టిగా అరిచారు!

ఆ రాత్రి వేళ ఆ అరుపు వురుము వురిమినట్టు పిడుగు పడినట్టు పెద్ద శబ్దమే చేసింది!

'అమ్మ చనుబాలు కంటే ముందు కుంకుమ పువ్వు పాలు తాగినందుకైనా నీ దుఃఖం తీరాలి! మేం తీర్చాలి!'

చురుగ్గా కదిలింది బిడ్డ!

'కుంకుమ పువ్వా... నిన్ను మాకిచ్చిన చేతులతో చేయి కలిపి మీ కన్నీళ్లు తుడుస్తాం!' పెగలని అమ్మ గొంతుకని అందుకున్నట్టు నాన్న గొంతుక!

అమ్మకు తొమ్మిది నెలలు నిండాయి! పురిటి నొప్పులు మొదలయ్యాయి!! ✽

కారాగారంలో కశ్మీర్



# ఈ నిశ్శబ్దమే ఇప్పుడు బిగ్గరగా వినిపిస్తున్న నినాదం

అరుంధతి రాయ్

అనువాదం: ప్రశాంతి



బ్రిటిష్ పాలన నుంచి స్వాతంత్ర్యం పొంది 72 ఏళ్లు నిండిన సందర్భంగా భారత్‌లో వేడుకలు జరుగుతుండగా, చింపిరి బట్టల చిన్న పిల్లలు దిల్లీలోని ట్రాఫిక్ మధ్యలో తిరగాడుతూ పెద్ద సైజు జాతీయ జెండాలు, ప్లాస్టిక్ పట్టీలు అమ్ముతున్నారు. దానిపై 'మేరా భారత్ మహాన్' అనే అక్షరాలున్నాయి. నా భారతదేశం గొప్పది. నిజం చెప్పాలంటే, ఈ క్షణాన అలా అనుకోవాలంటే ఇబ్బందిగా ఉంది. ఎందుకంటే, మన ప్రభుత్వం చాలా దుర్మార్గంగా వ్యవహరించినట్టు స్పష్టంగా కనిపిస్తోంది.

ఒకప్పటి స్వతంత్ర జమ్మూ కశ్మీర్ రాజ్యం భారత్‌లో భాగంగా మారడానికి పునాదిగా ఉన్న 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెషన్' (విలీనపత్రం) లోని మౌలిక షరతులకు ప్రభుత్వం ఆగస్ట్ మొదటివారంలో చెల్లుచీటీ ఇచ్చింది. దీనికి సన్నాహక చర్యగా ఆగస్ట్ 4 అర్ధరాత్రి యావత్ కశ్మీర్‌ను అది ఒక పెద్ద బందీఖానాగా మార్చేసింది. 70 లక్షల మంది కశ్మీరీలను తమ తమ ఇళ్లకే పరిమితమై ఉండిపోయేలా కట్టుదిట్టం చేసింది. ఇంటర్నెట్ కనెక్షన్లు కత్తరించింది. ఫోన్ సేవలు స్తంభింపజేసింది.




భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 370ని రద్దు చేస్తున్నట్టుగా హోంమంత్రి అగస్ట్ 5న తీర్మానం ప్రవేశపెట్టారు. 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెషన్' ప్రకారం చట్టపరమైన బాధ్యతలన్నీ ఈ ఆర్టికల్‌లోనే నిర్వచించారు. విపక్ష పార్టీలన్నీ చేతులు నలుపుకుంటూ ఉండిపోయాయి. మరుసటిరోజు సాయంత్రం వరకు ఎగువసభ, దిగువసభ రెండింటిలోనూ జమ్మూ కశ్మీర్ పునర్వ్యవస్థీకరణ చట్టం, 2019కి ఆమోదం లభించింది. ఈ చట్టం జమ్మూ కశ్మీర్‌కు ప్రత్యేక హోదా లేకుండా చేస్తుంది. ఈ హోదాలో భాగంగా ఇప్పటి వరకు ఉన్న సొంత రాజ్యాంగం, సొంత జెండా ఇకపై దానికి లేకుండా పోతాయి. దానికి రాష్ట్ర హోదా కూడా లేకుండా పోతుంది. అంతేకాదు, అది రెండు కేంద్రపాలిత ప్రాంతాలుగా విడిపోతుంది. మొదటిదైన జమ్మూ కశ్మీర్‌ను దిల్లీలోని కేంద్ర ప్రభుత్వం నేరుగా పాలిస్తుంది. దానికి స్థానికంగా ఎన్నికైన శాసనసభ ఉన్నప్పటికీ, దాని అధికారాలు చాలా పరిమితంగా ఉంటాయి. రెండోది లద్దాఖ్. దీన్ని దిల్లీలోని కేంద్ర ప్రభుత్వమే నేరుగా పాలిస్తుంది. శాసనసభ వుండదు.

ఈ చట్టానికి బల్లలను చరచడమనే బ్రిటిష్ సంప్రదాయం ద్వారా పార్లమెంటులో స్వాగతం పలికారు. అక్కడి గాలి నిండా వలసవాద వాసనలు వ్యాపించాయి. ఎట్టకేలకు ఒక మాటవినని వలసను - దాని మేలు కోసమే అనుకోండి - తమ రాజ్యాధిపత్యం కిందకు తెచ్చుకోగలిగామన్నట్టుగా ప్రభువులు అమితానందపడ్డారు. భారత పౌరులు ఇప్పుడు తమ కొత్త సంస్థానంలో భూములు కొనుక్కోవచ్చు, స్థిరపడొచ్చు. వ్యాపారాల కోసం కొత్త భూభాగాల ద్వారాలు తెరచుకున్నాయి. భారత్‌లో అత్యంత ధనవంతుడైన పారిశ్రామికవేత్త, రిలయన్స్ ఇండస్ట్రీస్ అధిపతి ముకేశ్ అంబానీ త్వరలోనే అనేక ప్రకటనలు చేస్తానని హామీ ఇచ్చాడు. దీంతో లద్దాఖ్, కశ్మీర్‌లలోని సున్నితమైన హిమాలయ జీవావరణంపై ఎలాంటి ప్రభావం పడుతుంది? భారీ హిమనీనదాలతో కూడిన అక్కడి నేల పరిస్థితి ఎలా మారుతుంది? ఎత్తయిన ప్రాంతాల్లో వుండే సరస్సుల గతి ఏమవుతుంది? ఐదు ప్రధాన నదుల సంగతేంటి...? మొదలైన ప్రశ్నలు మాత్రం ఎవ్వరికీ అక్కర్లేదు.

ఈ రాష్ట్రానికి ఉన్న చట్టపరమైన హోదాను రద్దు చేయడం అంటే, అది ఆర్టికల్ 35ఏ రద్దు కూడా. ఈ ఆర్టికల్ ద్వారా వారికి లభించిన హక్కులూ, విశేషాధికారాలతో ఇప్పటివరకూ వారు తమ ప్రాంతానికి తామే యజమానులుగా ఉంటూ వచ్చారు. 'వ్యాపారం కోసం ద్వారాలు తెరవడం' అంటే ఇజ్రాయిల్ తరహా సెటిల్మెంట్లు, టిబెట్ తరహా జనాభా బదిలీలు కూడా అందులో భాగంగా ఉంటాయని తప్పక గుర్తుంచుకోవాలి. ప్రత్యేకించి కశ్మీరీలను ఇది ఎంతో కాలంగా వెంటాడుతున్న ప్రాథమిక భయం. పచ్చని అడవులతో అలరారే ఈ లోయలో ఒక అందమైన ఇల్లు కట్టుకోవాలని ఉబలాటపడుతున్న, విజయగర్వం తొణికిసలాడే భారతీయులు ఒక్కసారే ఒక బలమైన వెల్లువతో విరుచుకుపడి తమను మొత్తంగానే తుడిచిపెట్టెయ్యచ్చన్న వారి అత్యంత భయానక పీడకల ఇప్పుడు ఎంతో అవలీలగా

నిజంగా కూడా మారొచ్చు.

ఈ కొత్త చట్టానికి సంబంధించిన వార్తలు వ్యాపించగానే అన్ని చారల భారతీయ జాతీయవాదులు సంతోషాల్లో మునిగిపోయారు. ప్రధాన స్రవంతి మీడియాలోని అత్యధిక భాగం చాలా హీనస్థాయికి దిగిపోయింది. సాష్టాంగపడింది. వీధుల్లో గంతులువేశారు. ఇంటర్నెట్‌లో భయంకరమైన స్త్రీద్వేషం వ్యాపించింది. ఢిల్లీ పక్క రాష్ట్రమైన హరియాణా ముఖ్యమంత్రి మనోహర్‌లాల్ ఖట్టర్ తమ రాష్ట్రంలో పడిపోయిన లింగనిష్పత్తిని మెరుగుపర్చడంలో తాము చేసిన కృషి గురించి మాట్లాడుతూ, వ్యంగ్యధోరణిలో ఇలా అన్నారు: "మనం బీహార్ నుంచి అమ్మాయిల్ని తెచ్చుకుందామని మన ధాకడ్‌జీ అంటుండేవారు. ఇప్పుడు కశ్మీర్ తెరచుకుంది. మనం అక్కడి నుంచి కూడా అమ్మాయిల్ని తెచ్చుకోవచ్చని వాళ్లంటున్నారు." ఈ అశ్లీల వేడుకల రొద మధ్యలో... నిరంతర గస్తీ, బారికేడ్ల మధ్యనే కశ్మీర్ వీధుల్లో రాజ్యమేలుతున్న నిశ్శబ్దమే అన్నింటికన్నా గట్టిగా వినబడుతోంది. కశ్మీర్‌లో నలువైపులా గజిబిజిగా అల్లిన రేజర్ వైర్ల మధ్య, ఆకాశంలోంచి పహారా కాస్తున్న మానవరహిత విమానాల నిఘా కింద, కమ్యూనికేషన్ సాధనాలన్నీ పూర్తిగా స్తంభించిపోయిన స్థితిలో బందీయై, అవమానాలతో కుంగిపోయిన దాదాపు 70 లక్షల మంది జనం మౌనమే ఎంతో గట్టిగా వినిపిస్తోంది. నేటి సమాచార యుగంలో ఒక ప్రభుత్వం బయటి ప్రపంచంతో ఒక మొత్తం జనాభాకు ఉండే సంబంధాలన్నింటినీ ఇంత సులువుగా, ఒక్క ఉదుటున అనేక రోజుల పాటు తెంచివేయగలిగిందంటే... మనం ఏ దిశగా వెళ్తున్నామో లోతుగా ఆలోచించాల్సిందే.

'దేశ విభజన'లో అసంపూర్తిగా మిగిలిపోయిన పని కశ్మీర్ అని వాళ్లు తరచుగా చెబుతుంటారు. దీని అర్థం ఏంటంటే, ఉపఖండం గుండా బ్రిటిష్ వాళ్లు పరమ అజాగ్రత్తగా సరిహద్దులు గీసినప్పుడు వాళ్లు ఒక 'మొత్తం'ను విభజించారు. కానీ అసలు వాస్తవం ఏంటంటే, ఆనాడు 'మొత్తం' అనేది లేనే లేదు. బ్రిటిష్ ఇండియా భూభాగంతో పాటు ఆనాడు వందలాది ఇతర స్వతంత్ర రాజ్యాలుండేవి. వీటిలో ప్రతి ఒక్క రాజ్యంతోనూ విడివిడిగా చర్చలు జరిపి అవి భారత్‌లో లేదా పాకిస్తాన్‌లో ఏ షరతుల ప్రాతిపదికన విలీనమవుతాయో బేరసారాలు జరిపారు. విలీనం కావడానికి ఇష్టపడని చాలా రాజ్యాలను బలవంతంగా ఒప్పించారు. దేశవిభజన, ఆ క్రమంలో జరిగిన భయంకరమైన హింస ఈ ఉపఖండపు స్మృతుల్లో ఎన్నటికీ మానని గాయాలను మిగిల్చాయి. మరోవైపు ఆ కాలంలోనూ, ఆ తర్వాతి నుంచి ఇప్పటివరకూ భారత్, పాకిస్తాన్‌లలో జరిగిన, జరుగుతూ వస్తున్న హింసకు దేశవిభజనతో ఎంత సంబంధం ఉందో, అనేక ప్రాంతాల్లో జరిగిన సమీకరణ (assimilation) ప్రక్రియతోనూ అంతే సంబంధం ఉంది. జాతి నిర్మాణం పేరుతో భారత్‌లో సాగుతున్న సమీకరణ ప్రాజెక్ట్ తీరు ఎలా ఉందంటే, 1947 నుంచి ఇప్పటి వరకు దేశ సరిహద్దుల లోపలే తన 'సొంత ప్రజలకు' వ్యతిరేకంగా భారత సైన్యాన్ని ఉపయోగించని ఏడాది ఒక్కటి కూడా లేదంటే అతిశయోక్తి కాదు. ఈ జాబితా చాలా పెద్దది - కశ్మీర్, మిజోరం, నాగాలాండ్, మణిపూర్, హైదరాబాద్, అస్సాం. ఈ సమీకరణ వ్యవహారం చాలా సంక్లిష్టంగా, బాధాకరంగా కొనసాగుతోంది. ఈ క్రమంలో పదుల వేల మంది ప్రాణాలు కోల్పోయారు. మునుపటి జమ్మూ కశ్మీర్ రాష్ట్రంలో సరిహద్దుకు రెండు వైపులా ఈరోజు ఆవిష్కృతమవుతున్నదంతా అసంపూర్తిగా మిగిలిపోయిన ఆ సమీకరణ వ్యవహారంలో భాగమే.

అగస్ట్ మొదటివారంలో భారత పార్లమెంటులో జరిగిందేంటంటే, 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెషన్'కు శాశ్వత సమాధి కట్టారు. నిజానికి, ఈ దస్తావేజు పుట్టుక చాలా సంక్లిష్టమైన పరిస్థితుల్లో జరిగింది. దానిపై డోగ్రా హిందూ రాజు మహారాజా హరిసింగ్ సంతకం చేశాడు. ఆయన అప్పటికే బాగా అపఖ్యాతి పాలై ఉన్నాడు. అప్పటికి అస్థిరంగా, కకావికలంగా ఉన్న అతడి జమ్మూ కశ్మీర్ రాజ్యం భారత్, పాకిస్తాన్‌ల మధ్య కొత్తగా గీసిన సరిహద్దుల భ్రంశరేఖలపై నిలబడింది. ఆయనకు వ్యతిరేకంగా 1945లో మొదలైన తిరుగుబాట్లు అప్పటికే వ్యాప్తి చెందుతున్న దేశవిభజన దావానలంతో మరింత పెచ్చరిల్లాయి, అందులో అవి ఇమిడిపోయాయి. పశ్చిమ ప్రాంత పర్వత జిల్లా పూంచ్‌లో మెజారిటీగా ఉన్న ముస్లింలు మహారాజా బలగాలపైనా, హిందూ పౌరులపైనా తిరుగుబాటుకు దిగారు. మరోవైపు, దక్షిణాన ఉన్న జమ్మూలో మహారాజా బలగాలు ఇతర స్వతంత్ర రాజ్యాలనుంచి అరువు తెచ్చుకున్న బలగాలతో కలిసి ముస్లింలను ఊచకోత కోశాయి. చరిత్రకారుల, వార్తా కథనాల అంచనాల ప్రకారం జమ్మూ నగర వీధుల్లో, దాని ఇరుగుపొరుగు జిల్లాల్లో జరిగిన ఆనాటి ఊచకోతల్లో మరణించిన వారి సంఖ్య 70 వేల నుంచి 2 లక్షల వరకు ఉంటుంది.

జమ్మూ నరమేధం వార్తలతో రగిలిపోయిన పాకిస్తానీ 'ఇర్రెగ్యులర్స్' నైరుతి సరిహద్దు ప్రావిన్స్ పర్వతాల మీదుగా ఆక్రమణకు దిగారు. వారు కశ్మీర్ లోయలో దారి పొడవునా దహనకాండలకూ, దోపిడీలకు పాల్పడ్డారు. హరిసింగ్ కశ్మీర్ నుంచి జమ్మూకు పారిపోయాడు. అక్కడి నుంచి ఆయన ఆనాటి భారత ప్రధాని జవాహర్‌లాల్ నెహ్రూను సాయం కోరారు. సరిగ్గా అప్పుడు భారత సైన్యం కశ్మీర్‌లో అడుగుపెట్టేందుకు చట్టబద్ధత కల్పించే దస్తావేజు రూపంలో 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెషన్' ఉనికిలోకి వచ్చింది. భారత సైన్యం స్థానికుల నుంచి కొంత మేరకు అందిన సహాయంతో పాకిస్తానీ 'ఇర్రెగ్యులర్స్'ను వెనక్కి నెట్టింది. కానీ లోయ అంచులో ఉండే పర్వత వరుస వరకే వారిని తరిమివేయగల్గింది. దాంతో మునుపటి డోగ్రా రాజ్యం భారత్, పాకిస్తాన్‌ల మధ్య రెండు భాగాలుగా చీలిపోయింది. ఆ తర్వాత ప్రజాభిప్రాయ సేకరణ (రెఫరెండం) జరిపించి జమ్మూ కశ్మీర్ ప్రజల అభిమతం ఏంటో తెలుసుకోవడం ద్వారా 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెషన్'కు వారి ఆమోదం పొందాలనేది ఆనాటి నిర్ణయం. కానీ ఆ రిఫరెండం హామీ ఎన్నడూ అమలుకు నోచుకోలేదు. అలా ఈ ఉపఖండంలో దారీతెన్నూ కనిపించని, ప్రమాదకరమైన రాజకీయ సమస్య పుట్టుక జరిగింది.

ఆ తర్వాత నుంచి ఇప్పటి వరకు గడచిన ఈ 72 ఏళ్ల కాలంలో వరుస ప్రభుత్వాలన్నీ నాటి 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెషన్'లోని

షరతులన్నింటినీ నిర్వీర్యం చేశాయి. నిజానికి మొన్నటి వరకు మిగిలింది దాని అస్థిపంజరం మాత్రమే. ఇప్పుడిక ఆ అస్థిపంజరం కూడా లేకుండా పూడ్చిపెట్టారు. ఈ దశ వరకూ చేరుకున్న ఈ మొత్తం పరిణామక్రమంలో చోటు చేసుకున్న మలుపుల్ని, మెలికల్ని సంక్షిప్తీకరించే ప్రయత్నం చేయడం అంటే అది వెర్రి సాహసమే అవుతుంది. అమెరికా 1950, 60ల్లో దక్షిణ వియత్నాంలో తన కీలుబొమ్మ ప్రభుత్వాల ద్వారా ఆడుకున్న సంక్లిష్టమైన, ప్రమాదకరమైన ఆటలతో మాత్రం వీటిని తప్పక పోల్చవచ్చు.

ఎన్నికల అవకతవకల సుదీర్ఘకాల చరిత్ర అనంతరం, 1987లో జరిగిన రాష్ట్ర ఎన్నికల్లో కేంద్రం బాహాటంగా రిగ్గింగ్‌కు పాల్పడటం ఓ కీలక మలుపు. అప్పటి వరకు స్వయంనిర్ణయాధికార హక్కు కావాలంటూ చాలా వరకు శాంతియుతంగానే చేస్తూ వస్తున్న డిమాండ్ కాస్తా, 1989 నాటికి స్వాతంత్ర్యాన్ని కోరుకునే బలమైన స్వరంగా మారిపోయింది. లక్షలాది మంది ప్రజలు వీధుల్లోకి రావడం, వారు ఒక దాని తర్వాత మరో నరమేధానికి బలికావడం మామూలుగా మారిపోయింది.

కొద్ది కాలంలోనే కశ్మీర్ లోయంతా మిలిటెంట్లతో నిండిపోయింది. సరిహద్దుకు రెండు వైపులకు చెందిన కశ్మీరీ యువకులతో పాటు విదేశీ ఫైటర్లకు పాకిస్తాన్ ఆశ్రయం, శిక్షణ ఇవ్వసాగింది. వారిని కశ్మీరీ ప్రజలు చాలా వరకు అక్కున చేర్చుకున్నారు. ఉపఖండం అదే సమయంలో, మీదుగా వీస్తున్న రాజకీయ పెనుగాలుల మధ్య కశ్మీర్ మరొక్క సారి చిక్కుకుపోయింది – ఒకవైపు పాకిస్తాన్, అఫ్గానిస్తాన్‌లలో రోజురోజుకూ పెచ్చరిల్లిపోతున్న అతివాద ఇస్లామ్ – ఇది కశ్మీరీ సంస్కృతికి పూర్తిగా పరాయిది. కాగా మరోవైపు, భారత్‌లో పేట్రేగిపోతున్న ఛాందసవాద హిందూ జాతీయవాదం.

ఈ తిరుగుబాటులో మొట్టమొదట బలైంది కశ్మీరీ ముస్లింలకూ, అత్యల్ప మైనారిటీ అయిన హిందువులకు మధ్య తరతరాలుగా కొనసాగుతూ వచ్చిన బంధమే. వీరిని స్థానికంగా పండిట్లు అని పిలుస్తారు. హింస మొదలయ్యాక మిలిటెంట్లు దాదాపు 400 మంది పండిట్లను టార్గెట్ చేసి హత్య చేశారని కశ్మీరీ పండిట్ సంఘర్ష్ సమితి (కేపీఎస్ఎస్) అంచనా. ఈ సంస్థ కశ్మీరీ పండిట్ల కోసం పని చేస్తుంది. 1990 చివరి నాటికి దాదాపు 25 వేల పండిట్ కుటుంబాలు లోయలోంచి పారిపోయాయని ప్రభుత్వం చెబుతున్న లెక్క. వాళ్లు తమ ఇళ్లను, పుట్టిన గడ్డను, తమదైన సర్వస్వాన్నీ కోల్పోయారు. ఆ తర్వాతి సంవత్సరాల్లో మరిన్ని వేల మంది లోయలోంచి తరలిపోయారు. దాదాపు పండిట్ల జనాభా అంతా అక్కణ్నుంచి వెళ్లిపోయిందని చెప్పొచ్చు. సంఘర్షణ కొనసాగే క్రమంలో, పదుల వేల సంఖ్యలో ముస్లింలు చనిపోగా, ఇందులో 650 మంది పండిట్లు కూడా ప్రాణాలు కోల్పోయారని కేపీఎస్ఎస్ చెబుతోంది.

అప్పటి నుంచి చాలా మంది పండిట్లు జమ్మూ నగరంలోని శరణార్థి శిబిరాల్లో దయనీయ పరిస్థితుల్లో బతుకుతున్నారు. ఇప్పటికి 30 ఏళ్లు గడుస్తున్నప్పటికీ, ఢిల్లీలో వరుసగా కొలువుదీరిన ప్రభుత్వాలేవీ వారిని తిరిగి తమ స్వస్థలాలకు పంపించే ప్రయత్నాలేవీ చేయలేదు. అందుకు బదులుగా, వారిని అనిశ్చిత పరిస్థితిలో ఉంచడానికే ప్రయత్నించాయి. వారిలోని ఆగ్రహాన్ని, సహేతుకమైన ద్వేషాన్ని మరింతగా రాజేసి, దాన్ని భారత్‌లో కశ్మీర్ పట్ల అత్యంత ప్రమాదకరమైన, అంతే సమర్థవంతమైన జాతీయవాద భావోద్వేగాలను ఎగదోసేందుకు వాడుకోవాలని ప్రయత్నించాయి. ఆ విధంగా, ఒక మహా విషాదంలోని ఒకానొక పార్శ్వాన్ని మాత్రమే పట్టుకొని, దాన్ని బలంగా, గట్టి శబ్దంతో ప్రచారం చేయడం ద్వారా మిగతా భయానక పరిణామాలన్నింటినీ తెరమరుగు చేసే ప్రయత్నం చేశాయి.

ఈ రోజు కశ్మీర్ ప్రపంచంలోనే అత్యధిక స్థాయిలో సైన్యాలు మోహరించిన ప్రాంతాల్లో ఒకటిగా, లేదా ఏకైక ప్రాంతంగా ఉంది. ఇప్పుడు స్వయంగా సైన్యమే చెబుతున్నట్టుగా కేవలం పిడికెడు మంది 'ఉగ్రవాదులను' ఎదుర్కొనేందుకు 5 లక్షలకు పైగా సైనికులు అక్కడున్నారు. గతంలో ఏవైనా అనుమానాలుంటే ఉండొచ్చు కానీ, ఇప్పుడైతే వాళ్ల అసలు శత్రువు కశ్మీరీ ప్రజలే అన్న విషయం పూర్తిగా తేటతెల్లమైంది. కశ్మీర్‌లో గత 30 ఏళ్లలో భారత్ చేసింది ఏ మాత్రం క్షమించరానిది. ఈ ఘర్షణలో దాదాపు 70 వేల మంది ప్రజలు, పౌరులు, మిలిటెంట్లు, భద్రతా బలగాలు మరణించారని ఒక అంచనా. వేలాది మంది మాయమైపోయారు. లోయ అంతటా వ్యాపించిన చిత్రహింసల ఛాంబర్లలో పదుల వేల సంఖ్యలో జనాలు చిత్రహింసలకు గురయ్యారు. నిజానికి ఇవన్నీ చిన్న చిన్న అబూ ఘ్రేబ్ కేంద్రాలే.

గత కొద్ది సంవత్సరాల్లో వందలాది మంది టీనేజర్లు పెల్లెట్ గన్ కాల్పులకు గురై కంటిచూపు కోల్పోయారు. ఒకేసారి వందలాది చిన్న చిన్న గుళ్లను గుప్పించగల పెల్లెట్ గన్స్ ఇప్పుడు గుంపులను కంట్రోల్ చేయడానికి ప్రభుత్వం బాగా ఇష్టపడుతున్న ఆయుధాలు. ప్రస్తుతం లోయలో పని చేస్తున్న మిలిటెంట్లలో అత్యధికులు యువ కశ్మీరీలే. వీరంతా స్థానికంగానే శిక్షణ పొంది, ఆయుధాలు పట్టుకుంటున్నారు. ఒకసారి తుపాకీ పట్టుకున్నామంటే తామిక ఆరు నెలలకన్నా ఎక్కువ కాలం బతకలేమన్న విషయం స్పష్టంగా తెలిసి కూడా వీరు అందుకు పూనుకుంటున్నారు. కశ్మీర్‌లో ఏ 'ఉగ్రవాది' చనిపోయినా అతడి అంత్యక్రియలకు పదుల వేల మంది కశ్మీరీలు హాజరవుతారు. అతణ్ని 'షహీద్' (అమరవీరుడు)గా కీర్తిస్తారు. 30 ఏళ్లుగా కొనసాగుతున్న సైనిక ఆక్రమణకు సంబంధించిన కొన్ని స్థూలాంశాలు మాత్రమే ఇవన్నీ. దశాబ్దాలుగా సాగుతున్న ఈ ఆక్రమణలో భాగంగా కొనసాగుతున్న అత్యంత క్రూరమైన అనుభవాలను ఇంత చిన్న వ్యాసంలో వర్ణించాలంటే అది సాధ్యం కాని పని.

ప్రధానిగా నరేంద్ర మోదీ తన మొదటి ఐదేళ్ల కాలంలో చేపట్టిన కఠిన వైఖరి మూలంగా కశ్మీర్‌లో హింస మరింత పెచ్చరిల్లింది. గత ఫిబ్రవరిలో ఒక కశ్మీరీ సూసైడ్ బాంబర్ ఆత్మాహుతి దాడికి పాల్పడగా 40 మందికి పైగా భద్రతా సిబ్బంది మరణించారు. దానికి ప్రతిగా పాకిస్తాన్‌పై భారత్ వైమానిక దాడి జరిపింది. పాకిస్తాన్ ఎదురుదాడి చేసింది. అలా ఈ రెండు దేశాలూ పరస్పరం

వైమానిక దాడులు చేసుకున్న మొట్టమొదటి అణ్వాయుధ దేశాలుగా చరిత్రలో నిలిచిపోయాయి. నరేంద్ర మోదీ రెండో పాలనా కాలం మొదలై రెండు నెలలు గడిచాక ఇప్పుడు ఆయన ప్రభుత్వం అత్యంత ప్రమాదకరమైన ఎత్తు వేసింది. నిజానికి అది తుపాకీమందు గిడ్డంగిపై ఓ మండుతున్న అగ్గిపుల్లను విసిరడంతో సమానమే.

పైపెచ్చు, ఈ నిర్ణయాన్ని అమలు చేసేందుకు అనుసరించిన ఎత్తుగడలు మరీ చౌకబారుగా, మోసపూరితంగా, అసహ్యకరంగా ఉన్నాయి. జులై చివరి వారంలో వేర్వేరు సాకులతో దాదాపు 45 వేల అదనపు బలగాలను ఆదరబాదరగా కశ్మీర్‌కు పంపించారు. అమర్నాథ్ యాత్రకు పాకిస్తానీ టెర్రరిస్టు దాడి ప్రమాదం పొంచి ఉందని పుకార్లు పుట్టించారు. ఏటా సాగే ఈ యాత్రలో లక్షలాది మంది హిందూ భక్తులు ఎత్తైన కొండలపైకి ఎక్కుతారు. (వీరిని కశ్మీరీ బోయీలు మోసుకెళ్తారు.) భక్తులు అమర్నాథ్ గుహలో పూజలు నిర్వహిస్తారు. అక్కడ సహజంగా ఏర్పడిన మంచు శకలం శివుడి అవతారమని వారు విశ్వసిస్తారు. యాత్రికులు వెళ్లే దారిలో పాకిస్తానీ సైన్యం గుర్తులున్న మందుపాతర లభ్యమైందని అగస్ట్ 1న కొన్ని టీవీ చానెల్స్ ప్రకటించాయి. తీర్థయాత్రికులందరూ (యాత్రికుల దారికి చాలా మైళ్ల దూరంలో ఉన్న పర్యాటకులు సైతం) తక్షణం కశ్మీర్ నుంచి వెనక్కి వచ్చెయ్యాలంటూ ప్రభుత్వం అగస్ట్ 2న ఒక నోటీసు ప్రచురించింది. దాంతో వారంతా గందరగోళ పరిస్థితుల్లో వెనక్కి వచ్చారు. కానీ కశ్మీర్‌లో పని చేసే దాదాపు 2 లక్షల మంది వలస కూలీల గురించి మాత్రం ఎవ్వరికీ పట్టలేదు. బహుశా వాళ్లంతా నిరుపేదలు కాబట్టి వాళ్లను వెనక్కి రప్పించడం అంత ముఖ్యమని ప్రభుత్వానికి కూడా తోచలేదేమో. శనివారం అగస్ట్ 3 వరకు పర్యాటకులు, తీర్థయాత్రికులు అందరూ వెనక్కి వచ్చేశారు. భద్రతా బలగాలు మొత్తం లోయ అంతటా పొజిషన్లు తీసుకున్నాయి.

ఆదివారం అర్ధరాత్రి వరకు కశ్మీరీలందరినీ ఇళ్లలోంచి బయటకు రాకుండా కట్టుదిట్టం చేశారు. కమ్యూనికేషన్ నెట్‌వర్క్‌ను పూర్తిగా తెంపేశారు. తెల్లారే సరికి ముగ్గురు మాజీ ముఖ్యమంత్రులు – నేషనల్ కాన్ఫరెన్స్‌కు చెందిన ఫారూఖ్ అబ్దుల్లా, ఆయన కుమారుడు ఉమర్ అబ్దుల్లా, పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీకి చెందిన మహబూబా ముఫ్తీలను, ఇంకా వందలాది మంది ఇతరులను అరెస్ట్ చేశారనే సమాచారం వచ్చింది. వీళ్లంతా భారత మద్దతుదారులైన రాజకీయ నాయకులు. ఏళ్ల తరబడి సాగుతున్న తిరుగుబాటు మధ్యనే వీరు భారత ప్రయోజనాలను కాపాడుతూ వచ్చారు.

జమ్మూ కశ్మీర్ పోలీసులను నిరాయుధం చేశారని కూడా కొన్ని వార్తాపత్రికల్లో వచ్చింది. యుద్ధరంగంలో మరెవ్వరికన్నా ఎక్కువగా ఈ స్థానిక పోలీసులే ముందు నిలబడుతుంటారు. క్షేత్రస్థాయిలో వీళ్లే ఎక్కువగా పని చేస్తారు. ఆక్రమణ యంత్రాంగానికి కావాల్సిన కీలక నిఘా సమాచారాన్ని వీళ్లే సేకరిస్తారు. తమ ప్రభువుల తరఫున క్రూరంగా పని చేస్తారు. కానీ ఎంత కష్టపడ్డా స్థానిక ప్రజల ఆగ్రహాన్ని కూడా వేరే ఎక్కువ చవి చూడాల్సి వస్తుంది. వీళ్లు ఇదంతా చేసేది కశ్మీర్‌లో భారత జాతీయ జెండా ఎగిరేలా చూడడం కోసమే. ఇప్పుడు పరిస్థితులు దాదాపు విస్ఫోటక స్థాయికి చేరిన

**“ఈ రోజు కశ్మీర్ ప్రపంచంలోనే అత్యధిక స్థాయిలో సైన్యాల మోహరించిన ప్రాంతాల్లో ఒకటిగా, లేదా ఏకైక ప్రాంతంగా ఉంది ఇప్పుడు స్వయంగా సైన్యమే చెబుతున్నట్టుగా కేవలం పిడికెడ మంది ‘ఉగ్రవాదులను’ ఎదుర్కొనేందుకు 5 లక్షలకు పైగా సైనికుల అక్కడున్నారు. గతంలో ఏవైనా అనుమానాలుంటే ఉండొచ్చు కానీ ఇప్పుడైతే వాళ్ల అసలు శత్రువు కశ్మీరీ ప్రజలే అన్న విషయం పూర్తిగ తేటతెల్లమైంది. కశ్మీర్‌లో గత 30 ఏళ్లలో భారత్ చేసింది ఏ మాత్ర క్షమించరానిది. ఈ ఘర్షణలో దాదాపు 70 వేల మంది ప్రజలు పౌరులు, మిలిటెంట్లు, భద్రతా బలగాలు మరణించారని ఒ అంచనా. వేలాది మంది మాయమైపోయారు. లోయ అంతట వ్యాపించిన చిత్రహింసల ఛాంబర్లలో పదుల వేల సంఖ్యలో జనాల చిత్రహింసలకు గురయ్యారు. నిజానికి ఇవన్నీ చిన్న చిన్న అబు ఘ్రేబ్ కేంద్రాలే.”**

నేపథ్యంలో వీళ్లను కోపోద్రిక్తులైన గుంపుల ఆవేశానికి బలయ్యేలా ముందుకు నెట్టారు. కుటిలత్వం, సాధించేతత్వంలతో కూడిన తనదైన పాలనాశైలితో భారత్ కశ్మీర్‌లో ఏళ్ల తరబడి కష్టపడి తయారు చేసుకున్న మిత్రులను నరేంద్ర మోదీ ప్రభుత్వం దగా చేయడం, వారిని బహిరంగంగా అవమానించడం వెనుక అజ్ఞానం, అహంకారం ఉన్నాయి. ఇక ఇప్పుడు ఆ ప్రక్రియ ఎలాగూ పూర్తయింది కాబట్టి, మునుముందు జరుగబోయే ఘర్షణంతా వీధులకూ, సైనికులకూ మధ్యనే ఉంటుంది.

స్వయం నిర్ణయాధికారం లేదా పాకిస్తాన్‌తో విలీనాన్ని కోరుతూ వస్తున్న కశ్మీరీ ప్రజల్లోని అత్యంత మిలిటెంట్ సెక్షన్లకు భారత చట్టాల పట్ల గానీ, రాజ్యాంగం పట్ల గానీ ఎలాంటి గౌరవం లేదు. ఈ పరిణామం పట్ల వాళ్లు బాగా సంతోషిస్తారనడంలో ఎలాంటి సందేహం లేదు. తాము ఇప్పటి వరకు కుమ్మక్కుదార్లుగా చూస్తున్న నాయకులు నమ్మకద్రోహం చేశారనీ, ఎట్టకేలకు భ్రమల పరదాలన్నీ తొలగిపోయాయని వారు భావిస్తారు. అయితే వారి సంతోషం ఎక్కువ రోజులు మిగలకపోవచ్చు. ఎందుకంటే, ఇప్పుడు కొన్ని కొత్త భ్రమల పరదాలు రాబోతున్నాయి. కొత్త రాజకీయ పార్టీలు ముందుకొస్తాయి. బస్తీలో కొత్త ఆట మొదలవుతుంది.

కశ్మీర్‌పై ఆంక్షలు విధించిన తర్వాత నాలుగు రోజులకు, అగస్ట్ 8న నరేంద్ర మోదీ టెలివిజన్ ముందుకొచ్చి బాహాటంగా సంబరాలు జరుపుకుంటున్న దేశాన్నీ, బందీయైన కశ్మీర్‌ను ఉద్దేశించి ప్రసంగించారు. ఆయన ఓ మారిపోయిన మనిషిలా కనిపించారు. ఎప్పుడూ కనపడే దూకుడుతనం, వాదులాడే ధోరణి, ఎదుటివారిపై నిందలు మోపే స్వరం ఆయన ప్రసంగంలో లేవు. దానికి బదులు, ఆయన ఒక చిన్నపిల్లల తల్లిలా మృదువుగా మాట్లాడారు. ఈ రూపం ఆయనలో గతంలో ఎన్నడూ చూడనంత భయంకరంగా ఉంది.

మునుపటి జమ్మూ కశ్మీర్ రాష్ట్రానికి ఇప్పుడు పాత, అవినీతిపరులైన నాయకుల పీడ విరగడైంది కాబట్టి, ఇకపై పాలన నేరుగా ఢిల్లీ నుంచే సాగుతుంది కాబట్టి రాష్ట్ర ప్రజలకు ఏయే లాభాలు కలుగుబోతున్నాయో వివరిస్తూ, ఆ జాబితానంతా

వినిపిస్తున్నప్పుడు ఆయన గొంతులో సన్నని జీర వినిపించింది. ఆయన కళ్లలో కిందకు జారిపడని కన్నీటి తెర మెరుస్తూ కనిపించింది. ఆయన భారతీయ ఆధునికత గురించి వివరించిన తీరు చూస్తే ప్రాచీన భూస్వామ్య కాలంలోంచి ఇప్పుడే విముక్తులైన రైతుల గుంపుకు పాఠం చెప్పినట్టుగా అనిపించింది. వాళ్ల అందమైన లోయలో మళ్లీ బాలీవుడ్ సినిమాల షూటింగులు మొదలవుతాయని కూడా ఆయన చెప్పారు.

తన భావోత్తేజక ప్రసంగంలో ఆయన అసలు కశ్మీరీలపై ఎందుకు ఆంక్షల్ని విధించాల్సి వచ్చిందో, ప్రసార సాధనాలన్నింటినీ ఎందుకు తెంచెయ్యాల్సి వచ్చిందో మాత్రం చెప్పలేదు. వాళ్లకు ఇంత గొప్పగా ఉపయోగపడే ఈ నిర్ణయాన్ని తీసుకోవడానికి ముందు దీనిపై వారితో సంప్రదింపులు ఎందుకు జరపలేదో ఆయన వివరించలేదు. సైనిక ఆక్రమణ కింద జీవిస్తున్న ప్రజలు భారత ప్రజాస్వామ్య వ్యవస్థ అందించే అద్భుతమైన కానుకల్ని ఎలా అనుభవించగలుగుతారో ఆయన చెప్పలేదు. మరి కొద్ది రోజుల్లో రానున్న ఈద్‌ను గుర్తు చేస్తూ వారికి ముందస్తుగా శుభాకాంక్షలు చెప్పాలన్న విషయమైతే ఆయనకు గుర్తుంది, కానీ పండగ రోజున ఆంక్షల్ని ఎత్తివేస్తామనే హామీ మాత్రం ఇవ్వలేకపోయారు. ఎత్తేయలేదు కూడా.

మరుసటి రోజు ఉదయం భారతీయ వార్తాపత్రికలు, అనేక మంది ఉదారవాద వ్యాఖ్యాతలు, ఆఖరుకు నరేంద్ర మోదీని తీవ్రంగా విమర్శించేవారు సైతం ఆయన అద్భుత ప్రసంగానికి నీరాజనాలు పలికారు. భారత్‌లో చాలామంది, తమ సొంత హక్కులు, స్వేచ్ఛలు హననానికి గురైనప్పుడు ఎంతో విమర్శనాత్మకంగా ఉండేవారు సైతం, కశ్మీరీల పట్ల మాత్రం నిజమైన వలసవాదుల్లా, పూర్తిగా భిన్నమైన కొలమానాన్ని చేపట్టారు.

గురువారం, అగస్ట్ 15న నరేంద్ర మోదీ ఎర్రకోట మీద చేసిన స్వాతంత్ర్య దినోత్సవ ప్రసంగంలో, కశ్మీర్ విషయంలో తీసుకున్న నిర్ణయంతో చివరకు 'ఒక జాతి, ఒక రాజ్యాంగం' అన్న భారతదేశ స్వప్నాన్ని తమ ప్రభుత్వం సాకారం చేసిందని సగర్వంగా ప్రకటించారు. కానీ, మరోవైపు, ఆ ముందు రోజు సాయంత్రం ఈశాన్య భారతంలోని అనేక కల్లోల రాష్ట్రాల్లోని తిరుగుబాటు సంస్థలు స్వాతంత్ర్య దినోత్సవాన్ని బహిష్కరించాలని పిలుపునిచ్చాయి. ఈ ప్రాంతంలోని చాలా రాష్ట్రాల్లో మునుపటి జమ్మూ కశ్మీర్ రాష్ట్రంలానే ప్రత్యేక రాజ్యాంగ హోదా అమలవుతోంది. ఎర్రకోటలో నరేంద్ర మోదీ శ్రోతలు హర్షధ్వానాలు చేస్తుంటే, డెబ్బై లక్షల మంది కశ్మీరీలు కర్ఫ్యూ కారణంగా తమ తమ ఇళ్లలోనే బందీలై వుండిపోయారు. కమ్యూనికేషన్ సేవలపై ఆంక్షలు మరి కొంత కాలం పాటు ఇలాగే కొనసాగుతాయని అంటున్నారు.

ఆంక్షల ఎత్తివేత అనంతరం కశ్మీర్‌లో తలెత్తబోయే హింస అనివార్యంగా భారత్‌లోకి కూడా పాకుతుంది. దీన్ని భారతీయ ముస్లింల పట్ల మరింత ద్వేషాన్ని ఎగదోయడానికి ఉపయోగించుకుంటారు. ఇప్పటికే వారిని దుర్మార్గులుగా చిత్రీకరిస్తూ, తమ సొంత మురికికూపాలకు పరిమితం చేస్తూ, ఆర్థికంగా అణగదొక్కుతూ, తరచుగా వారిని మూక దాడుల్లో చంపేస్తున్నారు. రాజ్యం ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని దీనిపై ధైర్యంగా, బాహాటంగా గొంతెత్తుతున్న యాక్టివిస్టులు, న్యాయవాదులు, కళాకారులు, విద్యార్థులు, మేధావులు, పాత్రికేయులు తదితరులను అణచివేసేందుకు కూడా ప్రయత్నిస్తుంది.

ప్రమాదం అనేక దిశల గుండా రానుంది. నరేంద్ర మోదీ, ఆయన మంత్రుల్లో చాలా మంది సహా ఆరు లక్షలకు పైగా సభ్యత్వాన్ని కలిగి ఉన్న అత్యంత శక్తిమంతమైన మితవాద హిందూ జాతీయవాద సంస్థ ఆర్ఎస్ఎస్ చేతిలో శిక్షణ పొందిన 'స్వచ్ఛంద' మిలిషియా ఉంది. ముస్సోలినీ కాలం నాటి బ్లాక్ షర్ట్స్ దళాలు వారికి ప్రేరణ. భారత రాజ్యయంత్రంలోని ప్రతి వ్యవస్థపైనా ఆర్ఎస్ఎస్ పట్టు రోజురోజుకూ పెరిగిపోతోంది. నిజానికి, ఇప్పుడది దాదాపు రాజ్యంగా లేదా దానికన్నా ఎక్కువగా తయారైంది. ఇలాంటి రాజ్యం ఇస్తున్న అభయ హస్తంతో చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకునేందుకు వెనుకాడని లెక్కలేనన్ని సంస్థలు, హిందూ జాతి వీర సిపాయిలు దేశవ్యాప్తంగా పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నారు. వారు తమ ఘాతుకాలను పకడ్బందీగా కొనసాగిస్తున్నారు.

ఇక మేధావులు, విద్యావేత్తలు వారికి మరో సమస్య. గత మే నెలలో సార్వత్రిక ఎన్నికల్లో బీజేపీ విజయం సాధించిన మరుసటి రోజు బీజేపీ ప్రధాన కార్యదర్శి, ఆర్ఎస్ఎస్ మాజీ అధికార ప్రతినిధి ఒక వ్యాసం రాశారు. అందులో ఆయన, "దేశంలోని బౌద్ధిక, విధానపరమైన వ్యవస్థల్లో ఎక్కువ సంఖ్యలో, బలంగా వేళ్లూనుకుని ఉన్న సూడో-సెక్యులర్/లిబరల్ పాయల అవశేషాలను ఈ దేశంలోని అకాడమిక్, సాంస్కృతిక, బౌద్ధిక చిత్రపటంలోంచి తుడిచిపెట్టెయ్యాల్సిన అవసరం ఉంది" అని రాశారు. తుడిచిపెట్టెయ్యడానికి సన్నాహాలు కూడా మొదలయ్యాయి. అగస్ట్ 1న, ఊపా అనే క్రూరమైన చట్టంలో సవరణ చేస్తూ 'ఉగ్రవాది' నిర్వచనం పరిధిలోకి సంస్థలను మాత్రమే కాకుండా విడి వ్యక్తులను కూడా చేర్చారు. ఈ సవరణతో ప్రభుత్వం ఎఫ్ఐఆర్, చార్జిషీట్, విచారణ, నేరనిరూపణ అనే అనివార్య ప్రక్రియను పాటించకుండానే ఏ వ్యక్తినైనా టెర్రరిస్టుగా ప్రకటించవచ్చు. భయం గొల్పే మన హోంమంత్రి అమిత్ షా దీనిపై పార్లమెంటులో చేసిన ప్రకటన ద్వారా ఎలాంటి వ్యక్తులను సైతం ఈ చట్టం పరిధిలోకి తీసుకురాగలరో అర్థమైంది. "అధ్యక్షా, టెర్రరిజాన్ని తుపాకులు సృష్టించలేవు. టెర్రరిజానికి మూలాలు ప్రచారంలో ఉన్నాయి. టెర్రరిజాన్ని వ్యాప్తి చేసేందుకే ప్రచారం చేస్తారు. కాబట్టి అలాంటి వ్యక్తులందరినీ ఉగ్రవాదులుగా ప్రకటిస్తే పార్లమెంటు సభ్యులెవరికీ దీనిపై అభ్యంతరం ఉండదని భావిస్తున్నా" అన్నారు.

అతడి ఒళ్లు జలదరింపజేసే చూపులు మనలో చాలా మందికి నేరుగా మనవైపే ఎక్కుపెట్టినట్టుగా అనిపించింది. ఆయన తన సొంత రాష్ట్రం గుజరాత్‌లో జరిగిన అనేక వరుస హత్యల్లో ప్రధాన ముద్దాయిగా ఉన్న వ్యక్తి అన్న వాస్తవంతో ఇక్కడ వచ్చే తేడా ఏమీ

లేదు. ఆయన కేసు విచారణ జరుపుతున్న న్యాయమూర్తి జస్టిస్ బ్రిజ్‌గోపాల్ హరికిషన్ లోయా అనుమానాస్పద పరిస్థితిలో మరణించారు. ఆ తర్వాత ఆయన స్థానంలో వచ్చిన న్యాయమూర్తి అమిత్ షాను చాలా త్వరగా నిర్దోషిగా ప్రకటించారు. ఇటువంటి వాటన్నింటితో రెచ్చిపోయిన కరడుగట్టిన మితవాద యాంకర్లు భారత్‌లోని వందలాది టెలివిజన్ చానెల్లలో ఇప్పుడు అసమ్మతివాదులను బాహాటంగానే ఖండిస్తున్నారు. వారిపై విపరీత ఆరోపణలు చేస్తూ వారిని అరెస్ట్ చేయాలంటూ, లేదా ఇంకా ఘోరంగా కూడా మాట్లాడుతున్నారు. త్వరలోనే 'టీవీ ద్వారా లించింగ్' అనేది భారత్‌లో ఒక కొత్త రాజకీయ పరిదృశ్యంగా ముందుకు రావచ్చేమో. ప్రపంచం అంతా చూస్తుండగా, భారతీయ ఫాసిజం అనే శిల్పం చాలా వేగంగా ఆవిష్కృతమవుతోంది.

జులై 28న కశ్మీర్‌లో కొందరు మిత్రులను కలిసేందుకు నేను విమానం టికెట్ బుక్ చేసుకున్నా. కల్లోలం గురించిన గుసగుసలు, సైనిక బలగాల చేరవేత ప్రక్రియ అప్పటికే మొదలయ్యాయి. నేను అక్కడికి వెళ్లాలా, వద్దా అని సంశయించాను. దీని గురించి మా ఇంట్లో నేనూ, మా స్నేహితుడు చర్చించుకున్నాం. ఆయన ఒక ప్రభుత్వ ఆసుపత్రిలో పని చేసే సీనియర్ డాక్టర్. తన జీవితాన్ని ప్రజాసేవకే అంకితం చేసిన వ్యక్తి ఆయన. అలాగే ముస్లిం కూడా. జనాలను, ప్రత్యేకించి ముస్లింలను గుంపులు చుట్టుముట్టి వారితో బలవంతంగా 'జై శ్రీరాం' అనేలా చేస్తున్న పెదధోరణుల గురించి కూడా మేం మాట్లాడుకున్నాం.

కశ్మీర్‌ను భద్రతా బలగాలు చుట్టుముడితే, భారత్‌ను ఇప్పుడు గుంపులు చుట్టుముట్టాయి.

'నేనూ అదే విషయం ఆలోచిస్తున్నా' అని ఆయనన్నారు. ఎందుకంటే ఆయన తన కుటుంబాన్ని కలిసేందుకు తరచూ హైవేలపై ప్రయాణిస్తుంటారు. వాళ్ల కుటుంబం దిల్లీకి కొన్ని గంటల దూరంలో ఉంటుంది.

"నన్ను వాళ్లు చాలా సులువుగా పట్టుకోగలరు" అన్నారాయన.

"నువ్వు అలా పలకడమే మంచిది కదా, ప్రాణాలైనా కాపాడుకోవచ్చు" అని నేనన్నాను.

"నేనలా అనను, ఎందుకంటే వాళ్లెలాగూ నన్ను వదిలిపెట్టరు. తబ్రేజ్ అన్సారీ విషయంలో జరిగింది సరిగ్గా ఇదే కదా" అన్నారాయన.

ఇవీ భారత్‌లో మా మధ్య జరుగుతున్న సంభాషణలు. ఇప్పుడు కశ్మీర్ ఏం మాట్లాడుతుందోనని ఎదురుచూస్తున్నాం. అది తప్పక మాట్లాడుతుంది.

('న్యూయార్క్ టైమ్స్'లో ప్రచురితమైన ఇంగ్లిష్ మూలం: https://www.nytimes.com/2019/08/15/opinion/sunday/kashmir-siege-modi.html ) ●

**50వ పేజీ తరువాయి**

కశ్మీర్ కథ ఏ కొంతమందిదో కాదు. ఇది కశ్మీరీలందరి ఉమ్మడి కథ. మీడియా ద్వారా గానీ, మరెవరి ద్వారా గానీ విన్నది సమగ్రం కాదంటారు సంజయ్ కాక్. చిన్నా- పెద్దా అనే వయో బేధం లేకుండా, స్త్రీలు-పురుషులు అనే తేడా లేకుండా, సాధారణ పౌరులు-మిలిటెంట్లు అనే విభజన లేకుండా అత్యంత నీచమైన పద్ధతుల్లో భీభత్స హింసకు పాల్పడుతున్న భారత ప్రభుత్వం పట్ల కశ్మీరీ ప్రజల్లో తీవ్రమైన వ్యతిరేకత రోజు రోజుకీ పేరుకుపోతోందనీ, స్వేచ్ఛకు సంబంధించిన కశ్మీరీల తీరని కోరికను కశ్మీరీ హక్కుల సంఘాలు, ప్రజా సంఘాలు మాత్రమే చెప్పాలని అంటారు సంజయ్.

వారితోపాటు కాశ్మీరీ పండిట్ వర్గానికి చెందినప్పటికీ ఒక మనిషిగా, మానవీయంగా కశ్మీరీ ప్రజల పట్ల ఆర్ద్రంగా స్పందించి, ఎంతో శ్రమించి చలికాలంలో ఈ డాక్యుమెంటరీని రూపొందించిన సంజయ్ కాక్ ఎంతైనా ప్రశంసనీయులు!

కాలిన కంపుల్లో శోకిస్తున్న కశ్మీర్ కుటుంబాలను చూస్తున్నప్పుడు ప్రేక్షకులకు కాలిన కమురు వాసనొచ్చినట్లు కడుపులో దేవినట్లై తీవ్ర మనస్తాపం కలిగిస్తాయి. మానసిక ఆసుపత్రిలోని రోగుల మానసిక రుగ్మతలు కలత పెడతాయి. భూతల స్వర్గం అని నవ్వుతున్న పర్యాటకుల షాట్లు ఒక్క క్షణం మురిపిస్తాయి. మొత్తానికి ఈ చిత్రం ఇసుమంత కూడా తేడా అనేది లేకుండా ఈనాటికీ ఇంకా ఎక్కువగా వర్తిస్తున్నందువల్ల ప్రేక్షకులను బాగా ఆలోచింపజేస్తుంది!

2007లో ప్రతి 15మంది పౌరులకు ఒక సైనికుడుగా పహారా ఉన్నారని సంజయ్ తెలిపారు. కానీ ఇప్పుడు ప్రతి 7 మంది పౌరులకు ఒక సైనికుడు కాపలా కాస్తున్నారు. అవికాక తిరుగుబాటు ఎక్కడొస్తుందోనన్న ముందు చూపుతో లక్షలాది బలగాలను కశ్మీర్‌కి పంపుతున్నారు. భారతదేశం స్వాతంత్ర్యం పొందిన 75వ సంవత్సరంలోనైనా అడుగు తీసి అడుగేస్తే సేనల మధ్య బతకడం ఎంత కష్టమో అర్థం చేసుకుని కశ్మీర్‌లో వెంటనే తమ బలగాలను ఉపసంహరించాలనీ, ప్రజాస్వామ్య వాతావరణాన్ని నెలకొల్పాలనీ, అంతర్జాల సేవలను పునరుద్ధరించి, కాశ్మీర్ ప్రజల వాణిని వినిపించాలనీ ప్రజాస్వామ్యవాదులుగా మనం ప్రభుత్వాన్ని డిమాండ్ చేద్దాం. కశ్మీర్ ప్రజలు నిజంగా కోరుకునే స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ప్రపంచం అర్థం చేసుకుని పూర్తి సహాయ సహకారాలందిస్తుందని ఆశిద్దాం!

చివరిగా దుఃఖం కూడా ఇంత ఆరాధ్యనీయంగా ఉంటుందా అన్నట్లు ఆశ్చర్యంగా కశ్మీర్ కవులు మిక్కిలి విచారంగా, కశ్మీరీ లోయ పట్ల అత్యంత ప్రేమతో, శ్రావ్యంగా చెవులకు విందు చేస్తూ, సినిమా మొత్తంలో నేపథ్యంలో వినిపించిన, వారి గాఢమైన ఆకాంక్షలను ఎత్తిపట్టిన కవితా వాక్యాలతో ముగిస్తా.

***మా స్వేచ్ఛను, మేము ఎప్పటికీ***
***వదులుకోలేం ... మా తలల్ని తెగ నరికినా సరే,***
***కానీ, మా తలలెప్పటికీ మీకు నమస్కరించవు!*** ●




# ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేకుల్లారా ఏకంకండి!



**అశోక్ కుంబము**

ఫాసిస్టులు తమ అజెండాను అమలు చేయడానికి అధికారంలోనే ఉండాల్సిన పనిలేదు. కాని అధికారంలో ఉంటే వారు కొనసాగించే విధ్వంసానికి చట్టబద్ధత ఏర్పాటు చేసుకుంటారు. తమ రాజకీయ ప్రయోజనాలే ప్రజల అత్యవసరాలు అన్నంతగా ఊదరకొడుతారు. ఆ క్రమంలో ఫాసిజం పెద్ద మొత్తంగా సమాజంలోని అనేక సెక్షన్ల మెదళ్లను ఆక్రమించి సమ్మతిని కూడగట్టుకుంటుంది. ప్రజలలో అభద్రతను నెలకొలిపి తాను నిర్మాణం చేసిన శత్రువు మీదికి ఉసిగొలుపుతుంది. దాని కోసం చరిత్రను, హేతువును, సహజ న్యాయ సూత్రాలను, ప్రాథమిక ప్రజాస్వామిక విలువలను రద్దు చేస్తుంది. అవన్నీ సమాజ బాగు కోసమే అని నమ్మించడానికి తన చెప్పుచేతుల్లో ఉన్న అన్ని అసత్య ప్రచార సాధనాలను నిసిగ్గుగా వాడుకుంటుంది. ఆ అసత్యాలను, దుర్మార్గాలను ప్రశ్నించే అన్ని సమూహాలపై హింసను ప్రయోగిస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సంక్షోభం తీవ్రమైనప్పుడల్లా దానికి ఒక ప్రతిస్పందనగా (ప్రజల దృష్టిని మళ్లించడానికి, ప్రజా వుద్యమాల ఉధృతిని నిలవరించడానికి) దోపిడీ పాలకవర్గాలు ఫాసిస్టు విధానాలను అవలంబిస్తారు. ప్రపంచవ్యాప్తంగా కొనసాగుతున్న నయాఉదారవాద ఆర్థిక నమూన సమాజంలో కొత్త సంక్షోభాలను సృష్టిస్తున్నది. వాటి నుండి తమను తాము కాపాడుకోవడానికి దోపిడీ వర్గాలు ఫాసిజాన్ని భుజానికి ఎత్తుకుంటాయి. ఇదంతా ఒక సరళరేఖలో ఏమి జరగదు. ఆయా స్థలకాలాలకు అణుగుణంగా జరుగుతుంది. ఫాసిజం కొన్నిసార్లు బహిరంగంగా వస్తే, ఇంకొన్నిసార్లు చాపకింది నీరులా వస్తుంది. వందల ఏండ్ల శారీరక, మేధోశ్రమ ఫలితంగా సమాజ పరిణామ క్రమంలో వచ్చిన కొద్దిపాటి పరివర్తనను సహితం తిరోగమన దిశలోకి నెట్టివేస్తారు. ఫాసిస్టుల ఆధిపత్య కాలంలో అజ్ఞానం రాజ్యమేలుతుంది. అహేతుకత నిత్యజీవితంలో భాగమవుతుంది. పశున్యాయమే సాధారణమవుతుంది. ఇక అప్పుడు మనిషి గురుంచి, మానవ విలువల గురించి, కన్నీళ్ల గురించి మాట్లాడటం కూడా నేరమవుతుంది. చరిత్ర పొడువునా ఫాసిస్టులు చేసింది ఇదే.

గత పది సంవత్సరాలుగా ప్రపంచ పెట్టుబడిదారి ఆర్థిక వ్యవస్థలోతీవ్రమవుతున్న సంక్షోభం మరోసారి ఫాసిస్టులకు అధికారం కట్టబెడుతూ వస్తుంది. ఇక ఇప్పుడు ఫాసిజం ప్రపంచీకరణ చెందుతుంది. వాస్తవానికి సారాంశంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అంటేనే ఫాసిజం అయినప్పటికి అది స్థానిక పరిస్థితులను బట్టి తన రూపం మార్చుకుంటుంది. ఒక్కో సందర్భంలో ఒక్కో రూపం తీసుకుంటుంది. ఇండియాలో అది హిందుత్వ రూపంలో సమాజాన్ని కబలించి వేసే కుట్ర చేస్తుంది. హిందుత్వ ఫాసిజం అఖండ భారతాన్ని కలగంటూ భిన్న జాతుల సంస్కృతులను, అస్తిత్వాలను రద్దు చేస్తూ ఏకముఖ హిందూ రాజ్య స్థాపన దిశగా అడుగులు వేస్తుంది. దాని కోసం తనకు శత్రువు అనుకున్న అన్ని వర్గాలను, సమూహాలను, జాతులను తుదిముట్టించే పనిలో నిమగ్నమైవుంది. దాని అన్ని శక్తులను, కుయుక్తులను అందుకోసమే వుపయోగిస్తుంది. రాజ్య యంత్రాంగం మొత్తాన్ని (న్యాయవ్యవస్థతో సహా) యదేచ్ఛగా తన రాజకీయ ప్రయోజనాల కోసం వాడుకుంటుంది.

ఈ ఫాసిస్టు కుట్రలలో భాగంగానే కశ్మీర్‌ను దేశ శాంతికి విఘాతంగా, ఒక చారిత్రిక తప్పిదంగా దేశ మెజారిటీ ప్రజల మెదళ్ల మీద రుద్దుతూ వాళ్ల సమ్మతిని సంపాదించే పనిచేశారు. ఆ తర్వాత కశ్మీర్ ప్రజల హక్కులను కాలరాస్తూ వారి జీవితాలను, భూభాగాన్ని పూర్తిగా ఆక్రమించుకున్నారు. కశ్మీర్‌ను ఒక సరుకు చేసి అమ్మడానికి రంగం సిద్ధం చేసుకుంటున్నారు. ఇదంతా ఒక 'విజయంగా' సెలబ్రేట్ చేసుకునే విధంగా ఒక సామూహిక మానసిక పరిస్థితిని తేగలిగారు. ఇందులో ఫాసిస్టులది అందెవేసిన చెయ్యి.

ఫాసిస్టు దాడి ఎంత తీవ్రంగ ఉన్నా, దానిని ప్రపంచానికి తెలువకుండా కప్పేసినా, సర్వం కోల్పోయిన ప్రజలకు పోరాటం తప్ప మిగిలేది ఏమి ఉండదు. హిందుత్వ ఫాసిస్టులు కశ్మీర్ నుండి కన్యాకుమరి వరకు తమ మానవ వేటను కొనసాగిస్తారు. ఆ పెను విపత్తును కేవలం ప్రజా పోరాటాలే నిలవరించగలవు. అందుకే హిందుత్వ ఫాసిస్టు శత్రువులంతా (కమ్యూనిస్టులు, హేతువాదులు, ప్రజాస్వామికవాదులు, అణగారిన కులాలు, జాతులు, లింగాలు, మత మైనారిటీలు) ఏకం కావాల్సిన సమయం వచ్చింది. పోరాడే ప్రజలదే అంతిమ విజయమని చరిత్ర రికార్డ్ చేస్తూనే వుంది. ఆ స్ఫూర్తితోనే ఫాసిస్టు వ్యతిరేకులంతా ఏకం కావాల్సివుంది. ముఖ్యంగా

## నివాళి

# జగద్ధాత్రికి నివాళి

కవి, వ్యాసకర్త, కాలమిస్ట్, సాహిత్య కార్యకర్త, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సభ్యురాలయిన జగద్ధాత్రి విషాద మరణం విచారకరం. ఆమెకు పీవోడబ్ల్యూ జాతీయ కార్యవర్గం నివాళి అర్పిస్తున్నది.

సాహిత్యాన్ని విస్తృతంగా చదవడం, రాయడం, నలుగురిలోకి తీసుకుపోవడం ఊపిరిగా జీవించిన ఒక మనిషి నిష్క్రమణం ఆ మేరకు పూడ్చుకోలేని వెల్తిని కలిగిస్తుంది. వర్తమాన సాహిత్యంలో కొత్త స్వరాలను గుర్తించడం, నలుగురికీ పరిచయం చేయడం కోసం సమీక్షా వ్యాసాలు రాయడం ఆమె నిరంతర వ్యాసంగం. ఆధునిక సాహిత్య ప్రారంభం నుంచి ఇప్పటివరకూ ఎంతోమంది సాహిత్యకారుల కృషిని ఆమె అలుపు లేని అధ్యయనం ద్వారా చర్చలలో నిలబెడుతూ ఉండేవారు. బుద్ధికి పదును పెట్టే విమర్శని ఒకవైపు నడుపుతూ మరోవైపు తన హృదయ కల్లోల వ్యక్తీకరణకి కవిత్వాన్ని ఆలంబన చేసుకున్నారు. అనేక పుస్తకాల ఆవిష్కరణలను తన చేతుల మీదుగా నిర్వహించిన జగద్ధాత్రి వందలాదిగా ఉన్న తన సాహిత్య వ్యాసాలను ఇంతవరకూ ఒక చోట చేర్చనే లేదు. పుస్తకరూపంలో వచ్చిన ఆ ఒక్క కవితా 'సహచరణం' కూడా అనేక ఒత్తిడుల మధ్య ప్రచురించుకున్నారు. మగవారికి, లేదా ఆధిపత్య వర్గాలకి మాత్రమే పరిమితమైన సాహిత్య కార్యనిర్వహణ రంగంలో జగద్ధాత్రి అవిశ్రాంతంగా పని చేసారు. విశాఖపట్నం కేంద్రంగా మొజాయిక్ సంస్థ నుంచి అనేక సాహిత్య కార్యక్రమాలు చేపట్టారు. మంచి వక్తగా వందలాది సభలలో ప్రసంగించారు. తన చుట్టూ మనుషులతో స్నేహ పూర్వకంగా మెలిగేవారు. సాహిత్య సృజన, కార్యాచరణలో ఆమె సహచరుడు రామతీర్థ తనకి చేదోడు వాదోడుగా నిలిచారు.

తన సహచరుని మరణపు దుఃఖం నుంచి కోలుకోకుండానే జగద్ధాత్రి కూడా జీవితాన్ని చాలించారు. ఈ విషాదం నుంచి సమాజం గ్రహించవలసింది చాలానే ఉంటుంది. అయితే ఆ గ్రహింపు, ఆమె వ్యక్తిగత జీవితంలోని అన్ని విషయాలను పట్టుకుని వ్యాఖ్యానించడం కాదని నమ్ముతున్నాం. గుట్టుగా దాచుకుని, రహస్యంగా మాట్లాడుకునే అనేక విషయాలు బహిరంగంగా మాట్లాడుకోవడానికి జగద్ధాత్రి జీవితం ఒక సందర్భం కావాలి తప్ప, ఆమె జీవితంలోని ప్రతీ సంఘటనను తవ్వి తీసి చర్చకి పెట్టడం, తప్పొప్పుల తీర్పులు ప్రకటించడం సబబు కాదు. వైవాహేతర సంబంధాలు, స్వేచ్ఛాయుత స్త్రీ-పురుష సంబంధాలు, వీటికి ఉండే పలు సామాజిక, రాజకీయ ఆర్థిక, సాంస్కృతిక కోణాలు చర్చకి రావాలి. ఆ చర్చ ఏ ఒక్కరి వ్యక్తిగత జీవితాన్నో ఉదాహరణగా చూపేది కాకూడదు.

ఆమె సాహిత్య లోకంలో చేసిన కృషిని నేటి రచయితలు ఆదర్శంగా తీసుకుని కొనసాగించాల్సిన అవసరం వుందని ప్రగతిశీల మహిళా సంఘం (పీవోడబ్ల్యూ) భావిస్తున్నది. ఆమెకు ఈ సందర్భంగా మరోసారి నివాళులు అర్పిస్తున్నది. ఆమె కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతిని ప్రగతిశీల మహిళా సంఘం (పీవోడబ్ల్యూ) ప్రకటిస్తున్నది.




ప్రగతిశీల మహిళా సంఘం
(పీవోడబ్ల్యూ)

కశ్మీర్ సందర్భంలో చైతన్యవంతమైన ప్రపంచ పౌరసమాజం కూడ తన గళాన్ని ఎత్తుతుంది. అనేక రూపాలలో తన నిరసనను తెలుపుతుంది. కశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికార ఆకాంక్షకు మద్దతు కూడగడుతున్నారు. కశ్మీరీలు ఒంటరివారు కారని నినదిస్తున్నారు. అనేక దేశాలలో నిరసనలు కొనసాగుతున్నాయి.

అమెరికాలో అనేక ప్రజాసంఘాలు, మేధావులు, ఉద్యమకారులు ఒక 'Coalition Against Fascism in India' గా ఏర్పడి దేశ వ్యాప్తంగా నిరసనలు తెలుపుతున్నారు. అమెరికాలో ఇండియన్ ఎంబసీ ముందు వందల సంఖ్యలో పెద్ద నిరసన సభను జరిపారు. ప్రధాని మోడీ సెప్టెంబర్ చివరి వారంలో యునైటెడ్ నేషన్స్ మీటింగ్స్‌లో పాల్గొనడానికి వస్తున్న సందర్భంగా ప్రపంచ సమాజం కశ్మీరీ ప్రజలకు ఏవిధంగా సంఘీభావం తెలుపుతుందో రుచి చూపించనున్నారు. కేవలం అమెరికాలోనే కాదు కెనడాలో, అనేక యురోపియన్ దేశాలలో ముఖ్యంగా బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్, బ్రస్సెల్స్‌లలో జరిగిన అనేక నిరసన ర్యాలీలలో, సభలలో వేలాదిగా ప్రజలు తమ తమ మతాలకు, దేశాలకు, జాతులకు అతీతంగా కశ్మీరీ ప్రజలకు మద్దుతుగా నిలబడుతున్నారు.

ఈ నిరసన గళాలు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా పనిచేసిన గదర్ పార్టీని గుర్తుచేస్తున్నాయి. ఆ దిశగా నిర్మాణం జరగుతుందని ఆశిద్దాం.

ప్రముఖ బ్రిటీష్ మార్క్సిస్ట్ చరిత్రకారుడు ఎరిక్ హెబ్స్ బాం అన్నట్లు మనము 'Age of Extremes'లో బతుకుతున్నాము. అందులో హిందుత్వ ఫాసిజం అనేది అతి తీవ్రమైనది. అత్యంత ప్రమాదకరమైనది. దానిని ఓడించాలంటే ఫాసిస్టు వ్యతిరేకులంతా ఏకం కావాల్సిందే!




# అలుపెరగని పోరాట గాథ



రమాసుందరి

**2019**, ఆగష్టు 5న కశ్మీర్‌లో ఆర్టికల్ 370ని రద్దు చేసిన విధానం, రద్దు చేయటానికి అవలంబించిన పద్ధతులు అక్కడ చరిత్ర పునరావృతం అవుతుందని చెప్పనే చెప్పాయి. 1846 మార్చి 9న కశ్మీర్‌కి వందల మైళ్ల దూరంలో జరిగిన అమృతసర్ ఒప్పందం కశ్మీర్ ప్రజలతో ఏ మాత్రం సంబంధం లేకుండా జరిగింది. అవసరానికి అణాకాణీకీ, పాలకీ నీళ్లకీ అమ్మినట్లుగా ఆనాటి వలస ప్రభుత్వం 75 లక్షలు మాత్రమే తీసుకొని గులాబ్ సింగ్‌కి కశ్మీర్‌ని అమ్మి దాన్ని వదిలించుకొన్నది. కశ్మీర్ ప్రజలకు ఆ వార్త చేరే ముందే గులాబ్‌సింగ్ కశ్మీర్‌కు పటాలంతో వచ్చాడు. ప్రజలు నిస్సహాయులు, నిశ్చేష్టులు అయ్యారు. అది రాజుల కాలం నాటి మాట. ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామ్యంగా గుర్తింపు తెచ్చుకొన్న భారతదేశం, 170 సంవత్సరాల తరువాత కశ్మీర్ మొత్తాన్ని జైలుగా మార్చి, ఢిల్లీలో దానికి నామ్ కే వాస్తేగా ఉన్న ప్రత్యేక ప్రతిపత్తిని 2019 ఆగస్టు 5న రద్దు చేసింది. అంతేకాకుండా కశ్మీర్‌ను; కశ్మీర్, లధక్‌లుగా విడగొట్టి, కేంద్రపాలిత ప్రాంతాలుగా కేంద్ర పాలన కిందకు తెచ్చుకొన్నది.

## కాశ్మీర్ చరిత్ర

కశ్మీర్‌లో 370, 35ఏ ఆర్టికల్స్ రద్దు కాగానే, కశ్మీరీలు ప్రధాన భూమిగా (Main land) పిలిచే భారతదేశంలో చాలా చోట్ల హర్షాతిరేకాలు పొడచూపాయి. కొన్ని చోట్ల పండగ కూడా జరుపుకొన్నారు. ఆనందించిన వారందరికీ కశ్మీర్ ప్రజల మీద ద్వేషం ఉందని కాదు. నకిలీ జాతీయవాదంతో వెర్రులెత్తే వారితో బాటు; పొద్దున్నే చూసే వార్తాపత్రికలో, అస్తమానం అంటిపెట్టుకొని ఉండే టీవీల్లో కశ్మీర్‌లో జరిగే రక్తపాతాన్ని చూసే బాధ తప్పిందని సంతోషించిన వారు కూడా ఎక్కువగానే ఉన్నారు. కశ్మీర్‌ను కేంద్ర పాలన కిందకు తెచ్చుకొని, కశ్మీర్ ప్రజలను నయానో భయానో లొంగదీసుకొని- 72 సంవత్సరాలుగా నానుతూ, ప్రజాస్వామ్యమని చెప్పుకొంటున్న పాలనలో పంటికి రాయిగా మారిన కశ్మీర్‌ను 'మనలో' కలిపేసుకొని ఆ సమస్యకు తిలోదకాలు ఇవ్వవచ్చనే ఆశ పడిన వారు కూడా ఉన్నారు. అలాంటి వాళ్లు కూడా ఇప్పుడు కశ్మీర్ ప్రజల కదలికలను దిగ్బంధనం చేసి, లక్షల సైన్యంతో వారిపై అమానుష అణచివేతను ప్రదర్శించిన భారత ప్రభుత్వపు ఆధిపత్యాన్ని నిర్వికారంగా చూస్తున్నారు. ఏడు దశాబ్దాల పాటు కల్లోలిత ప్రాంతంగా కొనసాగుతూ, ప్రపంచంలోనే అత్యధికంగా మిలటరైజ్ అయిన కశ్మీర్‌ను లొంగదీశామని చాలామంది సంతోష పడుతున్నారు కూడా. 'మన' అనుకున్న దానిలో ఇప్పుడు ప్రజాస్వామిక 'మన' లేదు. ఫక్తు ఫ్యూడల్ ఫాసిస్టు 'మన' వుంది.

కశ్మీర్ సమస్యను భారత ప్రజలు యాంత్రికంగా; శాంతి భద్రతల, ఉగ్రవాదుల సమస్యగా మాత్రమే పైపైన చూడటం వలన ఇలాటి అమానవీయ స్పందనలు ప్రజలలో కలుగుతున్నాయి. సామాజిక శాస్త్రాల అధ్యయనాన్ని శాస్త్రీయ పద్ధతిలో నేర్పకపోవడం, చరిత్రను రాజుల రాజ్యాల దృష్టి కోణం నుండి మాత్రమే పాఠ్యాంశాలలో ప్రవేశ పెట్టటం దీనికి కారణం. చరిత్రను రాజుల పట్టాభిషేకాల తారీఖులు, వాళ్లు చేసిన దండయాత్రలు, వాళ్ల పితృపక్ష వంశవృక్షాలు, వాళ్లు నాటిన చెట్ల సంఖ్యతో నింపి వేసిన రచయితలే తప్ప; చరిత్రను ప్రజల కోణం నుండి రాసిన చరిత్రకారులు అరుదుగా ఉన్నారు.

### కశ్మీర్ భౌగోళిక స్వరూపం, భాష, జనాభా

కశ్మీర్ ఎల్లలను నిర్వచించేటపుడు అది దగ్గరలో ఉన్న పంజాబ్ ప్రాంతాన్ని ఆనుకొని ఉన్నదని, భారత ఖండపు వాయవ్య ప్రాంతంలో అనేక రాజ్యాలు కశ్మీర్‌కి హద్దులుగా ఉన్నాయని చెప్పవచ్చు. ఉత్తర భాగాన ఎత్తైన మంచు పర్వతాలు సహజ ప్రాకారాలుగా చుట్టుముట్టి ఉండగా కశ్మీర్ మిగతా ప్రపంచానికి ఒకింత అతీతంగా జీవించింది. బాహ్య ప్రపంచపు ప్రకంపనలు కశ్మీర్‌కి అరుదుగా తాకుతాయి. విదేశీ దండయాత్రలకు కూడా దుర్భేద్యంగా ఉండే ఈ ప్రదేశం ఒక ప్రత్యేక అస్తిత్వానికి చరిత్రాత్మక ఉనికిగా ఉంది. అలెగ్జాండర్

దండయాత్రలలో కూడా కశ్మీర్ జోలికి రాకపోవటానికి ఈ ఎత్తైన పర్వతాలే కారణం. ఈ ప్రత్యేక నైసర్గిక పరిస్థితి కూడా కశ్మీర్ తన సంస్కృతిని కాలక్రమంలో కోల్పోకుండా కాపాడింది.

అలాగని ఇక్కడి ప్రజలు బయట ప్రపంచంతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని ఉండలేదు. వివిధ జాతుల ప్రజలతో స్నేహ సంబంధాలను కొనసాగించారు. గంగా, యమున, సరస్వతి, రావీస్, జీలం, సట్లజ్, చినాబ్ అనే పేరుగల సప్త నదులు పారుతున్న ప్రదేశం ఇది. భారత ఉపఖండంలోకి ఆర్యుల వలసలు ప్రారంభం అయ్యాక కశ్మీర్‌కి కూడా వారు చేరుకొన్నారని ఋగ్వేదం ద్వారా అర్థం అవుతుంది. దేశ దిమ్మరులు, పశువుల కాపరులు అయిన ఆర్యులు; మనుషుల నివాసయోగ్య ప్రాంతాలకు చేరుకొన్నాక అక్కడి ప్రజలను తరిమేసి స్థిరనివాసం ఏర్పాటు చేసుకొన్నారు. నిజానికి 'కశ్మీర్ మూలవాసులు ఎవరూ?' అనే విషయానికి నిర్ధారణలు లేవు. మహాభారతాన్ని కొంత ప్రామాణికంగా తీసుకొంటే అందులో ప్రస్తావించిన నాగాలూ, పిశాచాలు కశ్మీర్ మూల తెగలుగా భావించవచ్చునని అంటారు.

కశ్మీరీల భాష కాశ్మీరీ. అది ఒక దేశీయ భాష. ఇక్కడి ముస్లిములు, హిందువులు కూడా భిన్న యాసలలో అదే భాష మాట్లాడుతారు. వాటిలో కొన్ని పదాలు పర్షియా నుండి వచ్చాయి.

## కశ్మీర్- మతం

కశ్మీర్ సమస్యకు కారణం అక్కడి ప్రజలు అత్యధికంగా ముస్లిములు అవటమే అని చాలా మంది తప్పుడు అభిప్రాయంతో ఉంటారు. మత సమస్యగానే కశ్మీర్‌ను చూడటం పాక్షిక దృష్టి అవుతుంది. నరజాతి చరిత్ర అంతటిలో ప్రజలు పాలకులు, పాలితులుగా మారిన వర్గ విభజనలో మతం ఒక అంశం మాత్రమే. భారత ఉపఖండం వివిధ కాలాల్లో వివిధ మతాల ఒరిపిడికి గురి అయినట్లే కశ్మీర్ భూభాగం కూడా అనేక దశల్లో అన్ని మతాలను ఆలింగనం చేసుకొన్నది. 200 బి.సి.లో బౌద్ధాన్ని స్వీకరించిన దాఖలాలు మనకు కశ్మీర్ చరిత్రలో కనబడతాయి. 12 శతాబ్దానికి ముందు ఇక్కడి ప్రజల్లో వీర శైవం కూడా ఉనికిలో ఉంది.

కశ్మీర్ ప్రజ మతం కంటే తమ సంస్కృతికి ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చారు. అదే 'కశ్మీరియత్ సంస్కృతి'. పెద్ద పెద్ద సామ్రాజ్యాలు ఇక్కడ పరిపాలించాక కూడా, అవి కశ్మీరీ సంస్కృతి మీద ప్రభావం వేయలేకపోయాయి. తన ప్రత్యేకమైన స్థానిక వ్యక్తిత్వంతో అది తన చారిత్రక సంప్రదాయాలను కాపాడుకొన్నది. కశ్మీరీలలో కొనసాగిన ఈ బహుముఖీనత్వం లౌకికవాదం కంటే గొప్పది. వారు చేసే ప్రతి పనిలోనూ, అతిథులనూ కొత్తవారినీ ఆదరించే విధానంలోనూ, కుల మత వర్ణాలకు అతీతంగా ప్రజలను గౌరవించే విధానంలోనూ కశ్మీర్‌కు కొన్ని విలువలతో కూడిన సంప్రదాయ వ్యవస్థ ఉంది.

అక్కడ ఇస్లాం ప్రవేశించాక; కశ్మీరీ ముస్లిములు, హిందువులు ఇరువురూ కశ్మీరీయత్ అని చెప్పే సాంస్కృతిక సమ్మేళనానికి రెండు మూల స్తంభాలుగా నిలిచారు. కాలం గడిచే కొద్దీ ఈ రెండు మతాల ప్రజల మధ్య వర్గ సంబంధాలు ప్రాతినిధ్యం వహించి వారి మధ్య అగాధాలు సృష్టించాయి కానీ, మతపరమైన విభేదాలు తక్కువనే చెప్పాలి. భారతదేశం అంతా మతకల్లోలాలతో ఎగసెగిసి పడిన కాలాల్లో కూడా కశ్మీర్ ప్రశాంతంగా ఉండింది. దానికి కారణం కశ్మీరీలు వివిధ కాలాల్లో రోమన్, గ్రీక్, పర్షియన్ సంస్కృతులతో సహవాసం చేసి; ఆయా సంస్కృతుల నమ్మకాలను, సిద్ధాంతాల పట్ల సహనంగా ఉండటం అప్పటికే తెలుసుకొన్నారు. కశ్మీర్ ప్రజలకు కాబూల్ ప్రజలతో కూడా సాంస్కృతిక రాజకీయ సంబంధాలు ఉండేవి. కశ్మీరీ సంస్కృతి ఎప్పుడూ వేరుబడి మొండిగా లేదు. అందరినీ కలుపుకొంటూ అది నమ్రతగా ఉంటుంది. ఆ సంస్కృతికి ఉన్న వ్యాకోచ లక్షణం వలన అది వివిధ సంస్కృతులను కలుపుకొని నిత్య పచ్చదనంతో కూడిన సమ్మేళనంగా ఆవిర్భవించింది. ఆ కశ్మీరీయత్ సంస్కృతి మీద ప్రభావం వేయాలనుకొన్న ఏ సాంస్కృతిక ధార అయినా కశ్మీరీయత్ సాంస్కృతిక షరతులకూ, భావోద్వేగాలకూ తల ఒగ్గాల్సిందే. ఆ ప్రభాలన్నింటిని కట్టగట్టి తన సొంత వ్యక్తిత్వంలోకి ఇముడ్చుకోగలిగిన శక్తి కశ్మీరీయత్ సంస్కృతికి ఉంది. అందుకే దానికి బహుముఖ రూపం ఉంది. దాని మీద మత ప్రభావాన్ని అది అంగీకరించదు.

కశ్మీర్‌లోకి ఇస్లాం ప్రవేశం ముస్లిముల దండయాత్రల వలన వచ్చిందనే లోకాభిప్రాయం పూర్తిగా అసత్యం. ముస్లిముల దండయాత్రలు భారత ఉప ఖండంలో ప్రారంభం అయ్యాక కశ్మీర్‌లో మొదట ప్రవేశించిన వారు మొఘలులు (1580-1750). అయితే వారికి ముందే 14వ శతాబ్దపు చివరి భాగంలోనే ఇస్లాం చలచల్లగా, ప్రశాంతంగా ఇక్కడి ప్రజల్లోకి వచ్చింది. ఒక సూఫీ పకీరు కశ్మీర్‌లో ఇస్లాం ప్రవేశానికి కారణం అని తెలుసుకొంటే ఆశ్చర్యం వేస్తుంది. బుల్ బుల్ షా అనే పకీరు ప్రభావానికి లోనై అప్పటి కశ్మీర్ రాజు రెంచన్ షా ఇస్లాం స్వీకరించాడు. తరువాత అతను తన పేరును సుల్తాన్ సద్రుద్దీన్‌గా మార్చుకొన్నాడు. రాజును అనుసరించి అనేక మంది ప్రజలు ఇస్లాం స్వీకరించారు. హిందూమతంలో ఉన్న కుల వ్యవస్థ ఇస్లాంలో లేకపోవడం, పుట్టుకతో అందరూ సమానులే అనే ఇస్లాం భావన వారిని ఆ మతం వైపు మళ్లించింది. కొంతమంది హిందూమతంలోనే కొనసాగినప్పటికీ సామరస్య సహజీవనం అనే సామాజిక తాత్విక చింతనను వారు ఒంటబట్టించుకొన్నారు. ఈ ప్రత్యేక జీవన విధానం కశ్మీర్‌కు ఒక గొప్ప సంస్కృతిని సంపాదించి పెట్టింది. ఈ ఆచరణకు రుజువుగా ఇప్పటికీ కశ్మీర్‌లోని దర్గాలు ఉన్నాయి. మతపరమైన విభజన ఉన్నప్పటికీ ఇప్పటికీ ఈ దర్గాలను ముస్లిములూ, హిందువులూ సందర్శిస్తారు. ఇస్లాం స్వీకరించిన కొత్తల్లో అక్కడ మసీదుల్లో ప్రార్థనలు, హిందూ భజనల మాదిరే ఉండేవి. ఉదయం అజ్రాద్ జరిగిన వెంటనే ముస్లిం ప్రార్థనలు జరిగేవని చరిత్ర కారులు చెబుతున్నారు.

ఇంకొక మహత్తర ఉదాహరణ - ఇక్కడ ఉన్న దేవాలయాలు. కశ్మీర్ అంతటా కలిపి 150 దేవాలయాలు వరకూ ఉన్నాయి. అవి ఇప్పటికీ చెక్కు చెదరలేదు. ఉలితో మలిచిన రాళ్లతో నిర్మించిన ఈ కట్టడాలలో సిమెంట్ కానీ, మట్టి కానీ రాళ్లను కలిపి ఉంచటానికి వాడలేదు. రాళ్లను ఒక ప్రత్యేక పద్ధతిని ఉపయోగించి జాగ్రత్తగా

అమర్చిన గోడల్లోకి చిన్న కాగితం కూడా దూర్చలేము. ఈ దేవాలయాలను సాంస్కృతిక సంపదగా భావించి కశ్మీరీలు కాపాడేవారు. సుల్తాన్ సద్రుద్దీన్ పాలనలో సంస్కృతం పాలనా భాషగా ఉండేది. తరువాత కాలంలో ఎక్కువ మంది ఇస్లాంలోకి మారినా ఆ భాషే పాలనా భాషగా కొనసాగింది.

కశ్మీర్‌లో హిందూ ముస్లిం ఐక్యతకు లాలేశ్వరీ, ఆమె శిష్యుడు షేక్ నూరిద్దీన్ అనే ఇద్దరిని కారకులుగా అక్కడి ప్రజలు భావిస్తారు. లాలేశ్వరిని వారు ప్రేమగా 'లాల్ దెద్' అని పిలుచుకొంటారు. ఆమె పేరు మీద ఇప్పుడు శ్రీనగర్‌లో ఒక పెద్ద ప్రభుత్వ మహిళల ప్రసూతి ఆసుపత్రి ఉంది. షేక్ నూరిద్దీన్‌ను 'నుంద్ ఋషి' అని పిలుచుకొంటారు. వారిద్దరినీ కశ్మీరీయత్ సంస్కృతికి కాగడా ధారులుగా కశ్మీరీలు భావిస్తారు. లాలేశ్వరి చిరిగిన బట్టలతో పాటలు పాడుకొంటూ ప్రజల మీద ఆధారపడి బతుకుతూ తన తాత్వికతను ప్రచారం చేసేది. శైవాన్నీ, ఇస్లాంనూ రెండిటినీ ఆమె నమ్మింది. ఆమె ప్రచారం చేసిన హిందూ ముస్లిం సమైక్యతా భావం కశ్మీర్ అంతా ప్రతిధ్వనించేది. నుంద్ ఋషి ఆమె అనుచరుడుగా కొనసాగాడు. ఋషుల సంప్రదాయాన్ని కశ్మీర్‌లో ప్రవేశపెట్టి పురోహిత వర్గానికి ప్రతినిధిగా ఉండటాన్ని, ఆ వర్గానికి ఉండే ఆశపోతుతనాన్ని ఆయన తిరస్కరించాడు.

15వ శతాబ్దంలో బుడ్ షా (జైన్ ఉల్ అబిదిన్) అనే పేరు కలిగిన రాజు పాలనలో కశ్మీర్ పాలన సాగిన విధానం గమనిస్తే కశ్మీర్‌లో మత సామరస్యం ఎలా కొనసాగేదో అర్థం చేసుకోవచ్చు. ఆయనకు దూరదృష్టి, ఉదారవాద స్వభావం, న్యాయదృష్టీ ఉండేవి. ఆ కాలంలో కశ్మీరీ పండితుల వలసలు జరిగాయి. అంతకుముందు పరిపాలించిన రాజు సుల్తాన్ సికిందర్. ఆయన దగ్గర మంత్రిగా పని చేసిన కశ్మీరీ పండిత్ సహదేవ్ ఇస్లాం స్వీకరించి మాలిక్ సైపుద్దీన్‌గా మారాడు. అతని అరాచకాలకు భయపడి కశ్మీర్ పండితులు ఢిల్లీ, లక్నో, బనారస్, అలహాబాద్, హైదరాబాద్‌లకు వలసలు వెళ్లారు. బుడ్ షా ఈ విషయం మీద దృష్టి పెట్టి వారు మళ్లీ తిరిగి రావటానికి కావాల్సినదంతా చేశాడు. వారి ఆస్తులను వారికి క్షేమంగా అప్పగించాడు. వారు మిగతా ప్రజలతో శాంతియుత సహజీవనం చేయటానికి చేయవల్సినదంతా చేశాడు. రాజు ప్రజలందరినీ సమానంగా చూడాలనీ, వారి మతపరమైన స్వేచ్ఛకు అవకాశం ఇవ్వాలనే విధివిధానానికి ఆయన ఊపిరి పోసాడు. కశ్మీర్ పండితులను అప్పటి పాలక భాష అయిన పర్షియన్ నేర్చుకోమని ప్రోత్సహించాడు. వారికి పాలనా వ్యవస్థలో ఉన్నత స్థానాలు కల్పించాడు. హిందువులకు ప్రత్యేక కోర్టులు ఏర్పాటు చేశాడు. వారికి పన్నులు రద్దు చేశాడు. ప్రభుత్వంలో స్థానం పొందని పండితులకు శ్రీనగర్‌లోని జోగి లంకర్‌లో నివాసం ఏర్పాటు చేసి వారిని ప్రభుత్వ ఖర్చులతో పోషించాడు. వారి పిల్లలకు చదువులు నేర్పించాడు. ఈ విషయంలో బుడ్ షా మీద విమర్శలు ఉన్నా కూడా లెక్క చేయలేదు. శర్దా దేవాలయాన్ని దర్శించి అది సరిగా నడుస్తుందో లేదో అని పర్యవేక్షించాడు. అమరనాథ్ దర్గాను కూడా సందర్శించాడు.

అలా మధ్యయుగాల హిందూ రాజుల పాలన ముగిశాక సర్వ స్వతంత్ర ముస్లిం రాజుల పాలన కశ్మీర్‌లో 250 సంవత్సరాలు కొనసాగింది. ఈ రాజులందరి పూర్వీకులు హిందువులే. ఈ సుల్తాన్‌ల పేర్లు షా మిర్, జంషెద్, షాబాబుద్దీన్, సికందర్, జైన్ ఉల్ అబిదిన్ (బుడ్ షా), ముహమ్మద్, ఫతే ఖాన్. వీరి తరువాత ఒక యాభై సంవత్సరాలు కశ్మీర్ అనిశ్చితమైన దశకు చేరింది. దానిలో కొంత భాగాన్ని చక్ సామ్రాజ్యం పాలించింది.

## కశ్మీర్ చరిత్ర

కశ్మీర్ లాంటి మారుమూల ప్రాంతపు చరిత్ర ప్రజలకు ఎక్కడా అందుబాటులో ఉండదు. పురాతన కాలం నుండి ఆధునిక కాలం వరకు కశ్మీర్ అందాలను వర్ణించిన కవులు, ఆ మహోన్నత సౌందర్య చట్రంలోకి కశ్మీర్ పేద ప్రజల అనాకారి జీవితానికి ప్రవేశం ఇవ్వలేదు. మొఘలుల పాలనలో, ఆ రాజులు వేయించిన చిత్రపటాలలో కూడా, మొఘలుల ప్రత్యేక వాస్తుతో కట్టిన గవాక్షాల నుండి బయటకు కనబడే కశ్మీర్ అందాలలో ఎక్కడా అక్కడి ప్రజలు కనబడరు. అసలు వాస్తవిక చరిత్ర క్రమాల మొత్తాన్ని తిరస్కరించే దశలో వున్నాం ఇప్పుడు. చరిత్ర చెప్పిన విషయాలను ఉదాహరించటం కూడా దేశద్రోహంగా నమోదు చేయగల చట్టాలు అమలులో ఉన్న కాలంలో వున్నాం.

కశ్మీర్‌కు 350 సంవత్సరాల పోరాట చరిత్ర ఉంది. అంతకన్నా ఎక్కువ అణచివేత చరిత్ర ఉంది. కశ్మీర్ హిమ భూభాగాన్ని శాస్త్రీయ పద్ధతిలో అనేక పొరలుగా విభజిస్తూ పోతే, ఆ పొరలన్నిటిలోనూ- ఆ పోరాటాలలో, ఆ అణచివేతలో చనిపోయిన ప్రజల అస్థి పంజరాలు గుట్టలుగుట్టలుగా కనిపిస్తాయి. ప్రపంచమంతా పరపీడన పరాయణత్వంలో అణగారిపోయినా, కశ్మీర్ ప్రజలది ప్రత్యేక పరిస్థితి. వారిది విరామెరుగని పీడన కథ. అలుపెరుగని పోరాట గాథ. కశ్మీర్ ఎప్పుడూ ఆ పోరాటాలలో గెలవలేదు. ఎప్పుడూ ఓడిపోలేదు కూడా.

## మొఘలుల పాలన (1586-1752)

మొఘలులు కశ్మీర్‌కు వచ్చేనాటికే దానికి 191 మంది రాజులు, 4109 సంవత్సరాల 11 నెలలు కశ్మీర్‌ను పరిపాలించిన చరిత్ర ఉందని అక్బర్ నామాలో రాసి ఉంది. మొఘలులు భారత ఉపఖండం మీదకు దండెత్తి వచ్చిన తరువాత కశ్మీర్ పంజాబ్‌తో బాటు వారి పరమైనది. అక్బర్, షాజహాన్‌ల కాలంలో అందమైన ఉద్యానవనాల, పట్టణాల, మసీదుల నిర్మాణం అక్కడ జరిగింది. అయితే ప్రజలు సంతృప్తితో అయితే లేరు. మొఘలులు మోసం చేసి తమను ఆక్రమించుకొన్నారనే భావన కశ్మీరీలకు ఉండేది. అప్పటికి రెండు సార్లు కశ్మీర్ మీద అక్బర్ దండయాత్రలు చేశాడు. కశ్మీరీలు వాటిని తిప్పి కొట్టారు. ఆ కాలంలో కశ్మీర్‌ను పరిపాలిస్తున్న కశ్మీరీ రాజు యూసఫ్ షా చక్. అతన్ని మోసం చేసి కశ్మీర్‌ను ఆక్రమించాడు అక్బర్.

ఈ యూసఫ్ షా చక్‌కు ఒక ప్రేమ కథ ఉంది. హబ్బా ఖటూన్ అనే కశ్మీరీ కవయిత్రిని, ఆమె కవిత్వానికి ముగ్ధుడై యూసఫ్ షా పెళ్లి చేసుకొన్నాడు. ఆమెకు జూన్ (చంద్రుడు) అనే

పేరు కూడా ఉండేది. ఆమెను 'కశ్మీర్ కోయిల' అని కూడా కశ్మీరీలు ప్రేమతో పిలుచుకొంటారు. రైతు కుటుంబంలో పుట్టిన గొప్ప అందగత్తె ఆమె. మౌలాలి దగ్గర చదవటం, రాయటం నేర్చుకొని కవిత్వం రాసి స్వయంగా పాడుతూ ఉండేది. వేటకు వచ్చిన యూసఫ్ షా ఆ పాటకు ముగ్ధుడు అయ్యి ఆమెను వివాహం చేసుకొన్నాడు. హబ్బా కశ్మీరీ భాషలో కవిత్వం రాసేది. 'లోల్' అనే కవితా ప్రక్రియను కశ్మీరీ కవిత్వంలో ప్రవేశపెట్టింది ఆమెనని అంటారు. ఆ కాలంలోనే అక్బర్ దండయాత్రలు జరిగాయి. లొంగని రాజు యూసఫ్ షా కు స్నేహ హస్తం చాచి ఆహ్వానించాడు అక్బర్. అప్పటికే ప్రాణనష్టాన్నీ, రక్తపాతాన్నీ చవి చూసిన యూసఫ్ అక్బర్ ఆహ్వానాన్ని అంగీకరించాలని నిర్ణయించుకొన్నాడు. హబ్బా ఖటూన్ వారిస్తున్నా వినకుండా ఢిల్లీ ప్రయాణం కట్టాడు. అక్బర్ అతన్ని బీహార్ జైలులో బంధించాడు. ఆ జైలులోనే అతను మరణించాడు. తరువాత హబ్బా పిచ్చిదై అతని కోసం రాసిన పాటలు పాడుకొంటూ తిరిగేదని చరిత్రకారులు చెబుతారు. 2015లో కశ్మీర్ ఆర్థిక మంత్రి, యూసఫ్ షా అస్థికల కోసం భారత ప్రభుత్వాన్ని కోరాడు. స్వతంత్ర కశ్మీర్ చివరి రాజు అయిన యూసఫ్ షా చక్ సమాధిని ఎవరూ సరిగ్గా నిర్ధారణ చేయలేకపోయారు. అయితే బీహార్‌లో యూసఫ్ షా సమాధిని వెదికి చూసి వచ్చానని 'curfew night' రచయిత బషారత్ పీర్ రాసుకొన్నాడు.

ఆ రకంగా కశ్మీర్ అక్టోబర్ 6, 1586లో తన స్వాతంత్ర్యాన్ని మొఘలుల చేతిలో కోల్పోయి, దాదాపు 250 సంవత్సరాలు వారి పరిపాలనలో ఉన్నది. అక్బర్, జహంగీర్, షాజహాన్, ఔరంగజేబ్, ఇంకా కొంతమంది గవర్నర్లు కశ్మీర్‌ను పాలించారు. అయితే మొఘలుల కశ్మీర్ ప్రవేశం సులభంగా జరగలేదు. ఆ నాటి మొఘలుల కశ్మీర్ ఆక్రమణ, నేటి పాలకుల దౌర్జన్యకర విధానాలకు సరితూగుతుంది. ఇంకోరకంగా చెప్పాలంటే 2019, ఆగస్ట్ 5న కశ్మీర్‌లో జరిగింది నూతన మొఘలుల ఆక్రమణ అని చెప్పవచ్చు.

కశ్మీర్ మొఘలుల ఆక్రమణ గురించి అక్బర్ నామాలో అబ్దుల్ ఫజల్ రాసినట్టు- 'కశ్మీర్‌కు నాలుగు వైపులా కొండలు కాపలాదారులుగా నిలబడి ఉన్నాయి. ప్రతి రహదారీ ఒక లోయలోకి దారి తీస్తుంది. కాబట్టి ఉన్నట్లుండి దాడి చేయటం కుదరదు. శ్రీనగర్‌లో ఆరేడు రహదారులు ఉన్నా సైన్యం వాటిలో కవాతు చేయలేదు. ఏ వైపు నుండి అయినా ఆ రోడ్లు దిగ్బంధనం అయ్యే అవకాశం ఉంది. కశ్మీర్ రోడ్లన్నీ సైనికులతో నిండిపోయాయి. సైనికులు ప్రతి ఇంటి కప్పు పైనా ఎక్కి కూర్చున్నారు. మొదట కశ్మీర్ పల్లె ప్రాంతాలనీ, ముఖ్యమైన పట్టణాలనీ, శ్రీనగర్ నగరాన్ని ఆక్రమించిన తరువాత కూడా తిరుగుబాటుదార్లు ప్రతిఘటిస్తూనే ఉన్నారు. సైన్యాన్ని కొంత ఉపసంహరించగా ఇంకా 4892 అశ్విక దళాన్ని, 92400 కాలి దళాన్ని అక్బర్ అక్కడే ఉంచేశాడు.' అంత ఎక్కువ సైన్యాన్ని వినియోగిస్తే కానీ కశ్మీర్ వారికి అందలేదు. అబ్దుల్ ఫజల్ దృష్టిలో కశ్మీర్‌కు చెరుపు చేసేవారు వారి ప్రజలే. అంత జనాభా ఉన్న ప్రదేశంలో ఒక్క బిచ్చగాడు కూడా లేకపోవటం చూసి అబ్దుల్ ఫజల్ ఆశ్చర్య పోయాడు. ప్రజలు మూడు నాలుగు అంతస్తుల ఇళ్లలో దర్జా జీవితం గడుపుతున్నారు అని రాశాడు. మొఘలులు కశ్మీర్‌ని ఒక పెద్ద జిల్లాగా కుదించి సర్కార్ అని పిలవటం మొదలు పెట్టారు.

**"కశ్మీర్‌కు 350 సంవత్సరాల పోరాట చరిత్ర ఉంది. అంతకన్నా ఎక్కువ అణచివేత చరిత్ర ఉంది. కశ్మీర్ హిమ భూభాగాన్ని శాస్త్రీయ పద్ధతిలో అనేక పొరలుగా విభజిస్తూ పోతే, ఆ పొరలన్నిటిలోనూ- ఆ పోరాటాలలో, ఆ అణచివేతలో చనిపోయిన ప్రజల అస్థి పంజరాలు గుట్టలుగుట్టలుగా కనిపిస్తాయి. ప్రపంచమంతా పరపీడన పరాయణత్వంలో అణగారిపోయినా, కశ్మీర్ ప్రజలది ప్రత్యేక పరిస్థితి. వారిది విరామెరుగని పీడన కథ. అలుపెరుగని పోరాట గాథ. కశ్మీర్ ఎప్పుడూ ఆ పోరాటాలలో గెలవలేదు. ఎప్పుడూ ఓడిపోలేదు కూడా"**

ఈ ఆక్రమణకు వ్యతిరేకంగా అనేక తిరుగుబాట్లు చాలా కాలం జరిగాయి. ముఖ్యంగా యువకులు దిలావర్ల పేరుతో అనేక గెరిల్లా పోరాటాలు చేశారు. వారిలో కరుడుగట్టిన తిరుగుబాటుదారుల్ని అక్బర్ ప్రభుత్వం దాల్ సరస్సులోని దీవుల్లో చిత్రహింసలు పెట్టి చంపేసింది. కాలక్రమేణా మొఘలులపై వారి ప్రతిఘటన అంతరించినప్పటికీ, కశ్మీరీలు ఇప్పటికే మొఘలులను 'షికాశ్ మొగుల్', 'పోగీ మొగుల్' అంటూ తిట్టుకొంటూ వారి విచారాన్ని కప్పెడుతూ ఉంటారు. అక్బర్ ఈ తిరుగుబాటుదారులను గమనంలోకి తీసుకొని తన సైనిక స్థావరాన్ని కశ్మీర్‌లో కూడా స్థాపించాడు. అలా నిర్మించినవే హరిపార్ భట్ అనే నగరం, దాని చుట్టూ కళాయి అనే పెద్ద గోడ.

అక్బర్, ఆయన జీవిత కాలంలో మూడు సార్లు కశ్మీర్‌కు వచ్చాడు. ఆయనతో బాటు 80000 సైన్యం కశ్మీర్‌కు ప్రయాణం చేసింది. అనేక మంది పండితులు, సైనికాధికారులు కశ్మీర్‌ను దర్శించారు. భారత ఉపఖండంలో కశ్మీర్ సౌందర్యం గురించి ప్రచారం జరిగింది. ఆయన అక్కడ ఏర్పాటు చేసిన రెవెన్యూ సెటిల్మెంట్ వ్యవస్థ తరువాత చాలా కాలం కొనసాగింది. అక్బర్ తరువాత జహంగీర్ 13 సార్లు కశ్మీర్ వచ్చాడు. జహంగీర్ కశ్మీర్‌ను ఎంతో ప్రేమించాడు. ఎన్నో ఉద్యానవనాల నిర్మాణం ఆయన కాలంలో జరిగింది. దాల్ సరస్సు ఒడ్డున ఉన్న షాలిమార్, నిషాత్ ఉద్యానవనాలు ఆయన కట్టించినవే. తరువాత షాజహాన్ కూడా చాలాసార్లు కశ్మీర్ లోయకు వచ్చాడు. ఈ ముగ్గురు రాజుల వలన కశ్మీర్ పేరు ప్రపంచమంతా మార్మోగింది.

మొఘలులలో పేరెన్నిక గలిగిన చివరి వారసుడు ఔరంగజేబ్ ఒకే ఒకసారి కశ్మీర్‌కు పయనం అయ్యాడు. ఆయనతో పాటు కశ్మీర్‌ను దర్శించిన యాత్రికుడు ఫ్రాంకోయిస్ బెర్నియర్ ఆ నాటి

కశ్మీర్ పరిస్థితుల గురించి తన యాత్రా అనుభవాలలో రాసుకొన్నాడు. 1664 డిసెంబర్ 6న; 35000 ఆశ్విక దళం, 11000 కాలిదళంతో ఈ ప్రయాణం మొదలైయ్యింది. కశ్మీర్‌ను వర్ణిస్తూ 'ఉపపర్వతాలు లేని ఎత్తైన కొండలు, సెలయేళ్లు, జలపాతాలు ఉన్నాయి. సారవంతమైన నేలలో మంచి మంచి పూలూ, పండ్లు పండుతాయి. అన్నిటికంటే అందమైన ఉద్యానవనం షాలిమార్' అని రాసుకొన్నాడు. 'కశ్మీరులు చాలా తెలివైన వారు, ఇతర భారతీయుల కంటే చతురులు. చాలా చలాకీగానూ, కష్టపడుతూ ఉంటారు. కవిత్వంలోనూ, సైన్స్‌లోనూ పర్షియన్లకు ఏ మాత్రం తీసిపోరు. అయితే ఇక్కడ చెప్పుకోదగ్గ విషయం శాలువాల తయారీ. చిన్నపిల్లలు కూడా ఈ తయారీలో భృతి పొందుతారు' అని కూడా రాసుకొన్నాడు.

## ఆఫ్ఘనుల పాలన (1752-1819)

1707లో ఔరంగజేబ్ మరణం తరువాత మొఘల్ సామ్రాజ్యం ఛిన్నాభిన్నమైపోయింది. కశ్మీర్‌లో స్వర్ణ యుగం అంతరించింది. తరువాత వచ్చిన మొఘులుల రాజులు నియమించిన కశ్మీర్ గవర్నర్లు కశ్మీర్‌కు ఎప్పుడూ వెళ్లే సాహసం చేయలేదు. వారి ప్రతినిధులను పంపి చేతులు దులుపుకొన్నారు. అక్బర్, జహంగీర్, షాజహాన్‌ల కాలంలో ఇలా ఎప్పుడూ జరగలేదు. మళ్లీ కశ్మీర్ బయట ప్రపంచం నుండి ఒంటరిది అయిపోయింది. అవినీతిపరులైన, ఆశబోతు అధికారుల చేతిలో పడిపోయింది. అణచివేత, దానిని అనుసరించి పౌర తిరుగుబాట్లు కశ్మీర్ అంతటా ప్రారంభం అయ్యాయి. ఆ సమయంలోనే నెహ్రూ కుటుంబం ఉత్తరప్రదేశ్‌కు వలస వచ్చింది. కశ్మీర్ పండితుల వలసలు అప్పటి నుండే ప్రారంభం అయ్యాయని అర్థం చేసుకోవాలి.

మొఘులులు మధ్య భారతం నుండి కశ్మీర్ పై దండయాత్రలు చేస్తే, ఆఫ్ఘనులు తమ ఆక్రమణను ఆఫ్ఘనిస్తాన్ నుండి ప్రారంభించారు. అహమ్మద్ షా దురాణి 1752లో కశ్మీర్‌ను ఆక్రమించాడు. అతడు అబ్దాలి తెగకు చెందిన సదోజై వంశానికి చెందినవాడు. ఈ వంశస్థులు మొదట్లో ముస్లిములలో షియా తరహాకి చెందినవారు. తరువాత సున్నీలుగా ఇంకో తరహాకి మారిపోయారు. నదిర్ షా హత్యకు గురి అయిన తరువాత, అహమ్మద్ షా 'కోహినూర్' వజ్రాన్ని సంపాదించి ఆఫ్ఘన్ రాజ్యానికి రాజు అయ్యి, ఆఫ్ఘన్ సామ్రాజ్య వ్యవస్థాపకుడు అయ్యాడు. అతను భారత ఉపఖండపు ప్రాంతంపై పది సార్లు దండయాత్రలు చేశాడు. పానిపట్ యుద్ధంలో మరారాలను ఓడించి 1752లో కశ్మీర్‌ను తన సామ్రాజ్యంలో కలిపేసుకొన్నాడు. అదే సమయంలో మొఘులులు బలహీనపడటంతో కశ్మీరీ సంస్థానాధిపతులు కొందరు తమను పాలించమని ఆఫ్ఘనులను కోరారు. ఆఫ్ఘనులు కూడా మొఘులులలాగా నాగరిక జీవులని కశ్మీరీలు పొరపడ్డారు.

అహమ్మద్ ఖాన్ నియమించిన 'అబ్దుల్లా ఖాన్ అయిషాక్ ఆకశి' తన దుర్మార్గమైన పాలనను కశ్మీర్‌లో ప్రారంభించాడు. నియమితుడు అయిన ఐదు నెలల్లోనే కశ్మీర్‌ను పిండి ఒక కోటి రూపాయలు, అనేక విలువైన వస్తువులతో కాబూల్ వెళ్లిపోయాడు. తరువాత అతని ప్రతినిధులుగా అబ్దుల్లా ఖాన్ కాబూలిని గవర్నర్‌గానూ, సుఖ్ జీవన్ మాల్‌ను కార్యనిర్వాహక అధికారిగానూ అక్కడ నియమించాడు. ఈ సుఖ్ జీవన్ మాల్ ఒక గుజరాతీ. ఇతను కాబూలిని హత్య చేసి స్థానిక సంస్థానాధిపతి అబ్దుల్ హాసన్ బాండే సహాయంతో ఆ ప్రాంతం మీద ఆధిపత్యం సంపాదించాడు. అప్పటికే కశ్మీర్ నుండి దోచుకొని పోయిన కోటి రూపాయల కంటే ఎక్కువ డబ్బు ఇవ్వలేక సుఖ్ జీవన్ మాల్ ఆఫ్ఘనులకు ఎదురు తిరిగాడు. ఎనిమిదన్నర నెలల తరువాత అతన్ని ఓడించి అహమ్మద్ షా దురాణి అతన్ని గుడ్డివాడిగా చేసి సంహరించాడు.

అహమ్మద్ షా దురాణి మరణం తరువాత కశ్మీర్ పాలనకి వచ్చిన ఆఫ్ఘన్ రాజు అమీర్ మహమ్మద్ ఖాన్ ఇంకా దుర్మార్గుడు. తరువాతి రాజు కరీం దాద్ హిందువులకూ ముస్లిములకూ ఇద్దరికీ శత్రువు. అతని కొడుకు అంజాద్ ఖాన్ అత్యంత క్రూరుడు. అతని గురించిన కథలు ఇప్పటికీ ప్రచారంలో ఉన్నాయి. ఆయన పరివారంతో శ్రీనగర్‌లోని ఒక బ్రిడ్జ్ మీద నడుస్తుండగా తన తుపాకి గురిని పరీక్షించటానికి అక్కడ ప్రేక్షకులుగా వచ్చిన వారిలో ఒక వ్యక్తిని గురి చూసి చంపేశాడు. అంతటి కర్కోటకుడిగా అతనికి పేరు ఉంది. సొంత తల్లిని గొడ్డుమోతుగా అవమానిస్తూ తరిమేశాడు. భార్యలలో ఒకరిని చంపేశాడు. తన కంటికి వచ్చిన పొరను త్వరగా నయం చేయలేదని వైద్యుణ్ని హత్య చేశాడు.

ఆఫ్ఘన్ల పాలనలో 26 మంది గవర్నర్ల నియామకం జరిగింది. ఈ వరుస క్రూర గవర్నర్ల చేతిలో కశ్మీరీలు ఎన్నో అవస్థలు పడ్డారు. ఆ గవర్నర్లు ఆఫ్ఘన్ పాలకులకు కప్పం అప్పచెప్పటానికి కశ్మీర్‌ను పీల్చి పిప్పి చేశారు. 1783లో కశ్మీర్‌ను దర్శించిన జార్జి ఫోస్టర్ ఆఫ్ఘనుల క్రూరపాలనను గురించి రాశాడు. 'ఆఫ్ఘన్ పాలన అత్యంత కిరాతకంగా నడిచింది. కశ్మీర్ సౌందర్యాన్నీ, అక్కడి ప్రజల మంచితనాన్నీ ఆఫ్ఘనులు నేలపై రాసేశారు. చిన్నచిన్న నేరాలకు వారిని ఒకరి వీపుకు ఇంకొకరిని కట్టి నదుల్లోకి తోసేసేవారు. వారి సంపాదనను దోచుకొనే వారు' అని తన రాతల్లో చెప్పాడు. కశ్మీరీలు గొప్ప కళాకారులు అనీ, వారికి సరైన సంరక్షకత్వం లభించి ఉంటే ప్రపంచంలోనే గొప్ప వృత్తికారులు అయి ఉండేవారని చెప్పాడు. ఏ పాలకుల నుండీ వారికి సరైన జీవనం రాలేదని అన్నాడు. కశ్మీరీలు యూదుల మాదిరి ఉంటారని కూడా అన్నాడు.

## సిక్కుల పాలన (1819-1846)

చరిత్ర క్రమంలో కశ్మీర్‌ను పాలించిన పాలకులందరూ కశ్మీరీల శ్రమనూ, అసహాయతనూ దోచుకోవటానికే ఉత్సాహపడ్డారు. ఆఫ్ఘన్ల మొరటు పాలనలో కశ్మీరీలు నానా బాధలు పడ్డారు. కశ్మీర్‌ను ఒక ధనాగారంగా, దోచుకోవటానికి అనువైన ప్రదేశంగానే ఆఫ్ఘనులు భావించారు. 19వ శతాబ్దం మొదటి భాగంలో ఆఫ్ఘనుల శక్తి క్షీణిస్తూ వచ్చింది. ఆఫ్ఘను గవర్నర్ల పాలన నుండి విముక్తి పొందటానికి కశ్మీరీలు మళ్లీ తప్పు చేశారు. స్వపరిపాలనకు అనువైన స్థితి అప్పటికి కశ్మీర్‌కు లేదు. ఆనాడు భారత ఉపఖండంలో చెప్పుకోదగ్గ శక్తిగా సిక్కుల పాలన మొదలైయ్యింది. ఉమ్మడి పంజాబ్ (ఇప్పుడు సగం పాకిస్తాన్‌కు పోయింది) రాజధాని లాహోర్‌ను

కేంద్రంగా చేసుకొని సిక్కుల పాలన మహోన్నతంగా ప్రారంభం అయ్యింది. రంజిత్ సింగ్ సిక్కుల సామ్రాజ్యానికి చక్రవర్తిగా ఉన్నాడు. సిక్కులు 1812లోనూ, 1814లోనూ కశ్మీర్‌ను ఆక్రమించుకొనే ప్రయత్నం చేసి విఫలం అయ్యారు. పండిత్ భీర్బల్ ధార్ అనే కశ్మీరీ సంస్థానాధిపతి లాహోర్‌కు తప్పించుకొని వెళ్లి ఆఫ్ఘనులను కశ్మీర్ నుండి వెళ్లగొట్టమని రంజిత్ సింగ్‌ను వేడుకొన్నాడు.

భీర్బల్ ధార్ లాహోర్‌కు వెళ్లబోయే ముందు తన కుటుంబాన్ని అబ్దుల్ ఖాదూస్ గౌజ్వరి అనే ముస్లింకు అప్పగించి వెళ్లాడు. భీర్బల్ ధార్ అల్లుడి ద్వారానే ఈ సమాచారం తెలుసుకొన్న ఆ నాటి ఆఫ్ఘనుల చివరి గవర్నర్ అజీమ్ ఖాన్, అబ్దుల్ ఖాదూస్ గౌజ్వరి కుటుంబాన్ని హత్య చేశాడు. భీర్బల్ ధార్ భార్య ఆత్మహత్య చేసుకొన్నది. అతని కోడల్ని అపహరించారు. అలా ఒక ముస్లిం కుటుంబం సిక్కుల పరిపాలన కోసం ప్రాణ త్యాగం చేసుకొన్నది. రంజిత్ సింగ్ ఆదేశంతో సిక్కు సైన్యాలు దేవన్ చాంద్ నాయకత్వంలో భీర్బల్ ధార్ మార్గదర్శకం వహిస్తుండగా 1819లో కశ్మీర్ లోయను ఆక్రమించాయి. సిక్కు రాజ్యానికి ఈ గెలుపు ఇంకొక చేర్పును సమకూర్చిపెట్టింది. సిక్కులు అధికారంలోకి వచ్చాక భీర్బల్ ధార్‌కు రెవెన్యూ అధికారిగా మంచి పదవి ఇచ్చారు.

సిక్కులు అతి తక్కువ కాలం కశ్మీర్‌ను పాలించినప్పటికీ, పీడనలో ఆఫ్ఘనులను తలదన్నారు. విక్టర్ జాక్ క్యూమోంట్ అనే ఫ్రెంచి చరిత్రకారుడు కశ్మీర్ నుండి రాసిన ఉత్తరాలలో సిక్కుల పాలనలో కశ్మీరీలపై జరిగిన అఘాయిత్యాలు తెలుస్తాయి. ఆయన నివాసం ఉన్న కాంప్ దగ్గరలోనే, నదీ తీరంలో ఒక దజను మంచి ఉరితీయబడి ఉండటం చూశాడు. అతన్ని చూడటానికి వచ్చిన సిక్కు గవర్నర్ తమ పాలనలో మొదటి సంవత్సరంలో రెండు వందల మందిని ఉరి తీశాననీ, ఈ సంవత్సరం అక్కడక్కడా మాత్రమే ఉరి తీయాల్సి వచ్చిందనీ, దేశాన్ని అదుపులో పెట్టటానికి ఇది చాలనీ చాలా తేలిగ్గా చెప్పాడట. 'నేనే ఈ ప్రాంతాన్ని పరిపాలించగలిగితే ఈ గవర్నర్‌నీ అతని సైన్యాన్నీ జైలులో పెట్టేవాడిని. వారి చేత ఒక మంచి రోడ్డు నిర్మాణం చేయించేవాణ్ని. వీళ్లంతా పేద కశ్మీరీ రైతుల శ్రమను దోచుకొంటూ పని చేయకుండా బతుకుతున్నారు' అని రాసుకొన్నాడు. కశ్మీర్‌లోని అందమైన అమ్మాయిలు పంజాబ్‌కి తరలించబడ్డారని కూడా రాసుకొన్నాడు. తన తండ్రికి విక్టర్ జాక్ క్యూమోంట్ రాసిన ఉత్తరంలో ఒక సారి తనను వందలాదిమంది చుట్టుముట్టారనీ, వారంతా అనేక జబ్బులతో బాధపడుతున్నారనీ, వాళ్లలో గుడ్డితనం వచ్చిన వాళ్లు చాలా మంది ఉన్నారనీ, కశ్మీర్‌లో వారికి ఎలాంటి వైద్య సౌకర్యాలూ అందించటం లేదనీ, తాను ఏమి చేయలేక వారికి కొంత డబ్బు దానం చేశాననీ రాశాడు.

ఇంకో యాత్రికుడు హుగెల్ రాసినదాన్ని బట్టి సిక్కుల పాలనలో కశ్మీర్‌లో శాలువాలు తయారు చేసే వారు తప్ప మిగిలిన సాధారణ జనం బిచ్చగాళ్ల కంటే దీనంగా ఉన్నారని తెలుస్తుంది. కశ్మీరీలను అదుపులో ఉంచటానికి సిక్కులకు ఉన్న రెండు బెటాలియన్ల సైన్యం సరిపోయిందనీ, కశ్మీరీలు అప్పటికి చాలా బలహీనంగా, అహింసావాదులుగా ఉన్నారనీ చెప్పాడు. కశ్మీర్ ప్రజల మధ్య ఎన్ని తగాదాలు ఉన్నా సిక్కు సైన్యం ఉనికిలో వారు ఒకటిగా ఉండేవారనీ రాసుకొన్నాడు. హిందూ ముస్లిం ఐక్యత బాగా ఉండేదనీ, హిందువులు ఒకరినొకరు 'రామ్ రామ్' అని పలకరించుకొనేవారనీ, హిందువులు ముస్లిములను 'సాహిబ్ సలామత్' అని పలకరించేవారనీ, ముస్లిం హిందువుని 'దౌలత్ జాదా' (భాగ్యవంతుడివి అవుగాక) అని పలకరించేవారనీ, దానికి సమాధానం 'ఉమర్ దరాజ్' (ఆయుస్సు పెరుగుగాక) అని వచ్చేదనీ చెప్పాడు. ముస్లిములు యూదులలాగా ఉండే వారని, హిందువులు తెల్లటి చాయతో ఉండేవారనీ చెప్పాడు. వారి చాయకు కారణం అక్కడి నీరు కారణం అని రాసుకొన్నాడు. నెయ్యి, వెన్నకు బదులు వారు చవకగా అక్కడ దొరికే బాదం, అప్రికాట్‌ల నూనెను ఆహారంలో తీసుకొనేవారనీ అన్నాడు. అక్కడి మహిళలకు పరదా లేదనీ, కశ్మీరీ మహిళలు యూరప్ మహిళలాగా అందమైన శరీర ఆకృతితో ఉన్నారనీ చెప్పాడు. వాట్‌ఫుల్ అనే తెగకు చెందిన ఆడపిల్లలను పంజాబ్‌కు అమ్మివేస్తారనీ, అందమైన నృత్యకారిణులు ఈ తెగ నుండే వచ్చి ఉంటారని అభిప్రాయపడ్డాడు.

సర్ రిచర్డ్ టెంపుల్ అనే ఆనాటి ప్రభుత్వ కార్యదర్శి రాసినదాని ప్రకారం- కశ్మీరీ ముస్లిములు సుమారు 20 తెగలుగా ఉన్నారనీ, వారిలో చెక్‌లు యుద్ధ శౌర్యాల కిందకు వస్తారనీ తెలుస్తుంది. వారు కాకుండా మాలికులు, భట్‌లు ఉన్నారనీ చెప్పాడు. ముస్లింలో ప్రధాన మతం 'ఋషులని' చెప్పాడు. వారు సన్యాసులని చెప్పటం విశేషం. ఇలాంటి వర్గం ఉనికి కశ్మీర్ వరకే ప్రత్యేకం అని కూడా అన్నాడు. శాలువలు నేసేవారు కూడా ముసల్మానులేనని, వారికి చాలా తక్కువ డబ్బులు వస్తాయనీ, ఆహార లోపంతో తక్కువ స్థాయి ఇళ్లలో జీవిస్తుంటారనీ చెప్పాడు. భౌతికంగా, నైతికంగా వారు చాలా దౌర్భాగ్య స్థితిలో ఉన్నారని చెప్పాడు.

27 సంవత్సరాల సిక్కు పాలనలో రంజిత్ సింగ్ తొమ్మిది మంది గవర్నర్లను నియమించాడు. మోతీరామ్ అనే గవర్నర్ ఆవు వధను నిషేధించి, దానిని అతిక్రమించిన వారికి మరణ శిక్ష విధించాడు. జామా మసీద్‌ను మూసి వేసి ముస్లిం ప్రార్థనలను నిషేధించాడు. మసీదులకూ, దర్గాలకూ మంజూరీ అయిన భూములను వెనక్కి తీసేసుకొన్నాడు. ముస్లిములు అజా జపించకుండా అడ్డుకొన్నాడు. షా హందాన్ అనే దర్గాను నేలమట్టం చేయమని ఆజ్ఞాపించాడు. 12 శతాబ్దాల కిందట అది కాళీమాత దేవాలయం అని వారి వాదన. అయితే ముస్లిముల నుండి తిరుగుబాటు వస్తుందని భయపడి ఆపేశారు. ముస్లిం ముఖ్యులు ఈ విషయంగా భీర్బల్ ధార్ (ఆఫ్ఘనుల నుండి తప్పించుకోవటానికి సిక్కులను ఆశ్రయించిన వ్యక్తి) ను ఆశ్రయించి ఆ విధ్వంసాన్ని ఆపించుకొన్నారు.

అప్పటికి ఎన్నో శతాబ్దాలుగా ఆచరణలో ఉన్న ఆవు వధ హఠాత్తుగా మరణ శిక్షకు దారి తీయటంతో, ఎందరో ముస్లిములను ఆ వంకతో ఉరి తీశారు. శ్రీనగర్ పట్టణంలో వారిని నేల మీద ఈడ్చుకొంటూ వెళ్లారు. కొందరిని సజీవ దహనం కూడా చేశారు. ఇలా అణచివేతకు గురి అయిన అనేక మంది ముస్లిములు కశ్మీర్ వదిలి వెళ్లారు. వారిలో చాలా మంది పంజాబ్ పరిసర ప్రాంతాల్లో నివాసం ఏర్పాటు చేసుకొన్నారు.

సిక్కుల చివరి కాలంలో కశ్మీర్‌ను దర్శించిన బారోన్ స్క్వొన్బెర్గ్ 'నేను చాలా ప్రాంతాలు చూసి వచ్చాను. ఎక్కడా కశ్మీర్ ప్రజలు అనుభవిస్తున్నంత బాధ లేదు' అని చెప్పాడు. జేపీ ఫెర్గుసన్ అనే ఆయన తన పుస్తకం 'కశ్మీర్' లో 'సిక్కులు ప్రధానంగా విజేతలు. వారి మిలటరీ శక్తి వలనే వారు గెలుస్తారు. వారి విజయ ఫలాలను అనుభవించటానికే వారు ఆసక్తి చూపుతారు. తాము ఏర్పాటు చేసిన స్థిరమైన ప్రభుత్వాలతో ప్రజా సంక్షేమం చూడాలనే తలంపు వారికి పూర్తిగా తెలియని విషయం. ఒక కశ్మీరీ సిక్కు చేతితో చనిపోతే వచ్చే పరిహారం, ఆ చనిపోయిన వ్యక్తి హిందువు అయితే నాలుగు రూపాయలు. అదే ముస్లిం అయితే రెండు రూపాయలు' అని రాశాడు.

విక్టర్ జాక్ క్యూమోంట్ 'కొన్ని వేలమంది క్రూరులైన సిక్కు సైనికులు; వారి పక్కన కత్తులు దోపుకొని, వారి బెల్టులలో తుపాకీలు పెట్టుకొని; గొర్రెల మందలాంటి బలహీనులైన తెలివి కలిగిన కశ్మీరీలను పాలించారు' అని రాశాడు.

మూర్ క్రాఫ్ట్ అనే సిక్కు కాలం నాటి యాత్రికుడు తమను కశ్మీర్ కొండలపైకి తీసుకొని వెళ్లే కశ్మీరీలు అత్యంత దౌర్భాగ్య స్థితిలో అర్ధ నగ్నంగా ఉన్నారనీ, వారు పేదరికంతో, ఆకలితో చావబోయే స్థితిలో ఉన్నారనీ, సిక్కులు కశ్మీరీలను గొర్రెలకంటే కాస్త ఎక్కువగా చూస్తున్నారంతే అనీ, ఒక కశ్మీరీని సిక్కు చంపితే 16 రూపాయలు మాత్రమే పరిహారంగా చెల్లించాలనీ రాసుకొన్నాడు.

ప్రముఖ పరిశోధకుడు ఆర్.కే పర్మూ తన పుస్తకం 'A History of Sikh Rule in Kashmir' లో కశ్మీరీలు సిక్కుల పాలనలో అన్ని రకాల రాజకీయ అణచివేతకూ గురి అయ్యారని రాశాడు. ఆ అణచివేత కాకుండా తరచుగా వచ్చే కరువులు కూడా వారిని హింస పెట్టాయని అన్నాడు. అయితే అంతటి ప్రతికూల పరిస్థితుల్లో కూడా కశ్మీరీలు వారి సామాజిక సంబంధాలలో లౌకికవాద గుణాలను వదులుకోలేదని అభిప్రాయపడ్డాడు. ఇలాంటి ఉదాహరణలు చరిత్రలో చాలా తక్కువ ఉన్నాయని తన పుస్తకంలో రాసుకొన్నాడు. ముసల్మానులు ఎక్కువగా బాధ పడటానికి కారణం వారు శాలువల నేతగాళ్లుగా, చేతి కళల ఉత్పత్తిదారులుగా ఉండటమేనని అన్నాడు. కశ్మీర్‌లో తమ సంస్కృతిని వ్యాపింపచేయటానికి దాదాపు అందరు సిక్కు గవర్నర్లు తమ ఉత్సాహాన్ని ప్రదర్శించారనీ చెప్పాడు. జామియా మసీదు లాంటి ఎన్నో మసీదులు మూతపడి, ముస్లిం ప్రార్ధనలు నిషేధానికి గురి అయిన తరువాత కూడా ముస్లిములు తమ సహనాన్ని కోల్పోలేదని చెప్పాడు. సిక్కులు అనేక గురుద్వారాలు నిర్మించుకొని, పెద్ద సంఖ్యలో సిక్కు మత బోధకులు కశ్మీర్‌లో ప్రవేశించిన తరువాత కూడా కశ్మీరీలు ఆ విషయానికి పెద్ద ఇబ్బంది పడలేదనీ, దానికి కారణం వారు మత సహనం కలిగిన వర్గానికి చెందినవారనీ అన్నాడు.

అయితే వారు, ముఖ్యంగా ముస్లిములు, సిక్కుల ం వలన చాలా బాధ పడ్డారనీ, వారి బాధల్లో ముఖ్యమైనది ఎ బాధలు చెప్పుకోవటానికి ఎలాంటి కోర్టులు లేవనీ రాశాఴ. ఈ పరిస్థితికి అధికార యంత్రాంగం కాకుండా కేవలం రంజిత్ సింగ్ ప్రభుత్వమే కారణం అని తీర్మానించాడు. రంజిత్ సింగ్‌కు పన్నుల సేకరణ పట్ల ఉన్న ఆసక్తి, సంపద సృష్టించినవారికి కనీస సంతృప్తి కలిగించే విషయం పట్ల లేదని అభిప్రాయపడ్డాడు.

నిత్యం వచ్చే కరువులు, ఆకలి చావులు, అధికార యంత్రాంగ వేధింపులు- ఇవన్నీ చాలామంది రైతులనూ, శాలువా నేతగాళ్లనూ, కూలీలనూ, మేధావులనూ కశ్మీర్ నుండి పారిపోయి వారు భరించగలిగిన స్థలాల్లో నివాసం ఏర్పాటు చేసుకొనేటట్లు చేసింది అని చెప్పాడు. అలా వలసలు వారిని బాధలను వర్ణించటం కంటే ఊహించటం మంచిదని అభిప్రాయపడ్డాడు. కశ్మీరీ కాలనీలు చుట్టుపక్కల పర్వత ప్రాంతాలైన భధర్వ, కిస్త్వార్, జమ్మూ, రేయసి, పుంచ్, రజౌరి, మిర్పూర్ లలోనూ; ఇంకా హిమాచల్ ప్రదేశ్‌లోని సిమ్లా, బిలాస్‌పూర్ , చంబా, మండి, రాంపుర్, నూర్‌పూర్‌లలోనూ; ఉమ్మడి పంజాబ్ రాష్ట్రంలోని అమృత్ సర్, సియాల్కోట్, హొషియార్‌పూర్, గుజ్రన్వాలాలలోనూ ఏర్పడ్డాయని రాశాడు. కశ్మీర్ పండితుల వలసల గురించి ఇప్పుడు గగ్గోలు పెడుతున్నవారు ఆ నాడు సిక్కులు, ఆ తరువాత డోగ్రాల పరిపాలనలలో ఎంతమందో కశ్మీరులు, అందులో ఎక్కువగా ముస్లిములు పొట్ట చేత బట్టుకొని కశ్మీర్ నుండి వలసలు వెళ్లిన విషయం గురించి మాట్లాడరు. వలసలకు ఉండే రాజకీయ, ఆర్థిక కారణాల గురించి అర్థం చేసుకోకుండా కేవలం మత కారణాలను ఆపాదించటం ఎంత పొరపాటో.

రంజిత్ సింగ్ తన హయాంలో ఒక్కసారి కూడా కశ్మీర్‌ను దర్శించలేదు. ఆయన పంపిన గవర్నర్లని కూడా ఒకరి తరువాత ఒకరిని మారుస్తూ పోయాడు. ఆ గవర్నర్లు కూడా లాహోర్ దర్బార్‌లో తమ సొంత లాబీలు చేసుకొంటూ, వాటి కోసం వ్యవస్థలను ఏర్పాటు చేసుకొంటూ కాలం వెళ్లదీశారు. రంజిత్ సింగ్ తన అధికారులకు కశ్మీర్ గురించి ఇచ్చిన ఆదేశాలలో 'కశ్మీరీలు సర్వవ్యాపిత దేవుణ్ణి పూజించేవారు. వారి దీవెనలు మహారాజాకూ, అతని రాజ్యానికీ ఉపయోగపడతాయి. కాబట్టి అధికారులందరూ వారి సంక్షేమానికి పాటు పడాలి' అని చెప్పాడు. చెప్పటం అయితే చెప్పాడు కానీ అది ఆచరణలోకి వచ్చిందో లేదో చూసుకొనే శ్రమ ఆయన పడలేదు. అంతిమంగా కశ్మీరీలకు అన్యాయం చేసిన సమూహంలో ఒకడుగా రంజిత్ సింగ్ మిగిలిపోయాడు. సిక్కు పాలన కశ్మీరీలకు నరకం చూపించింది.

(ఇంకా ఉంది)

## సంప్రదింపు పుస్తకాలు :


Kashmir: Glimpses of History and the story of Struggles by Saifuddin Soz

Curfew night: Bhasharat Pir

Hindu Rulers and Mulsim Subjects: Mridu Rai

Behold I shine: Freny Manecksha

Wiki pedia

Different online magazines






# ఇది కశ్మీర్. దీని గురించి ఎవరూ మాట్లాడకూడదు

వంగపల్లి పద్మ




370 ఆర్టికల్‌ను రద్దు చేశారు. ఒక్క మాటతో కశ్మీర్ ప్రజల స్వేచ్ఛను హరించేసారు. శాసనాధికారంతో రాజ్యాంగ హామీని తుంగలో తొక్కారు. ఒక్కవేటుతో ఒక స్వతంత్ర జాతికి హక్కులు లేకుండా చేసారు. అక్కడ చర్చలకు లేవు. ప్రతివాదనలకు అవకాశం అంతకన్నా లేదు. ఆర్టికల్ రద్దయిన రోజునుండి, అక్కడ ఇంటర్నెట్ సౌకర్యం లేదు. అక్కడి వార్తలకు ఆస్కారం లేదు. వారి నిరసనధ్వనులు వినేందుకు అవకాశమే లేదు. మొత్తానికి అక్కడ ఏం జరుగుతుందో బైటి ప్రపంచానికి తెలియకుండా చేసారు. అక్కడి ప్రజల మనోభావాలతో పనిలేదన్నట్టుగా వ్యవహరిస్తున్నారు.

ఇలాంటి పరిస్థితుల్లో దేశవ్యాప్తంగా మీడియా సంస్థలు ఒక అడుగుముందుకేసి, అక్కడ ఏం జరుగుతుందో తెలుసుకునేందుకు ప్రయత్నించాయి. ఇందులో తెలుగు మీడియా కూడా అక్కడి వార్తల్ని సేకరించేందుకు కదిలింది. ఈ క్రమంలో కొద్దిమంది మహిళా జర్నలిస్టులు కూడా ధైర్యంగా, తమ వృత్తిలో భాగంగా కశ్మీర్ ప్రాంతానికి కవరేజ్ కోసం వెళ్లారు. అక్కడ వారు చూసిన పరిస్థితుల్ని వార్తల రూపంలో అందించేందుకు ప్రయత్నించారు.

తెలుగు మీడియాలో గత దశాబ్దన్నరకాలంగా పనిచేస్తున్న రెహానాబేగం కూడా ఇటీవల తన వృత్తిలో భాగంగా కశ్మీర్‌కి వెళ్లారు. అనేక వార్తల్ని తను ప్రాతినిధ్యం వహిస్తున్న ఛానల్ కోసం అందించారు. అదే సమయంలో వ్యక్తిగతంగా అక్కడి పరిస్థితులు చూసాక తన స్పందనని సోషల్ మీడియాలో ఇలా వ్యక్తం చేసారు.

*'సంకెళ్లలో కశ్మీర్*

*ఇదో చారిత్రక సందర్భం*

*నిరసన గళాలపై నిషేధాజ్ఞలు ప్రకటించిన సందర్భం*

*ఈ కాలానికి నేనూ ఓ సాక్షిని...'*

అక్షరాల ఇవే వాక్యాలు రెహానా బేగం సోషల్ మీడియాలో వ్యక్తం చేసింది.

కానీ, ఈ వాక్యాలను ఆధారం చేసుకుని రెహానా బేగంపై కొంతమంది వ్యక్తులు కంప్లైంట్ ఇచ్చారు. జర్నలిస్ట్ అసోసియేషన్ ఆఫ్ తెలంగాణా లెటర్ హెడ్ మీద డిజిపికి ఆ కంప్లైంట్ అందించారు. అందులో వారు రాసిన సారాంశమేంటంటే,

సోషల్ మీడియాలో రెహానా పెట్టిన పోస్టింగ్‌ని కోడ్ చేస్తూ, 'రెహానా బేగం తన ఫేస్‌బుక్ అకౌంట్‌లో రాష్ట్రపతి ఆమోదించిన ఆర్టికల్ రద్దుపై తన అక్కసు వెళ్లగక్కుతూ సందేశం పోస్టు చేసింది. ఆమె పెట్టిన పోస్టు భారత రాజ్యాంగాన్ని కించపరిచే విధంగా ఉంది. ఆమె వ్యాఖ్యలు కశ్మీర్‌లోని వేర్పాటువాద సంస్థలు, ఉగ్రవాద సంస్థలకు అనుకూలంగా ఉన్నాయి. ఇప్పటికే ఆమె మీడియా కవరేజ్ పేరుతో పలుమార్లు కశ్మీర్‌కు వెళ్లింది. ఓ సందర్భంలో ఆమె పుల్వామా దాడికి సంబంధించిన సంఘటనలో ఉగ్రవాద కుటుంబ సభ్యులను కూడా కలిసి పరామర్శించింది. పుల్వామా దాడిలో చనిపోయిన ఉగ్రవాద కుటుంబాలకు ప్రగాఢ సానుభూతి తెలిపింది. సైన్యం చనిపోతే పట్టించుకోని రెహానా, ఉగ్రవాదులు చనిపోతే కన్నీరు కార్చి భారత ప్రధానిపై విమర్శలు గుప్పించింది. కశ్మీర్‌లో భారత ప్రభుత్వ చర్యలు ఆమెకు రుచించడం లేదు. కశ్మీర్‌లో న్యూస్ కవరేజీ పేరుతో ఆమె చేస్తున్న ఇతర వ్యవహారలపై విచారణ జరిపించాలని కోరుతున్నాం. రెహానా చర్యల్ని సమర్థిస్తున్న వారిపై కూడా చర్యలు తీసుకోవాలని కోరుతున్నాం.'

ఇలా సాగింది వారు రాసిన కంప్లైంట్. ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, సోషల్ మీడియాలోనూ రెహానాకి అనేక మంది మద్దతుగా నిలబడ్డారు. చివరికి అలా మద్దతుగా నిలబడిని వారిని కూడా టార్గెట్ చేయడం మనకు స్పష్టంగా కనిపిస్తోంది.

ఆర్టికల్ 370 రద్దు తరువాత కశ్మీర్ ప్రజల మనోభావాలు ఎలా ఉన్నాయో, వారు ఎలా ఫీలవుతున్నారో ప్రభుత్వం ఎలాగూ వెల్లడించదు. అక్కడ ఏ నిరసనలూ లేవు. ఏ ఉద్యమాలూ చెలరేగటం లేదు. ఎక్కడా శాంతిభద్రతలకు విఘాతం కలగడం లేదు. ఏలుతున్న వారు ఏం చెప్తే అదే వార్త.

మనమంతా అక్కడి విషయాలు ఎంతో కొంత తెలుసుకుని మాట్లాడుతుంటేనే, పరిస్థితి ఇలా ఉంది. ఇక అక్కడే ఉండి, అక్కడి యూనివర్శిటిలో చదువుకుని, విద్యార్థినాయకురాలిగా, కశ్మీర్ ప్రజల పోరాటాలకు మద్దతుగా నిలబడి మాట్లాడే నాయకత్వం పరిస్థితి ఇంకెలా ఉంటుందో ఊహించండి. ఇప్పుడు షహ్లా రషీద్ పరిస్థితి కూడా అదే. కేంద్రప్రభుత్వం ఆర్టికల్ 370 రద్దు చేసాక, అక్కడి యువతపైనా, పురుషులపైన ఎలా నిర్భంధాన్ని ప్రయోగిస్తున్నారో, ఇళ్లనుండి ఎలా తీసుకెళ్తున్నారో, పోలీసు వ్యవస్థ ఎంత

# కశ్మీర్ - ఒక దీర్ఘ కవిత

రాజబాల త్రిపధి
ఒరియానుంచి ఇంగ్లీష్ : ధనదకాంత్
తెలుగు: ఎన్ వేణుగోపాల్

ఇప్పుడిక కశ్మీరం మాదే
ఇప్పుడిక మేం 'ఐక్య భారతం'
పల్లెల నుంచి పట్నాల దాకా
టెలివిజన్ తెరల మీంచి ఫేస్‌బుక్ దాకా
మాటలే మాటల కోటలు
కాని, మీ దృష్టిలో కశ్మీర్ అంటే
అమ్మడానికీ కొనడానికీ పనికొచ్చే
హంతక దాడులతో మీ మాట చెల్లుబాటయ్యే
ఒకానొక నేల చెక్క మాత్రమేనా?
రాష్ట్రమంటే రియల్ ఎస్టేట్ భూఖండం కాదనీ
రాష్ట్రమంటే ఆ భూమి మీద నివసించే ప్రజలనీ
ఎట్లా మరిచిపోగలవు?
కశ్మీరీలు లేకుండానే
రాత్రికి రాత్రి కశ్మీర్‌ను వశపరచుకున్నానని
ఎట్లా అనుకోగలవు?
తుపాకి మొన చూపి
కశ్మీరీల నోళ్లు మూసి
సామదానభేదదండోపాయాలతో
వాళ్ల భూమిని కొల్లగొట్టావు
బరువైన బూట్ల పదఘట్టనల కింద
వాళ్ల పెదాల మీది భాషను తుడిచేశావు



యావత్తు జనాభా వేదనపడుతున్నా
అవిరామంగా కన్నీళ్లు వర్షిస్తున్నా
నీకేమీ పట్టడం లేదు
నీకు ప్రజల మీది కన్న
రియల్ ఎస్టేట్ మీదనే ప్రేమ గదా
దుమ్మును అమ్మడమే నీ వ్యాపారం కదా
ఎవడెక్కువ వేలం పాడితే వాడికే అమ్ము
ఎవడి దగ్గర బరువైన డబ్బు సంచి ఉంటే వాడికే
కశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా
నీ కలల కాషాయ జెండా ఎగరెయ్యి
బలప్రయోగంతో ఎవరినైనా ఎప్పుడైనా ఆకట్టుకోగలవా?
కశ్మీర్ నీ చెంతకు చేరలేదు
ఒక్కసారి కళ్లు తెరిచి చూడు
కశ్మీరం నీకు మరింత దూరం జరిగింది
సరసులో తామరపూవు అవతలికి
కదిలిపోయినట్టు తొలగిపోయింది
నీ విజయాన్ని నేనామోదించడం లేదు
మరెవరికీ తెలియకపోయినా
నువ్వు ఓడిపోయావని నీకు తెలుసు
నీ నుంచి నువ్వే లోలోపల ఓడిపోయావు
చరిత్ర చూపులో ఓడిపోయావు
అమాయక కశ్మీరీల కన్నీళ్లలో
నువు ఓడిపోయావని
నీకు జ్ఞాపకం చేయడానికి
ఏ ఒక్కరూ లేకపోయినా
చరిత్ర నిలిచే ఉంటుంది ❁

నామమాత్రంగా పనిచేస్తుందో, సాయుధ బలగాలు ఎలా రెచ్చిపోతున్నాయో, పదేపదే తన మాటల్లో వ్యక్తంచేస్తోంది. రోజువారి రేషన్ కూడా లేక అక్కడి ప్రజలు ఎంతటి అవస్థలు పడుతున్నారో, బైటి ప్రపంచానికి తెలియచేస్తోంది. సాయుధ బలగాలు వ్యవహరిస్తున్న తీరును ఎండగడుతోంది. అందుకే, ఇక ఏకంగా సుప్రీంకోర్టు న్యాయవాదులే ఆమె మీద క్రిమినల్ కేసు దాఖలు చేసారు. ఇదీ అక్కడి పరిస్థితి.

ఇలాంటి పరిస్థితుల్లో ప్రత్యామ్నాయ మార్గాల ద్వారానో, మెయిన్ స్ట్రీమ్ మీడియా సంస్థల ద్వారానో వచ్చే కాసిన్ని వార్తల్ని కూడా ప్రసారం చేసేందుకు అవకాశం లేకుండా చేసేందుకు చేస్తున్న ప్రయత్నంగా ఇది కనిపిస్తోంది. కొంచం చొరవతో, అక్కడి పరిస్థితుల్ని కవర్ చేసేందుకు వెళ్లే జర్నలిస్టులను కూడా అడ్డుకునేందుకు చేస్తున్న చర్యగా అర్థమవుతోంది. భవిష్యత్‌లో తమకు ప్రతికూలంగా వే వారిని, తాము అమలు చేయాలనుకున్న ఎజెండా గురిం ఖ ప్రశ్నించే వారిని బెదిరించో, తప్పుడు కేసులు బనాయించో, తమకు అడ్డులేకుండా చేసుకునేందుకు జరుగుతున్న ప్రయత్నాలేనని మరింత స్పష్టమవుతోంది. గమనించాల్సిన విషయమేమిటంటే, ఇప్పుడు సోషల్ మీడియాలో అనేక ఫేక్ ఐడిలు క్రియేట్ అవుతున్నాయి. అవన్నీ ఒక పథకం ప్రకారమే చేస్తున్నట్టుగానూ కనిపిస్తోంది. అణచివేతకు గురవుతున్న వారి హక్కుల గురించి ఎవరు మాట్లాడినా, వారి మీద పబ్లిక్‌గానే ట్రోలింగ్ మొదలైంది. వారు ఎంతటి జుగుప్సాకరమైన భాషను వాడుతున్నారో మాటల్లో చెప్పలేం.

భావవ్యక్తీకరణలో భాగంగా తమ ఫీలింగ్స్‌ని సోషల్ మీడియాలో పంచుకున్నందుకు మహారాష్ట్రలో షహీన్, రేణు అనే ఇద్దరమ్మాయిల మీద బాల్ థాకరే అనుచరులు చేసిన రాద్ధాంతం, తన అక్షరాలతో ప్రశ్నల్ని సంధించిన గౌరీలంకేష్‌ను హత్య చేసిన వైనం, కార్టూన్స్ గీసిన స్వాతివడ్లమూడిపై కేసు, ఇప్పుడు రెహానాపై పెట్టిన తప్పుడు ఆరోపణల కేసు .. ఈ అన్ని సందర్భాల్లో, సంఘటనల్లో వ్యక్తులు వేరు కావచ్చు. సంస్థలూ వేరు కావచ్చు. కానీ, వాళ్లందరి రంగూ కాషాయమే. వారి ఎజెండా మతం పేరుతో విధ్వంసాన్ని సృష్టించడమే.

మనం జాగరూకతతో వ్యవహరించాల్సిన సందర్భమిది., ఐక్యంగా నిలబడాల్సిన తరుణమిది. ❁

కారాగారంలో కశ్మీర్

# హిందూత్వం, స్త్రీ ద్వేషం - కశ్మీరీ మహిళలు

వి. సంధ్య



ఆర్టికల్ 370ని రద్దు చేస్తూ కేంద్రం నిర్ణయం తీసుకున్న వెనువెంటనే కశ్మీర్‌లో పరిస్థితులు వేగంగా మారిపోయాయి. లక్షలాది సైన్యం మోహరింపుతో 80 లక్షల ప్రజానీకంతో ఉన్న కశ్మీర్ ఒక చెరసాలగా మారింది. కశ్మీర్‌లోయలో నెలకొన్న ఉద్రిక్త పరిస్తితులు ప్రజలను తీవ్ర భయాందోళనలకూ, మానసిక సమస్యలకూ, అభద్రతకూ గురిచేస్తున్నాయి. మన ఆప్తులు ఏదైనా ప్రమాదంలో చిక్కుకున్నా, కుటుంబ సభ్యులు ఉన్న ప్రాంతంలో వరదలు, తుఫానులు ముంచెత్తినా వాళ్లు ఎలా ఉన్నారో అని తల్లడిల్లుతాము. వాళ్లను చేరడానికి శతవిధాలా ప్రయత్నిస్తాము. వారి క్షేమ సమాచారం తెలిసేంతవరకూ నిద్ర కూడా పట్టదు. తీవ్ర అసహనానికి గురవుతాం. కమ్యూనికేషన్ వ్యవస్థను పునరుద్ధ రించాలనీ, మౌలిక సదుపాయాలు కల్పించాలనీ ప్రభుత్వంపై విరుచుకుపడతాం. పైగా నష్ట పరిహారం చెల్లించాలని ఆందోళన బాట పడతాం. మరి అదే పరిస్థితి ప్రభుత్వాల వల్ల దాపురిస్తే ఏం చేయాలి? ఎట్లా స్పందించాలి? ప్రస్తుతం రక్తమోడుతున్న కశ్మీర్ పరిస్థితి అదే. అక్కడ ఉన్నదీ మనుషులే. అష్ట దిగ్బంధనంలో ఎటువంటి సమాచార వ్యవస్థా లేకుండా కశ్మీరీలు మగ్గిపోతుంటే వాళ్లకు సంబంధించిన ప్రతి ఒక్కరిలో ఆందోళన, భయం నెలకొన్నది. నిర్బంధం, కర్ఫ్యూ, ప్రసార ప్రచార సాధనాలకు అంతరాయం వల్ల ప్రజల గళాలు పూర్తిగా మూగపోయాయి. ప్రజలు తమకు అత్యంత ఆత్మీయులైన కుటుంబ సభ్యులను కూడా సంప్రదించలేకపోతున్నారు. నిశ్శబ్ద మేఘాలు దట్టంగా అలుముకున్న కశ్మీరు లోయలో ఎవరూ తమ ఆత్మీయులను పలకరించే పరిస్థితి లేదు . ఈ విధంగా ఎన్నడూ టెలిఫోన్ వ్యవస్థ పని చేయని పరిస్థితి లేదు. ప్రపంచమంతటా ఉన్న వాళ్ల రక్త సంబంధీకులు, బంధువులు, మానవతావాదులు ఆ పరిస్థితి తొలగిపోవాలని కోరుకుంటున్నారు. అది అర్థం చేసుకోలేని, మోడీ ప్రభుత్వ చర్యను సమర్థించే భారతీయులలో మాత్రం దేశభక్తి పొంగి పొర్లుతున్నది.

జమ్మూకశ్మీర్‌కు ప్రత్యేక హోదా కల్పించిన ఆర్టికల్ 370ను రద్దుచేసినందుకు చాలామంది ఆనందించారు. విషయం పెద్దగా అర్థం కాకపోయినా, ఈ హోదాకున్న చారిత్రక, రాజకీయ కారణాలు, అది తీసేస్తే వచ్చే పరిణామాలు తెలియకపోయినా హర్షాతిరేకాలు వ్యక్తం చేస్తున్నారు. ఇటువంటి హోదా కలిగి ఉన్న అసోం, మణిపూర్, మిజోరాం, నాగాలాండ్, అరుణాచల్ ప్రదేశ్, సిక్కింలలో మాత్రం ఆందోళన వ్యక్తమవుతోంది. ఈ సవరణలు, చట్టబద్ధ చర్యలు కశ్మీరీ మహిళలని కూడా విముక్తి చేస్తాయనే వాదన సర్వత్రా వినిపిస్తోంది. ఇక నుంచి వారు పూర్తి వివాహ స్వేచ్ఛ, సమానత్వం అనుభవించొచ్చని, అలాగే వారిని పెళ్లి చేసుకోవటానికి కూడా కొంతమంది ఉత్సాహపడిపోతున్నారు. మరికొంత మంది అక్కడ పెట్టుబడులు పెట్టి వ్యాపార సామ్రాజ్యాలు స్థాపించి లాభాల పంటలు పండించుకోవాలని ఉబలాటపడుతున్నారు. లక్షలాది మంది కశ్మీరీలు రాజ్య హింసకి గురవుతుంటే, కళ్ల ముందు చెప్పలేనంత హింసకి గురవుతుంటే, తమ సమాజం అస్తిత్వమే కోల్పోతుంటే, తాము అభివృద్ధి చెందుతున్నామనీ, హక్కులు పొందుతున్నామనీ వారు ఆనందిస్తారా? అలా వారు భావించాలని మనమందరం అనుకోవటం కేవలం అవివేకం, అజ్ఞానాలకి సూచిక మాత్రమే కాదు, కరడు కట్టిన హిందుత్వ సంస్కృతికీ, వలసవాద, మనువాద భావజాలానికీ నిదర్శనం.

## తీవ్ర ఆందోళన, ఒత్తిడితో మానసిక సమస్యలు ఎదుర్కొంటున్న కశ్మీరీలు

బీజేపీ పాలకుల నిర్ణయం ఫలితంగా కశ్మీరులో అభివృద్ధి సంబరాలు, ఆనందం లేకపోగా ప్రజలు మానసిక జబ్బుల బారిన పడుతున్నారు. మతిస్థిమితం కోల్పోవడం, తీవ్ర ఆందోళనకు గురవ్వడం, విపరీతంగా భయాందోళనలతో రోదిస్తూ పలువురు అపస్మారక స్థితికి చేరుకుంటున్నారు. గడిచిన కొన్ని రోజుల్లో మానసిక సమస్యలతో ఆసుపత్రుల్లో చేరుతున్నవారి సంఖ్య రోజురోజుకూ పెరుగుతోందని ఆసుపత్రి వైద్యులు తెలుపుతున్నారు. మానసిక సమస్యలు ఎదుర్కొంటున్నవారిలో అన్ని వయసులవారూ సుమారు రెండు వేల మంది ఉన్నారు. ఇలా ఆసుపత్రికి వస్తున్న కేసుల్లో 85 శాతం రోగులు అపస్మారక స్థితిలోనే ఆసుపత్రికి వస్తుండడం గమనార్హం.

బారాముల్లాకు చెందిన ఫాతిమా అనే మహిళను అపస్మారకస్థితిలో ఆమె కుటుంబ సభ్యులు శ్రీనగర్‌లోని ఓ హాస్పిటల్‌కి తీసుకు వచ్చారు. అనేక సెక్యూరిటీ చెక్ పోస్టులను దాటుకుంటూ... భద్రతా సిబ్బందికి సమాధానాలు చెప్పుకుంటూ

రాత్రి పూట అతి కష్టం మీద వాళ్లు ఆసుపత్రి చేరుకున్నారు. పరీక్షల అనంతరం ఫాతిమా మానసిక ఆందోళనతో బాధపడుతోందని వైద్యులు తేల్చారు. తన కుటుంబ సభ్యుల భద్రత గురించి కంగారుపడుతున్న ఆ మహిళ వారం రోజులుగా భయాందోళనలతో వణికి పోతోంది. ఫాతిమాలాంటిదే కుప్వారాకు చెందిన నజీర్ అహ్మద్ పరిస్థితి. అపస్మారక స్థితిలో వున్న నజీర్‌ను రాత్రికి రాత్రి కుటుంబ సభ్యులు ఆసుపత్రికి తరలించారు. ఫాతిమా, నజీర్ మాత్రమే కాదు, ఇప్పుడు.. కశ్మీర్‌లో వేలాది మంది మానసిక సమస్యలతో ఆసుపత్రి పాలవుతున్నారు.

ప్రజల్లో తీవ్ర ఆందోళన ఉందనీ, ఆ ఒత్తిడి కారణంగా మానసిక సమస్యలు ఎదుర్కొంటున్నారనీ, ఇది మరింత తీవ్ర స్థాయికి చేరుకునే ప్రమాదం ఉందని డాక్టర్ హుస్సేన్ తెలిపారు. రోగులకు ఆరు నుంచి ఎనిమిది గంటల పాటు హాస్పటల్ వార్డులో చికిత్స అందించిన తరువాత డిశ్చార్జ్ చేస్తున్నామని ఓ లేడీ డాక్టర్ తెలిపారు. రోగులకు అవసరమైన కౌన్సెలింగ్ అందిస్తున్నామని ఆమె తెలిపారు. అధిక శాతం రోగులు అర్ధరాత్రి నుంచి తెల్లవారుజాము ప్రాంతంలో ఆసుపత్రికి వస్తున్నారనీ, ఆ సమయంలోనే వారు తీవ్ర ఆందోళనకు గురవుతున్నారనీ వైద్యులు తెలిపారు. ఆగస్టు 5 నుంచి ఆసుపత్రికి వస్తున్న వేలాది మంది పేషెంట్ల ఒత్తిడి, ఆందోళనకు మూలం ప్రస్తుతం కశ్మీర్‌లో నెలకొన్న పరిస్థితులేననీ, దానికి రాజ్యమే కారణమనీ వైద్యులు అంటున్నారు. అందుకు వాళ్లని కూడా జైళ్లలో కుక్కుతున్నారు.

షోపియాన్, కుప్వారా, బారాముల్లా, ఖాజిగుడ తదితర సుదూర ప్రాంతాల నుంచి ప్రజలు వస్తున్నారని, వారిలో తెలియని ఆందోళన కనిపిస్తోందని రిజిస్ట్రేషన్ విభాగంలో పనిచేసే ఎండీ రయీస్ తెలిపారు. అక్కడ రోజువారి దినచర్య పూర్తిగా మారిపోయిందని, ఈ వాతావరణం పిల్లలపై తీవ్ర ప్రభావం చూపుతోందని డాక్టర్ హుస్సేన్ అంటున్నారు. పిల్లలకు ఆటపాటలు మాత్రమే కాదు... మాటలు కూడా కరువయ్యాయనీ, కనీసం ఫోన్‌లో కూడా ఎవరితో మాట్లాడలేని స్థితి నెలకొన్నదనీ, ఇది పిల్లల మానసిక స్థితిపై తీవ్ర ప్రభావం చూపుతుందనీ అంటున్నారు. పిల్లల్లో ఇది నెగెటివ్ మనస్తత్వానికి కారణమవుతుందని వైద్యులు అంటున్నారు.

## కశ్మీరీ మహిళల పై విరుచుకుపడిన హిందుత్వం, పితృస్వామ్యం

జమ్మూకశ్మీర్లో ఆర్టికల్ 370, ఆర్టికల్ 35ఏ రద్దుతోపాటు ఆ రాష్ట్రాన్ని రెండు కేంద్ర పాలిత ప్రాంతాలుగా విభజిస్తూ కేంద్రప్రభుత్వం తీసుకున్న నిర్ణయంతో చాలామంది అక్కడ భూములు కొనుగోలు చేయవచ్చని సంబరపడితుంటే, మరి కొంత మంది సామాజిక మాధ్యమాల్లో, ఇతరత్రా తాము తెల్లగా ఉండే కశ్మీరీ అమ్మాయిలను ఇక వివాహం చేసుకోవచ్చంటూ మురిపెం వ్యక్తం చేస్తున్నారు. అధికారం వెలగబెడుతున్న రాజకీయ నాయకులు కూడా ఇదే తరహా ప్రతిపాదనలు చేయడం దారుణమైన విషయం. ఉత్తర్‌ప్రదేశ్‌కు చెందిన బీజేపీ శాసనసభ్యుడు విక్రమ్ సైనీ తన కార్యకర్తలకు తెల్లగా ఉండే కశ్మీరీ మహిళలను వివాహం చేసుకోండని ఉచిత సలహా కూడా ఇచ్చారు. హర్యానా ముఖ్యమంత్రి మనోహర్ లాల్ ఖత్తర్ కూడా తన వంతుగా ఇటువంటి వ్యాఖ్యలనే చేశారు. కశ్మీరీ యువతులను ఇపుడు కోడళ్లుగా తెచ్చుకోవచ్చంటూ మాటాడారు. పురుష దురహంకారంతో కూడిన ఇటువంటి పరుష వ్యాఖ్యలను ఖండించకుండా అధికారంలో ఉన్నవారే అలాంటి వ్యాఖ్యలనూ, ఆలోచనలనూ ప్రేరేపిస్తున్నారన్నది దేశభక్తి పొంగి పొర్లుతున్న జాతీయవాదులకి పట్టని విషయం.

స్త్రీ ద్వేషం, జాత్యహంకారం, వివక్ష అనేవి హిందుత్వవాదుల్లో గాఢంగా ఉన్నాయి. వీరు కశ్మీరీలు మనోవేదనకు గురి కావడంతో పైశాచిక ఆనందం పొందుతున్నారు. పురుషాధిక్య భావనలు కేవలం తీవ్రమైన లైంగికేచ్ఛవెల్లడించడం ద్వారానే కాదు, కశ్మీరీల పట్ల పెత్తనం, అధికారం ప్రదర్శించడం, వారి మదిలో భయాన్ని కలిగించడంలోనూ ప్రదర్శితమౌతున్నాయి. 'కాశ్మీరు మాదే' అనే ఉన్మాద నినాదాలు చేస్తూ, కశ్మీరీ మహిళలను వివాహం చేసుకోవాలనే కుట్రపూరిత వ్యాఖ్యలను బట్టి జాతీయవాదులుగా తమను తాము చెప్పుకునే వారు మహిళలను ఎలా వస్తువులుగా పరిగణిస్తారో, ఎట్లా విలువ గడతారో, వారిని ఆక్రమించవలసిన వారిగా చూస్తారో తేటతెల్లం అవుతుంది. కశ్మీరీ మహిళలను బలవంతంగా మెజార్టీ వ్యవస్థ ద్వారా చేజిక్కుంచుకోవచ్చన్న తాపత్రయం కనిపిస్తోంది. మహిళలను వస్తువులుగా పరిగణించడం పూర్తి తిరోగమన భావజాలం. చివరికి మహిళలను అసలు మనుషులుగానే గుర్తించలేని పరిస్థితికి అది దారి తీస్తుంది. పురుష జాతీయవాదులు మహిళలను ఫక్తు గర్భాశయాలుగానే పరికిస్తారు. అందుకే తమ మగతనం వారి గర్భాశయంపై ప్రదర్శించుకోవాలని ఉబలాటపడుతున్నారు. మహిళలు పునరుత్పత్తి చేయడానికి మాత్రమే పనికివస్తారని వారి ఊహ. అందుకే ఇతర జాతికి చెందిన గర్భాశయం ద్వారా ఆ జాతిని సంకరపరచవచ్చని ఉత్సాహ పడుతున్నారు.

'అతి జాతీయ వాదులు ఎపుడూ కశ్మీరులో ముస్లింలు మెజార్టీగా ఉండటాన్ని సహించలేకపోయారు. కశ్మీరీ మహిళలను పెళ్లాడవచ్చంటూ వారు పెడుతున్న ఊళలు, జాతి నిర్మూలన ఉద్దేశాలను నెరవేర్చుకోవడానికి చేస్తున్న దాడిగానే చూడాలి. రెండు జాతుల మధ్య వివాహం అనేది ఇక్కడ సమస్య కాదు. కానీ ఆ వివాహాన్ని మరో జాతి నిర్మూలనకు సాధనంగా చూడటమే ఆందోళన కలిగించే విషయం. ఇవన్నీ నికార్సయిన పితృస్వామ్య భావనలు' అన్నారు అయేషా అలీ సబ్బారీ ( కార్వాన్ పత్రిక )

పితృస్వామ్య వ్యవస్థలో మహిళలను కుటుంబ విలువల, సంప్రదాయాల, గౌరవ ప్రతిష్ఠల ప్రతీకలుగా పరిగణిస్తారు. ఆ ధోరణితో సంకుచితంగా ఆలోచించే ఉన్మత్త జాతీయవాదులు కశ్మీరీ మహిళలను పెళ్లాడి వారి కుటుంబాలకి అమర్యాదనూ, అగౌరవాన్నీ చేకూర్చాలని ప్రదర్శించే తపన ప్రస్ఫుటమౌతోంది. కశ్మీరీ పురుషుల మెడలు వంచాలన్న హిందుత్వవాదుల ఉద్దేశపూర్వక ప్రయత్నంలోనే వారు మహిళల ఉనికిని వారికి పురుషులతో ఉన్న సంబంధంతో

గుర్తిస్తారన్న విషయం గోచరమౌతుంది. ఒక మహిళ ఒక పురుషుడికి సోదరిగానో, తల్లిగానో, కూతురిగానో మాత్రమే ఉండగలదు. కానీ పురుషులతో సంబంధం లేకుండా తనకు తానుగా అస్తిత్వంకల మనిషి కాజాలదు అనుకునేవాళ్లకి, పురుషుల మెదలు వంచాలంటే వారికి సంబంధించిన మహిళలను దోపిడీ చేయాలన్న ధోరణే ఉంటుంది- అంటారు జర్నలిస్ట్ అయేషా అలీ సబ్వారీ.

## కశ్మీరీ స్త్రీల వేదన - నిరంతర పోరాటం

కశ్మీరీ స్త్రీలని స్థిరత్వం, భద్రత అనుభవిస్తున్న సమాజాల్లోని పితృస్వామ్య కుటుంబాల్లోని స్త్రీలుగా ఊహించుకోవటం వల్లే తక్కిన భారతం వీరిపై సంకుచిత ఊహాగానాలకు పాల్పడుతోంది. ఇది ముస్లిం స్త్రీలకి కేవలం మూడు తలాక్‌లు మాత్రమే సమస్య అయినట్లు మాట్లాడటం వంటిదే. ముస్లింలని నియంత్రించో, కొట్టో, బాధపెట్టో మాత్రమే జాతీయవాదులుగా తమని తాము నిరూపించుకోగలమన్న భావన ప్రబలి అనుక్షణం భయంభయంగా, అంతులేని ఆవేదనతో బతుకులీడుస్తున్న వీరికి మూడు తలాక్‌ల ఆచారాన్ని నేరమయం చేస్తే ఒరిగేదేమిటి? ప్రతి పదిమంది కశ్మీరీల్లో ఒకరు రాజ్యహింసకి గురవుతుంటే, కళ్ల ముందు చెప్పలేనంత హింసకి బంధువులూ, కుటుంబ సభ్యులూ గురవుతుంటే, తమ సమాజం అస్తిత్వమే కోల్పోతుంటే, స్త్రీలుగా తాము హక్కులు పొందుతున్నామని వారు ఆనందిస్తారా? అలా వారు భావించాలని మనమందరం అనుకోవటం అవివేకం, అజ్ఞానాలకి సూచిక మాత్రమే కాదు, బ్రిటిష వలస భావజాల అవశేషాల్ని మనం ఇంకా వదులుకోలేదనటానికి నిదర్శనమంటారు అన్వేషి సంస్థకు చెందిన డా. ఎ. సునీత.

మనదేశంలోని అన్ని సమాజాల్లో ఉన్నట్లే కశ్మీరీ సమాజంలో కూడా పితృస్వామ్యం వుంది. అమ్మాయిల కంటే అబ్బాయిలదే అన్ని విషయాల్లో పైచేయి. అయితే, వివాహ విషయంలో మాత్రం అమ్మాయిల అనుమతి తప్పనిసరిగా తీసుకుంటారు. అయితే, పోలిక ఇంతకుమించి చెయ్యలేం. జమ్మూకశ్మీర్ 1940ల నుండి తీవ్రహింస, ఒడిదుడుకులు, ప్రభుత్వ అస్థిరత, నిరంతర ఘర్షణలు ఎదుర్కొంటున్న సరిహద్దు రాష్ట్ర సమాజం. ఇతర సరిహద్దు ఈశాన్య రాష్ట్రాల్లో లాగే ఇక్కడ కూడా అనేక సార్లు ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాలని బర్తరఫ్ చెయ్యటం, గవర్నర్ పాలన పెట్టటం లేదా తూతూ మంత్రంగా ఎన్నికలు జరపడం వల్ల శాంతి, స్థిరత్వం ఎప్పుడూ లేవు. దానితో అక్కడి స్త్రీలు తమ హక్కుల కోసం ఎప్పుడూ పోరాడే అవకాశమే పొందలేకపోయారు.

కశ్మీరీ స్త్రీల ప్రయాణం భిన్నంగా సాగింది. 1947లో పాకిస్థానీ సైన్యాన్ని ఎదుర్కోవడం దగ్గరి నుండి వేర్పాటువాదంతో భారతరాజ్యాన్ని వ్యతిరేకించటం వరకు- స్త్రీలు పురుషులతో సమానమైన పాత్రే పోషించారు. తీవ్ర హింస కూడా అనుభవించారు. రాజా హరిసింగ్ సైన్యాలు జమ్మూలో ముస్లిములను ఊచకోత కోసినప్పుడు అత్యాచారాలకి గురై హత్యలకు

> "స్త్రీల అసమాన హోదాని ఒక ప్రాంతాన్నో, సమూహాన్నో, దేశాన్నో ఆక్రమించుకోవటానికి, వారిపై యుద్ధం ప్రకటించటానికి సాకుగా వాడుకోవటం, తమ సంస్కరణల వల్లే అక్కడి స్త్రీలు విముక్తి పొందారని వాదించటం చరిత్రలో కొత్త కాదు. భారతదేశంలో భర్తలని కోల్పోయిన స్త్రీలని సతి పేరుతో కాలుస్తారనీ, ఆడ పిల్లల్ని పుట్టగానే చంపేస్తారనీ, కాబట్టి భారతదేశానికి సభ్యతా, సంస్కృతీ నేర్పాలంటే తాము పాలించక తప్పదని బ్రిటీషువారు వాదించారు. 2001లో ఆఫ్ఘనిస్థాన్‌పై దాడి చేసిన అమెరికా అక్కడి స్త్రీలని తాలిబన్ల నుండి రక్షించటానికి యుద్ధం చేస్తున్నట్టు బుకాయించింది."

గురైనవాళ్లల్లో స్త్రీలు అనేకం. 1990ల నుండి భద్రతా దళాల చేతుల్లో వాళ్లు అనుభవించిన తీవ్ర లైంగిక హింసని మానవ హక్కుల సంఘాలు నమోదు చేస్తూనే వున్నాయి. వాటిల్లో, 2017లో సుప్రీంకోర్టు గుర్తించినా, భారత ప్రభుత్వం ఇప్పటికీ ఒప్పుకోని కునాన్, పుష్పోరా ఘటన ఒకటి. 1991లో మిలిటెన్సీ ఎక్కువున్న ఈ రెండు గ్రామాల్లో భద్రతాదళాలు వయసుతో నిమిత్తం లేకుండా ప్రతి అమ్మాయినీ, స్త్రీనీ లైంగిక హింసకి గురి చేశాయి. వారిని ఇంటర్వ్యూలు చేసిన ముగ్గురు కశ్మీరీ యువతులు 2016లో 'మీకు కునాన్ పుష్పోరా గుర్తుందా?' అనే పుస్తకాన్ని రాశారు. భారతదేశ లైంగిక హింసా చట్టాల్లో భద్రతా దళాలు చేసే అత్యాచారాలు చేర్చాలన్న డిమాండు, ఈశాన్య రాష్ట్ర మహిళలతో పాటు, కశ్మీరీ స్త్రీల వేదన నుండే వస్తోంది.

దేశంలో సుస్థిర ప్రభుత్వాలు, శాంతి వున్న రాష్ట్రాల్లోని ప్రజలు అర్థం చేసుకోలేని ఆవేదన కశ్మీరీ మహిళలది. 1990ల నుండి 70,000 మంది స్త్రీలు కొడుకులనూ, భర్తలనూ, సోదరులనూ, కూతుళ్లనూ, తల్లులనూ కోల్పోయారు. మరో 10,000 మందికి పైగా కుటుంబ సభ్యులు మాయమయ్యారు. అలా మాయమైన భర్తల తాలూకు అర్థ విధవలు ఎంతమందో! రాజ్యం చేతుల్లో హింసకి గురై బతికి బట్టకట్టినప్పటికీ శారీరక, మానసిక వికలాంగులుగా మిగిలిపోయిన వాళ్ళు మరింతమంది. 2014 తరవాత కేంద్రప్రభుత్వ పెల్లెట్ గన్ను ప్రయోగం వల్ల కళ్లు పోయి వికలాంగులుగా మిగిలిపోయిన పిల్లల్నీ, పెద్దవాళ్లనీ చూసుకునేదెవరు? మహిళలే కదా? ప్రతి రోజూ, దైనందిన కార్యక్రమాలకి, - పొలాల్లో పనిచేయటానికే కాదు వంట సరుకులు కొనుక్కోవటానికి కూడా ప్రతి పది గజాలకి ఒక భద్రతా దళ జవానుతో చెక్ చేయించుకోవాల్సిన పరిస్థితి వారిది. అర్ధరాత్రి, అపరాత్రి ఎప్పుడంటే అప్పుడు ఇళ్లలో చెక్ చేస్తుంటే నిద్ర లేకుండా, ఎప్పుడు ఇళ్లల్లోని మగవాళ్లు మాయమవుతారో, ఎప్పుడు చనిపోతారో తెలియని అగమ్యగోచర స్థితి వారిది. మాయమైపోయిన భర్తల కోసం భార్యలూ, కొడుకుల కోసం తల్లులూ సంఘాలు పెట్టుకుని, తమ వారి భౌతిక కాయాన్ని ఎక్కడ పడేశారో అదైనా చెప్పండి, అంత్యక్రియలు చేస్తాం అని ఆవేదనతో అడుగుతున్నారు. కశ్మీరీ స్త్రీలు అనుభవిస్తున్న ఈ బాధలు, వేదనలు, ఎదుర్కొంటున్న పరిస్థితులు ఏవీ అక్కడి పితృస్వామ్య సమాజం కల్పించినవి కావు. రాజకీయ పరిస్థితుల వల్ల వచ్చినవే. కుటుంబం, జీవితం

ఛిన్నాభిన్నమవుతుంటే వివాహ హక్కుల గురించీ, స్వేచ్ఛ గురించీ, సమానత్వం గురించీ, వచ్చే పోయే ఆస్తి గురించీ ఆలోచించే తీరికా, ఓపికా ఆ స్త్రీలకుంటాయా?

స్త్రీల అసమాన హోదాని ఒక ప్రాంతాన్నో, సమూహాన్నో, దేశాన్నో ఆక్రమించుకోవటానికి, వారిపై యుద్ధం ప్రకటించటానికి సాకుగా వాడుకోవటం, తమ సంస్కరణల వల్లే అక్కడి స్త్రీలు విముక్తి పొందారని వాదించటం చరిత్రలో కొత్త కాదు. భారతదేశంలో భర్తలని కోల్పోయిన స్త్రీలని సతి పేరుతో కాలుస్తారనీ, ఆడ పిల్లల్ని పుట్టగానే చంపేస్తారనీ, కాబట్టి భారతదేశానికి సభ్యతా, సంస్కృతీ నేర్పాలంటే తాము పాలించక తప్పదని బ్రిటిషువారు వాదించారు. 2001లో ఆఫ్ఘనిస్థాన్‌పై దాడి చేసిన అమెరికా అక్కడి స్త్రీలని తాలిబన్ల నుండి రక్షించటానికి యుద్ధం చేస్తున్నట్టు బుకాయించింది. మన దేశంలో 1980ల నుండి ముస్లిం స్త్రీలు తీవ్ర పితృస్వామ్య అణచివేతలో వున్నారని, వారిని 'విముక్తి' చేసే చట్టాలు చెయ్యటానికి బలమయిన జాతీయవాద ప్రభుత్వం అవసరమనే భావన బలంగా వేళ్లూనుకుంది. దానిలో భాగంగా ముస్లిములకుండే 'ప్రత్యేక చట్టాలని' తీసెయ్యాలనే ప్రచారం జరిగింది. 370 అధికరణ సవరించి పితృస్వామ్యం నుండి కశ్మీరీ స్త్రీలని విముక్తి చేసామన్న భావన కూడా ఈ కోవలోదే అంటారు సునీత.

## భారత్, పాకిస్థాన్ రెండు దేశాలల మధ్య నలిగిపోతున్న కశ్మీరీలు

ఇటు భారత్, అటు పాకిస్థాన్... రెండు దేశాలలో మెజార్టీ మతస్థుల ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాల నడుమ కశ్మీరీ ప్రజల ఆక్రందనలు వినేవారు లేకుండాపోయారు. రెండు దేశాలూ 'అసలు కశ్మీరు మాదే' అంటూ విర్రవీగుతుంటాయి కానీ ప్రజల గురించి వారు పట్టించుకోరు. వారి అత్యుత్సాహం, దురాక్రమణవాదం నడుమ కశ్మీరీ ప్రజల వెతలు మరుగున పడిపోతుంటాయి. వాస్తవాలు చీకటిలో మగ్గిపోతుంటాయి. ఈ దేశాలలో తమ మానవ హక్కుల కోసం, ప్రజాస్వామ్యం కోసం జరుగుతున్న పోరే ఆ వాస్తవం. రెండు ఉన్మత్త గజాల మధ్య పోరులా మిగిలిన కశ్మీరు భారత్ -పాకిస్థాన్‌ల మధ్య భూభాగ వివాదం మాత్రమే కాదు. రక్తమాంసాలు, హృదయ స్పందనలూ ఉన్న కశ్మీరు ప్రజల ఆంకాక్ష కూడా. వారికి సంబంధించిన అన్ని నిర్ణయాలూ వారిని సంప్రదించి తీసుకోవాలి. పాకిస్థాన్ ఇండియా ఫోరమ్ ఫర్ పీస్ దశాబ్దాలుగా ఇదే విషయాన్ని చెబుతోంది.

పండిట్ జవహర్ లాల్ నెహ్రూ భారత్ ఆలోచనలను కశ్మీరు మీద రుద్దడానికి ముందు ఇష్టపడలేదు. అయితే ఆ ధోరణి 1950 తరువాత మారింది. అప్పటి నుంచి కశ్మీరు భారత అంతరాగమనే ధోరణి స్థిరపడిపోయింది. పాకిస్థానీయులకు కూడా అణచివేత వెతలు బాగా తెలుసు. కానీ పాకిస్థాన్ కశ్మీరుపై చూపే దౌర్జన్య భావనలు కూడా కశ్మీరు మాదేనన్న తత్వం నుంచి వచ్చినవే. కశ్మీరీలు తమ సహ ముస్లింలు కనుక కశ్మీరు విభజన ప్రకియలో అసంపూర్తి ఘట్టంగా వారు భావిస్తారు. పాకిస్థాన్‌లో తెగల మధ్య జరిగే హింస, అక్కడ అమల్లో ఉన్న సెన్సార్ షిప్, రాజకీయ పెత్తందారీతనం, మానవ హక్కుల ఉల్లంఘనను పరిగణనలోకి తీసుకుంటే పాక్ కశ్మీరు మీద వ్యక్తం చేసే ఆందోళన గురివింద గుంజ సామెతలానే ఉంటుంది.

## పత్రికా స్వేచ్ఛను మింగేస్తున్న మీడియా సెన్సార్‌షిప్

మీడియా మీద కూడా ఎంతో ప్రతిబంధకాలు ఉన్నాయి. జర్నలిస్టులకు పని చేయలేని పరిస్థితి. ఇంటర్నెట్ పని చేస్తున్నచోట కూడా అది ఎంతో నెమ్మదిగా ఉంది. 'ప్రత్యక్షంగా పత్రికల మీద ఆంక్షలు లేకపోయినప్పటికీ, అన్నిరకాల ప్రసార ప్రచార సాధనాలను నిలిపివేయడం ఒకరకంగా సెన్సార్ షిప్ వంటిదే. 'ఇందువల్ల కాశ్మీరీలు ప్రస్తుత పరిణామాల గురించి ఏమనుకుంటున్నారనేది మిగతా ప్రపంచానికి తెలిసే అవకాశమే లేకుండా పోయింది' అని జర్నలిస్టు కల్పనాశర్మ తన బ్లాగ్‌లో రాశారు. ప్రస్తుత పరిస్థితి 1975లో అత్యవసర పరిస్థితిని తలపిస్తోందని ఆమె అంటారు.

విచిత్రమేమంటే మసూడి ఢిల్లీ వదిలి కశ్మీరు వెళ్లే ముందు రాసిన చివరి రిపోర్టు 1975 నాటి అత్యవసర పరిస్థితి గురించే. ఆమె ఇంటర్వ్యూ చేసినవారు ఆ కాలం నాటి ఒక దిగులు గొలిపే నిశ్శబ్దం గురించి మాటాడారు. ఆగస్టు 4వతేదీన కశ్మీరులో కర్ఫ్యూ విధించాక ఆమె అదే అనుభవాన్ని ఎదుర్కొన్నారు. అనేకమంది రాజకీయ నాయకులు, కార్యకర్తలను ముందస్తు నిర్బంధంలోకి తీసుకున్నారు, మరికొందరిని హౌస్ అరెస్టు చేశారు. కొందరిని జైల్లో ఉంచారు. నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్య సేన్ చెప్పినట్లు 200 సంవత్సరాలు పాలించిన బ్రిటిషు రాజ్యం నాటి పరిస్థితులను తలపించారు. దేశ విభజనకు ముందు నాటి డోగ్రా చట్టాల అమలులో ఉన్న కశ్మీరులో బయటివారు భూమిని కొనడానికి లేదు. కశ్మీరేతరులను వివాహం చేసుకున్న మహిళల పిల్లలకు కూడా ఆ హక్కు లేదు. దీనిపై ఇపుడు పెట్టుబడిదారులు కన్నేశారు. ఇటువంటి పరిమితులు నాగాలాండ్, హిమాచల్ ప్రదేశ్, అరుణాచల్ ప్రదేశ్, అండమాన్ నికోబార్లో కూడా అమలులో ఉన్నాయి.

## కశ్మీర్‌లో ప్రజలు జీవించాలనీ, తమ ఉనికిని చాటుకోవాలని కోరుకుంటున్నారు.

బీజేపీ ప్రభుత్వం ఏకపక్షంగా కశ్మీరు స్వయంప్రతిపత్తిని తీసివేయడం మానని పుండు లాంటి గాయం లాంటిదని చాలామంది భావించారు. కదలలేని పరిస్థితిలో ఉన్నపుడు చాకుతో నిదానంగా చర్మాన్ని ఒలుస్తుంటే కలిగే నొప్పి లాంటిది. నొప్పికి అరవలేము, చర్మం ఒలవడాన్ని నిలువరించలేము. అనేక రోజుల మానసిక ఘర్షణ , వేదన అనంతరం కశ్మీరీలకు తమను ఎందుకు సన్నద్ధంగా చేశారో అర్థమైంది. 'చివరకు ఇదంతా జరిగింది భూమి కోసం, వనరుల కోసమే' అని పరిశోధకురాలు మసూడి అంటారు.

ఢిల్లీకి చెందిన హక్కుల సంస్థ అన్హద్ కశ్మీరీల మానసిక వేదనకు సాంత్వన కలిగించడానికి వారి అనుభవాలను ఢిల్లీలోని కశ్మీరీ విద్యార్థులకు చేరవేస్తోంది. యాక్టివిస్టులు, మేధావులకు కూడా ఈ అనుభవాలు చేరుతున్నాయి. ఆగస్టు 18వ తేదీన అందుకోసం

జరిగిన తొలి సమావేశం కన్నీటి చుక్కల సంద్రంలోలా మూడు గంటలు నడించింది.

## కశ్మీరు అస్తిత్వ సమస్య

జమ్ము కశ్మీరు ప్రజలంటే కేవలం ముస్లింలు కాదు, అన్ని మతాలకు చెందిన వారూ. పాకిస్థాన్ ఎపుడూ కశ్మీరీలంటే ముస్లింలు మాత్రమే కాదు, అందరూ అన్న అవగాహనతో వ్యవహరించలేదు. ముస్లింలు అధికంగా ఉండే లోయతో పాటు బౌద్ధులు అధికంగా ఉండే లధక్ ప్రాంతాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా చేయడానికి అక్కడ ప్రజలు ఎంతో హర్షిస్తున్నట్లుగా పాలకులు చెబుతున్నారు. సిక్కులు, హిందువులు, డోగ్రాలు ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నారు. కాశ్మీరియత్ అంటే ఎంతో సెక్యులర్ భావాలతో ఇతర మతస్తులతో మెలగడం, వారు సూఫీ తత్వాన్ని పాటిస్తారు. గురి పెట్టి జరిగిన కొన్ని హత్యల తరువాత 1990లో బలవంతంగా కశ్మీరీ పండిట్లను అక్కడ నుంచి బలవంతంగా పంపేయడంతో ఆ పరిస్థితి మారిపోయిందని న్యూయార్కులో నివాసముంటున్న కవి రఫిక్ కత్వారి అంటారు. ఆచూకీ లేకుండా పోయి, హతులైపోయిన లక్షలాది మంది కశ్మీరీ ముస్లింలతో పోలిస్తే కశ్మీరీ పండిట్ల వెతలు తక్కువైనా కూడా వారి వేదన కూడా యదార్థమని వారంటారు.

ప్రముఖ గాంధీయన్ థియేటర్ డైరెక్టర్ ఎంకె రైనా మాటల్లో... అనేక మంది పండిట్లు కశ్మీరు నుంచి వచ్చేశారు. తన తల్లి చనిపోయిన తరువాత రైనాకు తల్లి అంత్యక్రియలు చేయడం కూడా కష్టమైపోయింది. ఆయన తన తండ్రి, సోదరుడితో కలసి శ్రీనగర్ వదిలేశారు. తన కశ్మీరీ పండిట్ అస్తిత్వాన్ని వదులుకోవడం ఇష్టం లేని ఆయన తన మానవతను చాటుకుంటూ అన్ని మతాలకూ చెందిన యువతతో కలిసి పని చేస్తుంటారు. తన కళ, నాటకం ద్వారా వారి బాధలకు సాంత్వన చేకూర్చడానికి ప్రయత్నిస్తుంటారు. ఆయన కూడా

పాకిస్థాన్‌కు కశ్మీరు అస్తిత్వ సమస్య. ఎందుకంటే అక్కడి అన్ని నదులూ ఇండియాలోని కశ్మీరు నుంచి పుట్టి ప్రవహిస్తుంటాయి. భారత్ ఈ విషయాన్ని అర్థం చేసుకోవాలి. కానీ చేసుకోదని, దక్షిణ ఆఫ్రికాకు చెందిన నీటి వనరుల నిపుణుడు, హార్వర్డ్ ప్రొఫెసర్ బ్రిస్కో రాశారు. ఆయన ఈ సమస్యలకు కొన్ని పరిష్కార మార్గాలు చూపారు. ఆయన సూచనలు భారత్, పాకిస్థాన్‌లు తమ అభిజాత్యాన్ని తగ్గించుకోవాలని స్పష్టంగా చెబుతాయి, కానీ రెండు దేశాలూ ఎప్పుడూ అలా చేయలేదు.

ప్రస్తుత పరిస్థితి కేవలం అణ్వస్త్ర సామర్థ్యం ఉన్న భారత్, పాకిస్థాన్‌లకు మాత్రమే సమస్య కాదు. ప్రపంచానికే సమస్య అని బోస్టన్ యూనివర్సిటీ అధ్యాపకుడు అదిల్ నిజాం అంటారు. అమెరికా అధ్యక్షుడు కూడా నరేంద్ర మోడీనీ, ఇమ్రాన్ ఖాన్‌నూ ఒక తాటి పైకి రావాలంటూ చెప్పి ఈ సమస్యను హిందూ ముస్లిం సమస్యగా భావిస్తున్నారు. అది అస్సలు సరైన వ్యవహార సరళి కాదు. ఇది హిందూ ముస్లిం సమస్య ఎంత మాత్రం కాదు కాశ్మీరీ ప్రజల, వారి కాశ్మీరియత్ సమస్య. ప్రబలంగా వ్యాప్తిలో ఉన్న, చలామణీ అవుతున్న వాదాలన్నీ బలాన్ని ప్రయోగిస్తే కానీ అక్కడ సమస్య పరిష్కారం కాదని చెబుతుంటాయి. కానీ హింస ప్రతీకారాత్మకమైనది. మానవులుగా మనకు ప్రత్యామ్నాయాలు కనుగొనే సామర్థ్యం, వివేచన ఉన్నాయని ఆయన అంటారు. అందుకే సమస్యను కశ్మీరీ ప్రజల కేంద్రంగా చూసి వాటి పరిష్కారం కూడా వారి కోసమే జరిగేలా చూడటం ఉత్తమ మార్గమని ఆయన అంటారు. మొత్తం కశ్మీరు సమస్య, కశ్మీరీ ప్రజల వెతల గురించి బీనా సర్వార్ రాస్తూ... మెజార్టీ అతి వాదుల నినాదాల నడుమ వారి ఆక్రందనలు వినేవారు లేకుండాపోయారని తీవ్రంగా ధ్వజమెత్తారు. భారత్, పాకిస్థాన్‌లు తమ వైపు నుంచి తప్పు జరిగిందని ఎపుడూ ఒప్పుకోలేదు. కశ్మీరులో సంఘ విద్రోహ చర్యల గురించి విమర్శించేవారు, మానవ హక్కుల ఉల్లంఘన, సైన్యం, పారా మిలటరీ దళాల అరాచకాల విషయంలో మౌనం వహిస్తున్నారు. కశ్మీరుకూ, మిగతా భారతదేశానికీ మధ్య పెరిగిపోతున్న అంతరాన్ని గుర్తించడం లేదని ఆమె అన్నారు.

కార్గిల్ యుద్ధం తరువాత మహిళల శాంతి బస్సు యాత్రలో పాకిస్థాన్ వెళ్లిన బర్ఖాదత్ అధ్యక్షుడు ముషారఫ్‌ను కార్గిల్ యుద్ధం తప్పేనా అడిగినపుడు అయన తప్పే అని అందరినీ ఆశ్యర్యపరిచారు. కానీ వెంటనే నవ్వుతూ తప్పు అని నేనెపుడూ చెప్పను అన్నారు. ఆ తరువాత ఆయన సమస్య పరిష్కారానికి చాలా దగ్గరగా వచ్చారు. ముషరఫ్, వాజపేయి కలిసి ప్రతిపాదించిన నాలుగు పాయింట్ల సూత్రం ఆ తరువాత అనేక కారణాల వల్ల మరుగున పడిపోయింది. న్యూయార్క్, బోస్టన్, లండన్ వంటిచోట్ల ప్రదర్శనల్లో కశ్మీరీలు పాకిస్థానీ జెండాలను ఎగరవేయడం వల్ల సమస్య పరిష్కారం కాదు. దాని వల్ల కశ్మీరు వారు విశ్వాస ఘాతకులు అనే భారత్‌లో ఉన్న నానుడి మరింత బలపడుతుంది. కశ్మీరీల పోరాటం వెనక పాకిస్థాన్ పొంచి ఉందనే అభిప్రాయం కలిగించడానికి సాయపడుతుంది. కశ్మీరీలకు స్వంత గళం లేకుండా అయిపోతుందని బీనా సర్వర్ అభిప్రాయపడ్డారు.

## కశ్మీరీ ప్రజలే తేల్చుకోవాలి

కశ్మీరులో బీజేపీ ప్రభుత్వ చర్యలను వ్యతిరేకించే భారతీయులు పాకిస్థాన్ జోక్యాన్ని కూడా సహించరు. కశ్మీరీ సంఘీభావ ప్రదర్శనలు ప్రపంచవ్యాప్తంగా, భారత్‌లోనూ జరుగుతున్నాయి. కశ్మీరులో జరగుతున్న దాన్ని వ్యతిరేకిస్తూ, కశ్మీరు భారత్‌లో అంతర్భాగం అని కొందరు అంటారు. పాకిస్థాన్‌లో మానవ హక్కుల ఉల్లంఘన జరుగుతోందంటూ భారతీయులు రోడెక్కితే తమకు ఎంత చికాకు కలుగుతుందో పాకిస్థానీయులు అర్థం చేసుకోవాలి. అనేక మంది పాకిస్థానీయులు భారత ప్రభుత్వ చర్యలను నిరసించారు. ఉదాహరణకు 150 మంది హార్వర్డ్ విద్యార్థులు, మరి కొందరు నేపాల్ కార్యకర్తలు తమ నిరసన వ్యక్త చేశారు. కశ్మీరు సమస్యను కశ్మీరీ ప్రజలే తేల్చుకోవాలి. ఇరు వైపుల ఉన్న మానవ హక్కుల కార్యకర్తలు, సంఘాలు, సంస్థలు చేతులు కలిపి కశ్మీరు ప్రజలకి సంఘీభావం ప్రకటించాలి. నిజమైన శాంతిని సాధించాలి. ❁

కారాగారంలో కశ్మీర్

# తుపాకీ ఒకటే మాకున్న మార్గం

ప్రవీణ్ దోంతి

అనువాదం:ఎమ్ఎస్‌బిఎన్‌వి రమాసుందరి



రోడ్ల మీద ఇంకా బార్బ్‌డ్ వైర్ బారికేడ్లు, సాయుధ భద్రతా దళాల గస్తీ మొదలు కాక మునుపే ఒక రకమైన కర్ఫ్యూ వాతావరణం ఏర్పడింది. విమానం శ్రీనగర్ గడ్డని తాకడానికి పదిహేను నిమిషాల మునుపే 'డైరెక్టర్ జనరల్ సివిల్ ఏవియేషన్ నుంచి ఆదేశాలు అందాయి- 'ప్లీజ్ సర్, కిటికీలు మూసేయండి' అంటూ సున్నితంగా ప్రయాణీకుల్ని అభ్యర్థిస్తూ ఓ అనౌన్స్‌మెంట్ వచ్చింది. స్టాఫ్ అటూ ఇటూ తిరుగుతూ అన్ని కిటికీలూ బంద్ చేయిస్తున్నారు. ముందు అందరూ తేలిగ్గా తీసుకున్నారు. ఊరికే సరదాగా జోక్ చేస్తున్నారనుకున్నారు. నా పక్కన కూర్చున్న కశ్మీరీ ప్రయాణీకుడు నవ్వుతూ, 'ఇది 'నజర్‌బందీ' లెండి! అంటే హౌస్ అరెస్ట్!' అని వివరించాడు. 'ఏమిటీ, 'నజర్‌బందీ' నా!' అని నిర్ఘాంతంగా అరిచారు కొందరు. ఆ పదం వాళ్ల డిక్షనరీ పదజాలానికి ఆ క్షణంలోనే జోడించేసుకున్నారు. కొందరు ఆత్రంగా బయటికి చూడడానికి కిటికీల్ని సగం తెరిచి చూడబోయారు గానీ వెంటనే మూసేశారు. ఉదయం 7.30 గంటలైంది. ధూమ్ర వర్ణపు పొగమంచుతో ఆ గ్రీన్ వ్యాలీ అంతా కప్పబడింది. 'బహుశా వ్యాలీలోకి ఎన్ని భద్రతా దళాలను దింపారో మా కళ్ల పడడం వాళ్లకి ఇష్టం లేదులాగుంది' అన్నాడు ఒక వ్యక్తి. అతడు మర్నాడు, ఆగస్టు 12 న జరగబోయే ఈద్ కోసం ఇంటికి వస్తున్నాడు.

ఆ మాట విని కొందరు నవ్వడానికి ప్రయత్నించగా, మరికొందరు ఆత్రుతగా చూశారు. వాళ్లు తాము వెళ్లాల్సిన గమ్య స్థానాలకు ఎలా చేరుకోవాలో ఆలోచించు కోవడంలో మునిగిపోయారు. ఫ్లైట్ రన్‌వే మీద దిగగానే, అలవాటు కొద్దీ చాలా మంది ప్రయాణీకులు తమ సెల్‌ఫోన్‌లను ఆన్ చేసి, అవి పని చేస్తున్నాయో లేదో చూస్తున్నారు. కానీ వాస్తవం వాళ్లకి క్షణాల్లో గ్రహింపుకొచ్చింది. రాజ్యాంగంలో ఆర్టికల్ 370ను కేంద్ర ప్రభుత్వం ఎఫెక్టివ్‌గా రద్దు చేయడంతో ఆగస్టు 5 నుండి వ్యాలీలో కమ్యూనికేషన్ సేవలు లేకుండా పూర్తి లాక్‌డౌన్ అమలులో ఉంది. సామాను బెల్ట్ ప్రక్కనున్న టూరిస్ట్ డిపార్ట్‌మెంట్ కౌంటర్‌లో ఓ గ్రీన్ టిక్కర్ మీద 'భూతల స్వర్గానికి స్వాగతం' అనే సందేశం మెరుస్తూ కనబడింది.




ఢిల్లీకి చెందిన ఇతర జర్నలిస్టులతో కలిసి, 'కర్ఫ్యూ పాస్' తీసుకోవడానికి నేను కర్ఫ్యూ డివిజనల్ కమిషనర్ కార్యాలయానికి వెళ్లాను. ఈ పాస్ ఉంటే సిటీలో కొన్ని ప్రాంతాలలో ప్రయాణించడానికి వీలుంటుంది. టెక్నికల్‌గా ఇది '144 సీఆర్‌పీసీ పరిమితులకు మాత్రమే చెల్లుబాటు అయ్యే మూవ్‌మెంట్ పాస్'. ఇది కర్ఫ్యూ సమయంలో పనికిరాదు. డివిజనల్ కమీషనర్ కార్యాలయ భవనంపై భారత త్రివర్ణ పతాకం ప్రక్కన నాగలి, మూడు నిలువు చారలతో ఎర్ర కాశ్మీరీ జెండా ఎగురుతూ ఉంది. కార్యాలయ ప్రాంగణంలో వ్యాలీకి బయట ఉన్న తమ కుటుంబ సభ్యులకు కాల్ చేయడానికి ఎదురు చూస్తున్న జనం కోపంతో మండిపడుతున్నారు. కాల్స్ చేయలేకపోయిన కశ్మీరీలు ఈ అసందర్భ సంక్షోభానికి ఫిర్యాదులు చేస్తున్నారు.

సీరియల్ నంబర్ 32 వచ్చేసరికి మధ్యాహ్నమైంది. అప్పటికి ఇంకా 420మంది లైన్‌లో ఉన్నారు. ఢిల్లీ నుంచి వచ్చిన టెలివిజన్ జర్నలిస్టులు జనం కష్టాల్ని తగ్గించడానికి టెలిఫోన్ సౌకర్యం కల్పించేందుకు కొంత ఆశావహంగా ప్రయత్నిస్తున్నారు. ఎన్‌డీటీవీకి చెందిన నజీర్ మసూదీ కశ్మీర్‌లో అణచివేత పరిస్థితి కొనసాగుతున్నప్పటికీ అక్కడి పరిస్థితి సాధారణంగానే ఉందని రిపోర్టు చేస్తున్నందుకు ఒక వ్యక్తి అతని మీద అరుస్తున్నాడు. ఇంకా అక్కడున్న జనం కూడా అతనితో కలిసి మసూదీని చుట్టుముట్టబోతుంటే, మిగతా జర్నలిస్టులు ఆ ఉద్రిక్త పరిస్థితిని కంట్రోల్ చేశారు.

ఆరిఫ్ అనే 25 ఏళ్ల విద్యార్థి ఆ యువకుడు తన తమ్ముణ్ణి కాంటాక్ట్ చేయలేక పోవడం వల్ల దిగులు పడుతున్నాడు. కానీ వ్యాలీలో సాధారణ పరిస్థితి ఉందనే కథనాన్ని ప్రసారం చేస్తూ జనాన్ని పెడత్రోవ పట్టిస్తున్న భారతీయ మీడియా వ్యవహారానికి అతను అంతకంటే ఎక్కువ అప్‌సెట్ అవుతున్నాడు. 'ఆర్టికల్ 370ను రద్దు చేయడం విషయంలో భారతదేశం అంత పట్టుదలగా ఉంటే, వాళ్లు కనీసం ఒమర్, మెహబూబా వంటి నాయకులతో చర్చించి ఉండాల్సింది గదా. కశ్మీర్‌లో భారతదేశం అభిప్రాయాల్ని ప్రచారం చేసినవాళ్లు, వాటి కోసం పోరాడిన జమ్మూ కశ్మీర్ మాజీ ముఖ్యమంత్రులైన ఒమర్ అబ్దుల్లా, మెహబూబా ముఫ్తీలని కూడా

అరెస్టు చేశారు. ఈ రోజు కశ్మీర్ గురించి భారతదేశం చేస్తున్న ఆలోచనలు ఏ విధంగానూ ఈ ప్రాంత భద్రతకి మంచివి కావని స్పష్టమవుతోంది' అన్నాడు ఆరిఫ్.

'మాకు అధికారం ఉంది, మెజారిటీ ఉంది, మేం తల్చుకుంటే ఏదైనా చేయగలమ'ని భారతదేశం హెచ్చరిస్తున్నట్టుంది. అసలు మర్మం ఏమిటంటే, వాళ్ళు భారతదేశంలో ముస్లిం మెజారిటీ రాష్ట్రాన్ని సహించలేకపోతున్నారు! అందుకే వాళ్ళు రాష్ట్ర జనాభాలో ముస్లింల శాతాన్ని తగ్గించాలనుకుంటున్నారు. కానీ ఇది 1990 లలో మాదిరిగా రాష్ట్రంలో ఉగ్రవాదాన్ని ప్రోత్సహించడానికే దారితీస్తుంది. 'సద్ర్-ఎ-రియాసత్' తొలగిస్తే, కశ్మీర్ దాన్ని నిరసించాలి, దాన్ని వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలి. 1965 వరకు జమ్మూ కశ్మీర్ రాజ్యాంగం ప్రత్యేక ప్రధాన మంత్రి, 'సద్ర్-ఎ-రియాసత్' లేదా అధ్యక్షుడి హోదాల్ని అందించింది. ఆ తర్వాత రాజ్యాంగ సవరణ చేసి, ముఖ్యమంత్రి హోదాని అలాగే ఉంచి, అధ్యక్షుడికి బదులు గవర్నర్‌ని పెట్టారు. ఆనాటి తరం తిరుగుబాటు చేయనందుకు మేం ఇప్పటికీ విమర్శిస్తుంటాం. ఇది మా తరం. ఈసారి మేం తప్పక పోరాడతాం' అన్నాడతడు.

ఈద్‌కు ముందు అనుకోని రీతిగా ఇలాంటి ఆంక్షలు విధించినందుకు చాలామందికి ఆగ్రహంగా ఉంది. తమ మతపరమైన విధులను నిర్వర్తించకుండా అడ్డుకోవటానికి ఇదంతా హిందుత్వ ప్రాజెక్టు కింద ఉద్దేశపూర్వకంగానే జరిగిందని చాలామంది అభిప్రాయపడ్డారు. జమ్మూ హైవే, ఇతర ముఖ్యమైన ప్రాంతాలకి సంచార గొర్రెల కాపర్ల సమాజమైన బకర్వాల్స్‌కి తమ గొర్రెల మందతో వెళ్లడానికి అనుమతి ఇవ్వబడింది, కానీ ఆంక్షల కారణంగా ఈద్ అర్పణల కోసం జంతువుల్ని కొనుగోలు చేయడానికి దారిలేకుండా పోయింది. కర్ఫ్యూ పాస్ ఉన్న జర్నలిస్టుకి కూడా ముందుకు వెళ్లాలంటే బారియర్‌ల దగ్గర కాపలా ఉన్న భద్రతా దళాల మూడ్స్‌పై ఆధారపడి ఉంటుంది. వాళ్లలో కొంతమంది ధైర్యం చేసి ముందుకెళ్లగలిగితే అదృష్టవంతులు, కొన్నిసార్లు దెబ్బలు తినాల్సి కూడా వస్తుంది. సాధారణంగా ఈద్ సమయంలో సిటీలో వేర్వేరు చోట్ల ఉన్నప్పటికీ బంధువులంతా డబ్బుని పెద్ద మొత్తంలో ఒక చోట సమకూర్చుకుంటారు, మాంసం పంచుకుంటారు. కానీ కర్ఫ్యూ వల్ల ఈ సంప్రదాయానికి గండి పడింది. కొంతమంది ఎలాగో అలా 'కుర్బానీ' ప్రక్రియ పూర్తి చేసినా, ఆ ప్రాంతానికి దూరంగా నివసిస్తున్న తమ బంధువులకీ, స్నేహితులకీ ఆ మాంసాన్ని షేర్ చేయలేకపోతున్నారు.

సిటీ అంతా బారికేడ్లతో అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టబడింది. 'మేం ఇలాంటివి ఇంతకు ముందెప్పుడూ చూడలేదు' అని ఒక యూనివర్శిటీ ప్రొఫెసర్ అన్నారు. 'ఈ కర్ఫ్యూ చాలా సోఫిస్టికేటెడ్‌గా ఉంది. శ్రీనగర్ జనాల కోసం రోడ్‌మ్యాప్‌ని రీమ్యాప్ చేసి వాళ్లతో సైకలాజికల్ డ్రిల్ చేయిస్తున్నారు. 'సెక్యూరిటీ ఎనలిస్ట్ కమ్యూనిటీ గ్రేప్‌వైన్' ప్రకారం, ఈ వ్యూహాన్ని ఒక అమెరికన్ కన్సల్టెన్సీ గానీ లేదా ఇజ్రాయెల్ ఆర్మీ కాంట్రాక్టర్లు గానీ రూపొందించి ఉండాలి. శ్రీనగర్ గుప్కర్ రోడ్, చర్చ్ లేన్‌లో జాతీయ సాంకేతిక పరిశోధన సంస్థకి చెందిన అధికారుల బృందం పెద్ద ఎత్తున డ్రోన్లతో సహా భారీ నిఘా నెట్‌వర్క్‌ను ఏర్పాటు చేసింది.

పెద్ద ఎత్తున హింస జరుగుతుందని అందరూ అనుకున్నారు గానీ ఇప్పటి వరకూ అలా ఏం జరగలేదు. అయితే ఈ కర్ఫ్యూలో భాగంగా దాదాపుగా హింస లాంటి వాతావరణం, మానసిక ఉద్రిక్తతా ప్రతిచోటా స్పష్టంగా కనిపిస్తుంది. ఎటైనా వెళ్లాలంటే ఎక్కడికక్కడ ఆంక్షలు, కమ్యూనికేషన్ నెట్‌వర్క్‌ల స్నాపింగ్, సమాచారం బ్లాక్‌అవుట్ చేయబడడంతో పుకార్లు విజృంభించాయి. చిన్న పిల్లలు రాళ్లు విసురుతున్న కారణంగా నవ బజార్ ప్రాంతంలోని సెంట్రల్ రిజర్వ్ పోలీస్ ఫోర్స్‌కీ జమ్మూ కశ్మీర్ పోలీసులకీ మధ్య ఘర్షణలు జరిగాయనీ, సీఆర్‌పీఎఫ్, జేకే పోలీస్‌ల ఆయుధాలు లాక్కున్నారనీ, అందుకు వాళ్లు చాలా కోపంతో ఊగిపోతున్నారనీ చెప్పుకుంటున్నారు. కానీ ఆ వార్తలు నిజమా కాదా అని ధృవీకరించుకునే మార్గం లేదు.

ఈ ఎస్టాబ్లిష్‌మెంట్‌తో స్నేహపూర్వకంగా మెలుగుతున్న జర్నలిస్టుల్ని హెలికాప్టర్లలో అటూ ఇటూ చేరవేస్తున్నారు. మరి కొంతమంది గ్రూప్స్‌గా తిరుగుతూ భద్రతా దళాలతో చర్చలు జరపడం సురక్షితమనీ, సులువనీ భావించారు. నిరసనల సమయంలో ఏవైనా మరణాలు సంభవించాయేమో చెక్ చేసుకోవడానికి నేను, నాతో బాటు ఢిల్లీ నుంచి వచ్చిన మూడు పాత్రికేయులూ కలిసి సౌరాలో ఉన్న షేర్-ఎ-కాశ్మీర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ ఆసుపత్రికి క్యాబ్‌లో వెళ్లాలని నిర్ణయించుకున్నాం. నిరసనల్ని గురించి మీడియా తెలుసుకోగలిగిన ఏకైక ప్రాంతం ఇదే.

సౌరాలో ఆగష్టు 9న వేలాది మంది కశ్మీర్ ప్రత్యేక హోదాని భారత ప్రభుత్వం రద్దు చేయడాన్ని నిరసిస్తూ వీధుల్లో నిరసనలు చేశారని బీబీసీ రిపోర్టు చేసింది. ప్రభుత్వం ముందుగా పేర్కొన్న కథనాల్లో ఎక్కడా ఎలాంటి అల్లర్లూ జరగలేదనీ, అంతా శాంతియుతంగానే ఉందని చెప్పుకుంటూ వచ్చినా, ఆగష్టు 13న హోమ్ వ్యవహారాల మంత్రిత్వ శాఖ ఆ రోజు 'దుండగులు' ఎలాంటి కవ్వింపు ధోరణీ లేకపోయినా రాళ్లతో వచ్చేసరికి 'విస్తృతమైన ఆందోళనలు' చెలరేగాయని అంగీకరించింది. కశ్మీర్‌లో హింస చాలా మామూలైపోయిందంటే, పెద్ద ఎత్తున హింస జరగకపోయినా, హింస మీద సమాచారం సరిగా బయటికి రాకపోయినా, అంతా ప్రశాంతంగా ఉందని ప్రభుత్వం ధైర్యంగా ప్రకటించేస్తుంది. వాస్తవానికి, ప్రభుత్వం, దాని అనేక ఏజెన్సీలూ పబ్లిక్‌కి చెప్పే సమాచారాన్ని నియంత్రిస్తాయి. స్థానిక జర్నలిస్టులు ఆస్పత్రులకి వెళ్లి గాయపడిన వ్యక్తుల సమాచారాన్ని సేకరిస్తారు, కాని వీలైనంత త్వరగా రోగులను డిశ్చార్జ్ చేయమని ఆస్పత్రులపై ఒత్తిడి ఉంటుంది.

జమ్మూ కశ్మీర్ ప్రభుత్వంలో ప్రణాళిక, అభివృద్ధి, పర్యవేక్షణ ప్రధాన కార్యదర్శి రోహిత్ కన్సల్ ప్రతి సాయంత్రం ఒక హోటల్‌లో ఏర్పాటు చేసిన మీడియా సెంటర్‌లో విలేకరుల సమావేశం జరుగుతుంది. అందులో అడిగే ప్రశ్నలన్నింటినీ తప్పుదారి పట్టించి, అంతా ప్రశాంతంగానే ఉందనే విషయాన్ని బలంగా నమ్మించేందుకు

ప్రయత్నం జరుగుతుంది. అయితే, ఆగస్టు 14న పరిస్థితి మెరుగుపడిందని చెప్తున్నప్పుడు, కశ్మీరీ సీనియర్ జర్నలిస్ట్ వెంటనే విరుచుకుపడ్డాడు. జర్నలిస్ట్ కన్సల్‌ని, 'అసలు మీ దృష్టిలో 'అభివృద్ధి' కి నిర్వచనం ఏంటి? ఇటీవలి కాలంలో అంతా మామూలుగానే ఉంటోందని ప్రచారం చేస్తున్నారు కదా!' అని వెంటబడ్డాడు. కన్సల్ ముఖం ఇబ్బందిగా పెట్టి తను వివరాల్లోకి వెళ్లదల్చుకోలేదని చెప్పాడు. రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రులు ఆచూకీపై ఏ ప్రశ్నలు అడిగినా ఏ వివరాలూ ఇవ్వబడవని చాలా కూల్‌గా చెప్పాడు.

మేం శ్రీనగర్‌లోని ఖన్యార్, రైనావరి అనే సెన్సిటివ్ డౌన్‌టౌన్‌ల గుండా వెళ్తుంటే వీథులన్నీ నిర్మానుష్యంగా కనిపించాయి. కొన్నిసార్లు, ప్రతి వంద మీటర్లకీ లేదా ఇంకా అంతకంటే తక్కువ దూరానికీ మేం సందులు మారుతూ మెయిన్ రోడ్ మీదకి తిరిగి వచ్చేవాళ్లం. ఎందుకంటే, అక్కడేవైనా గొడవలు జరుగుతుంటే మాకు ముందుకు వెళ్లడానికి గానీ వెనక్కి తిరిగి వెళ్లడానికి గానీ అనుమతి లేదు. నాన్-కశ్మీరీలు ప్రయాణించడం చూసి భద్రతా దళాల సిబ్బంది చాలా ఆశ్చర్యపోయారు. మేం ఎక్కడికి వెళ్తున్నామో, ఎందుకు వెళ్తున్నామో అడిగారు. వాళ్లు మమ్మల్ని ఢిల్లీ మీడియాగా గుర్తించినప్పుడు మమ్మల్ని అనుమతించారు. వాళ్లలో ఒకరు ఆజ్ తక్ జర్నలిస్టును ప్రస్తావిస్తూ, 'శ్వేతా సింగ్ హై క్యా అందర్?' అని అడిగి, జవాబు చెప్పేలోపే, వచ్చేసారి ఆమెను పంపమని కోరారు. 14 కిలోమీటర్లు ప్రయాణించడానికి మాకు గంట కన్నా ఎక్కువ సమయమే పట్టింది.

SKIMS దగ్గరకి రోగులు మెల్ల మెల్లగా చేరుకుంటున్నారు. అప్పుడప్పుడూ రోగుల్ని తీసుకుని ఒక అంబులెన్స్ వస్తోంది. లాక్‌డౌన్ విధించినప్పటి నుంచీ కొత్తగా ప్రాణనష్టం జరిగి ఉంటుందేమో తెలుసుకోవడానికి మేం ప్రయత్నించాం. ఒక వ్యక్తి సెల్‌ఫోన్‌లో నిరసనలో పెల్లెట్ గన్స్‌తో గాయపడిన యువకుల చిత్రాల్ని చూశాం. మేం సమాచారం సేకరించడానికి ప్రయత్నిస్తున్నప్పుడు, ఆసుపత్రిలో మఫ్టీలో ఉన్న నేర పరిశోధన విభాగానికి చెందిన పోలీసు అధికారులు మా గురించి తెలుసుకుని మమ్మల్ని వెతుక్కుంటూ వచ్చారు.

ఈలోగా, ఒక యువకుడు ఒక ముఖ్యమైన సమాచారం చెప్తాననీ, తనతో రమ్మనీ కోరాడు. 'అతను పోలీసు ఇన్‌ఫార్మర్ కావచ్చు, జాగ్రత్తగా ఉండండ'ని అని ఒక ఆసుపత్రి ఉద్యోగి మమ్మల్ని హెచ్చరించాడు. కానీ మేం అతని వెంట వెళ్లాలని నిర్ణయించుకున్నాం. అతను ఆసుపత్రి వెనుక వైపున్న ప్రవేశ ద్వారం నుంచి సౌరా యాంకర్ ప్రాంతంలోని సందుగొందుల్లోకి తీసుకువెళ్ళాడు. బీబీసీ రికార్డు చేసిన నిరసనలు జరిగిందక్కడే. ఓ పదిహేను నిమిషాలు నడిచిన తరువాత, అకస్మాత్తుగా మేం సుప్రసిద్ధ జెనాబ్ సాబ్ మసీదు ముందు ఉన్నాం. అది చాలా పెద్ద మసీదు. తెల్లని అందమైన గోడలు, మీనార్లు, ఆకుపచ్చ గోపురాలతో చాలా విశాలంగా ఉంది. మసీదు ప్రాంగణం ఒక ఫుట్‌బాల్ మైదానమంత పరిమాణంలో ఉంది. ఆ మసీదులో వేర్వేరు భాగాల్లో కనీసం నాలుగొందల మంది దాకా మగవాళ్లూ, ఆడవాళ్లూ, పిల్లలూ గుంపులుగా ఏర్పడి తీవ్రమైన చర్చలలో నిమగ్నమై ఉన్నారు. వాళ్లు మా జర్నలిస్టుల్ని చూడగానే పెద్ద గొంతుతో బిగ్గరగా నినాదాలు చేశారు.

మమ్మల్నందరినీ మగవాళ్ల గ్రూపు చుట్టుముట్టింది. అన్ని గొంతుకలు ఒక్క పెట్టున అరుస్తుంటే, నాకు కొన్ని నిమిషాల పాటు ఏమీ అర్థం కాలేదు. కాసేపు వాళ్లు భారతీయ మీడియాని నానా తిట్లూ తిట్టారు. నాకు ప్రశ్నలు అడగడానికి అవకాశం రాలేదు. వాళ్లందరి ఘోషా వింటూ చుట్టూ తిరిగాను. క్రొత్త వ్యక్తులు ఈ బృందంలో చేరుతున్నారు, తమకి తప్పుగా తోచిన విషయాన్ని ప్రతిఘటిస్తూ అందరూ పదీ పదిహేను నిమిషాలు బిగ్గరగా ఉద్వేగభరితంగా నినాదాలిస్తున్నారు. ఆ నినాదాల సారాంశం ఒకటే-

'అసలు అపరాధి భారతీయ మీడియానే. భారతీయులే అసలైన ఉగ్రవాదులు. వాళ్లు మమ్మల్ని ఉగ్రవాదులు కావడానికి ప్రేరేపిస్తున్నారు.'

'భారతదేశంతో ఈ సంబంధం ఆర్టికల్ 370 పై నిర్మించబడింది. ఇప్పుడు అది ఎటూ పోయింది కాబట్టి మనం ఆజాద్ అయిపోయాం.

'పాకిస్తాన్ గురించీ, హిందుత్వం గురించి వదిలేయండి, మానవత్వం ఏది? మా మతపరమైన విధుల్ని పాటించటానికి మాకు అనుమతి లేదు.'

'కశ్మీర్ మరో పాలస్తీనా అవుతుంది. మేం ప్రతి హక్కునీ కోల్పోతాం.'

'కశ్మీర్ జనాభా ఇప్పటికే చాలా ఎక్కువగా ఉంది. భూమి తక్కువగా ఉంది. బయటి వ్యక్తులు వస్తే ఏం జరుగుతుంది? మన భవిష్యత్ తరాలకు ఏం మిగిలి ఉంటుంది? మాకు తుపాకులు పట్టుకోవడం తప్ప వేరే మార్గం లేదు.'

ఒక యువకుడు తుపాకుల గురించి ప్రస్తావన తేగానే మిగతా వాళ్లంతా 'ఏకైక పరిష్కారం, తుపాకీ ఒక్కటే' అని అరవడం ప్రారంభించారు. ఒక గంట తరువాత, మేం బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, వాళ్లలో కొందరు మమ్మల్ని మర్నాడు ఈద్ ఉదయం ప్రార్థనల సమయానికి రమ్మన్నారు. 'ఉదయం నమాజ్ అయిన వెంటనే యాభై అరవై వేల మందిమి ఊరేగింపుకి వెళ్తాం,' ఒక వ్యక్తి చెప్పారు. మేం బయటకు వస్తుంటే, ఆడవాళ్లూ, పిల్లలూ, ఆజాదీ నినాదాలు చేస్తూ చిన్న సైజు ర్యాలీ చేశారు.

నేను ర్యాలీ వెంట నడుస్తూ SKIMS (స్కిమ్స్) వైపు వెళ్లసాగాను. ఇంతలో ఒకతను వచ్చి తనను జర్నలిస్టుగా పరిచయం చేసుకున్నాడు. 'ఇప్పుడు, మేం హురియత్ కోసమో లేదా మరెవరి కోసమో వెయిట్ చేయలేం. మేం చొరవ తీసుకుంటాం. కొన్ని చోట్ల మొహల్లా కమిటీలను ఏర్పాటు చేస్తాం, ఆజీవన పోరాటం చేయాలని నిర్ణయించాం. లేకపోతే ఇక కశ్మీర్ అంతమైపోతుంది. రిఫరెండం (ప్రజాభిప్రాయ సేకరణ) మా లక్ష్యం. ఈ కొత్త పర్యవసానంతో గతంలో తమ ప్రాంతంలో ఉన్న భేదాలు మటుమాయమయ్యాయని అతను అన్నాడు. 'పేద, ధనిక తేడాలు ఇప్పుడిక్కడ లేవు. గతంలో

పేదవారు భారతదేశానికి వ్యతిరేకంగా నిరసనలు చేశారు, రాళ్లు రువ్వారు. కానీ ఇప్పుడు వృద్ధులు, సంపన్నులు కూడా ర్యాలీలు చేస్తున్నారు. సున్నీ, షియా, వహాబీ, జమాఅత్, ఎన్‌సీ, పీడీపీ తేడాలు ఇప్పుడు లేవు. అన్నీ ఒకటైపోయాయి' అని చెప్పాడతడు.

ఆ యువ జర్నలిస్ట్ ప్రకారం, 'అభివృద్ధి' అనే ఈ లాలీపాప్‌కి కశ్మీరీలను ప్రసన్నం చేసుకునే శక్తి లేదు. 'ఇప్పుడు బయటివాళ్లు వచ్చి పెట్టుబడులు పెట్టి ఉద్యోగాలిస్తారనీ, అభివృద్ధి తీసుకొస్తారనీ వాళ్లంటున్నారు. దాని కోసం ఇప్పటికే నిబంధనలు తయారు చేయబడ్డాయి. శ్రీనగర్‌లోని టిండాలే బిస్కో స్కూల్, తాజ్ వివాంట వంటి అనేక సంస్థల్ని చూడండి. వాటిని ఏడాదికి 100 రూపాయల కనాకష్టం ధరకి 99 సంవత్సరాలకు లీజుకి తీసుకున్నారు. వాళ్లు చాలా డబ్బు సంపాదిస్తారు. కశ్మీరీలకి దాని వల్ల ఒరిగేదేంటి? ఏమీ లేదు. రాష్ట్రానికి వచ్చి పెట్టుబడులు పెట్టాలనుకునే వాళ్లకి ప్రభుత్వం ఖచ్చితంగా అనుమతినిస్తుంది. దాని కోసం ఆర్టికల్ 370ని ఎందుకు రద్దు చేయాలి?' అని అడిగాడతడు.

భారత సైన్యం, భారత రైల్వేలు కూడా రాష్ట్ర ప్రభుత్వం ద్వారా రాష్ట్రంలో శాశ్వత ప్రాతిపదికన చాలా భూముల్ని కొన్నారని ఎత్తి చూపారు. 'మా పోరాటమంతా మా భూమి గురించే' అన్నాడు ఆ యువ పాత్రికేయుడు.

'కశ్మీరీలు తమ సొంత ప్రదేశం నుంచి తరిమివేయబడతారు లేదా శివార్లలోకి నెట్టబడతారు. వాళ్ల హక్కులూ, రాజకీయ ఆకాంక్షలూ అన్నింటినీ మరచిపోయి మౌనంగా బతికేయాలంతే!'

కశ్మీర్ ప్రజలు తమ ప్రాంతంలో జరిగే ఆందోళనల్ని ఇజ్రాయెల్-పాలస్తీనా గొడవలతో పోల్చుకుంటూ ఉంటారు. బీజేపీ, ఆర్ఎస్ఎస్‌లు ఇజ్రాయెల్ పట్ల చూపించే అభిమానం చూస్తే ఈ పోలికలు తప్పనిపించవు. ప్రస్తుత కర్ఫ్యూ పరిస్థితి, ప్రజల ప్రతిస్పందన మనకి 2003లో నవలా రచయిత జాన్ బెర్గర్ తన నవల 'ఏ డిస్పాచ్ ఫ్రమ్ రమల్లా' లో వివరించిన దానికి దగ్గరగా ఉంటుంది:

ఉగ్రవాదాన్ని ఎదుర్కోవడానికి ఈ చర్యలు తీసుకోవలసిన బాధ్యత తమపై ఉందని ఇజ్రాయెల్ ప్రభుత్వం పేర్కొంది. ఈ రకమైన వాదన ఒక నాటకం. ఇలా స్థానిక జనాభాని భీతావహ పరిస్థితులకి బలిచేసి, తాత్కాలిక నివాసాలు, ప్రాదేశికంగా వారి సొంత భూమితో ముడిపడి ఉన్న భావాల్ని నాశనం చేయడం, తద్వారా వాళ్లు అక్కడ నుంచి వెళ్లిపోవడమో లేదా నిర్బంధ సేవకులుగా మారిపోవడమో చేయాల్సి ఉంటుంది. ఇక్కడ బ్రతికున్నవారికి ప్రతిఘటించడానికి సహాయం చేసేది ఈ కారణాల కోసం చనిపోయినవాళ్లే. అందువల్ల ఇక్కడ పురుషులు, స్త్రీలు అమరవీరులుగా మారాలని నిర్ణయం తీసుకుంటారు. ఊపిరిసలపని పరిస్థితులే పోరాటానికీ, ఉగ్రవాదానికీ ప్రేరేపిస్తాయి.

• • •

షేర్-ఎ-కాశ్మీర్ ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ సెంటర్, సెంటార్ లేక్ వ్యూ హోటల్ దాల్ సరస్సు ఒడ్డున ఉన్నాయి. ముఖ్యమైన ప్రభుత్వ కార్యకలాపాలు, సమావేశాలు ఇక్కడ జరుగుతాయి. అది ఆగస్టు 5 నుండి జైలుగా మారిపోయింది. కేంద్రం డైరెక్టర్ ఇప్పుడు ఒక సమర్థవంతమైన జైలర్ పాత్ర పోషిస్తున్నారు. మేం అక్కడి రాజకీయ ఖైదీల పరిస్థితుల్ని చూడడానికి వెళ్లాం. అక్కడ ఒక కుటుంబానికి చెందిన ఇద్దరు మహిళలు ఇద్దరు అబ్బాయిలు గేట్ల బయట వెయిట్ చేస్తున్నారు. ముందుగా వాళ్లు ఎలాంటి వివరాల్నీ వెల్లడించడానికి ఇష్టపడలేదు. వాళ్లలో ఒకరు గండేర్బల్ నియోజకవర్గం నుంచి నేషనల్ కాన్ఫరెన్స్ నుంచి ఎన్నికైన మాజీ శాసనసభ సభ్యుడు షేక్ ఇష్ఫాక్ జబ్బార్ భార్య, మరొకరు అతని సోదరి షాహిన్ జబ్బార్. ఆ పిల్లలు అతని కుమారులు. జబ్బార్‌ని ముందుగా ఆగస్టు 5న గృహ నిర్బంధంలో ఉంచి, రెండు రోజుల తరువాత SKICC కి తరలించారు.

జబ్బార్ మామగారు, మాజీ ఎమ్మెల్యే, నేషనల్ కాన్ఫరెన్స్ తాత్కాలిక అధ్యక్షుడు సయ్యద్ అఖూన్‌ని అరెస్టు చేసి ౹ాఖ×జజ కి తీసుకువచ్చారు. స్థానిక స్టేషన్ హౌస్ ఆఫీసర్ అతను ఎక్కడ ఉన్నాడో ఆ కుటుంబ సభ్యులకు చెప్పాడు. ఈద్ ముందు రోజు ఆ కుటుంబం చేరుకుంది. 'కిస్ బునియాద్ పే అరెస్ట్ కియా పతా నహీ' (వాళ్లు అతన్ని ఏ ప్రాతిపదికన అరెస్టు చేశారో మాకు తెలియదు) అన్నాడు షాహిన్ జబ్బార్ మాతో. 'మా నాన్నగారు భారతీయుడనే కారణానికి 90ల్లో ఉగ్రవాదులు చంపేశారు.' అత్యంత కఠినమైన జమ్మూ కాశ్మీర్ పబ్లిక్ సేఫ్టీ యాక్ట్, 1978 తన మీద చర్యలు తీసుకుంటుందని ఆ కుటుంబం ఆందోళన పడుతోంది. ఎలాంటి ఆరోపణలూ విచారణలూ లేకుండా ఒక వ్యక్తిని రెండేళ్లపాటు అదుపులోకి తీసుకోవడానికి ఆ చట్టం అనుమతిస్తుంది.

మహమ్మద్ యూసుఫ్ తరీగమీ, కమ్యూనిస్ట్ పార్టీ (మార్క్సిస్ట్) ఆఫ్ ఇండియా నుంచి దక్షిణ కశ్మీర్లోని కుల్గామ్‌లో ఎన్నికైన ఏకైక ఎమ్మెల్యే. ఆయన్ని గృహనిర్బంధంలో ఉంచారు. జమ్మూ కాశ్మీర్ పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ యువ నాయకుడు వహీద్ ఉర్ రెహ్మాన్ పారా కూడా పీఎస్ఏ క్రింద అదుపులోకి తీసుకున్నట్లు సమాచారం. ఈ ఇద్దరూ కాశ్మీర్ లోయలో ఆర్మీ ఎస్టాబ్లిష్‌మెంట్‌ని రద్దు చేశారు. రాజకీయాల్లో చేరడానికి ముందు జబ్బార్ ఒక పోలీసుల సబ్ ఇన్‌స్పెక్టర్‌గా పని చేశారు. అతని పొరుగింటి స్నేహితుడి కథనం ఇలా ఉంది- 'ఇంతకుముందు వాళ్లు పాకిస్తాన్ అనుకూల వ్యక్తుల్ని అరెస్టు చేసేవారు, ఇప్పుడు వాళ్లు భారతదేశానికి అనుకూలంగా ఉన్నవాళ్లని కూడా అదుపులోకి తీసుకుంటున్నారు. ఎన్నడూ అబద్ధమాడని ఇద్దరు వ్యక్తులు కాశ్మీర్‌లో ఉన్నారు. స్వచ్ఛమైన పాకిస్తానీ అయిన గిలానీ, స్వచ్ఛమైన భారతీయుడు ఫరూక్ అబ్దుల్లా. సయ్యద్ అలీ షా గిలానీ శక్తివంతమైన వేర్పాటువాద నాయకుడు. ఫరూక్ అబ్దుల్లా నేషనల్ కాన్ఫరెన్స్‌కి ఛైర్‌పర్సన్. కానీ ఈ రోజు, ఫరూక్ కూడా గృహ నిర్బంధంలో ఉన్నందుకు విలపిస్తున్నారు.' జబ్బార్‌తో పాటు SKICC లోపల సుమారు 200 మంది రాజకీయ నాయకులు, కార్మికులు ఉన్నారు. అరెస్టయిన గందర్‌బాల్‌కు చెందిన మరో నలుగురు రాజకీయ నాయకుల పేర్లు కూడా ఆయన లిస్ట్ చేశారు.

గేట్ దగ్గర, రోడ్డు ప్రక్కన రెండు గంటలు వెయిట్ చేసిన తరువాత జబ్బార్ భార్య, కుమారులకి ఆయన్ని కలవడానికి అనుమతి లభించింది. ఆమె నలభై నిమిషాల తర్వాత తిరిగి వచ్చింది. అతనిని కాన్ఫరెన్స్ హాల్‌లో దూరం నుండి రెండు నిమిషాల పాటు చూడడానికి అనుమతించారట. 'రేపు ఈద్. మేం ఆయన్ని కలవడానికి వచ్చాం. కానీ దాన్ని మీటింగ్ అని అనలేం. కనీసం ఆయనకి ఈద్ భోజనం పెట్టడానికైనా మాకు అనుమతినివ్వాలి. ఆయనేమీ మిలిటెంట్ కాదు' అని ఆమె మాకు చెప్పారు. 'సజా మిల్ రహీ హై హిందుస్తానీ హోనే కీ వజహ్ సే.' (హిందుస్తానీ అయినందుకు అతనికి శిక్ష పడుతోంది) అందామె. సెంట్రల్ జైలు లోపల చాలా భద్రత ఉందనీ, అక్కడే గృహ నిర్బంధంలో ఉన్న తన తండ్రిని కలవడానికి ఆమెను అనుమతించలేదు. జబ్బార్ స్నేహితుడు, ప్రభుత్వ ఉద్యోగి మాట్లాడుతూ, 'ఈ రోజు వరకు కొద్దిమంది మాత్రమే భారతదేశానికి వ్యతిరేకంగా పోరాడారు. కానీ ఇప్పుడు మొత్తం ఈ రాజ్యమంతా పోరాడుతుంది.'

ఈద్ వాతావరణం ఇక్కడితో పోలిస్తే శ్రీనగర్‌లో చాలా ప్రశాంతంగా ఉంది. దీనిని ఇక్కడ రెండున్నర రోజులు జరుపుకున్నారు. ఉన్నత స్థాయి భద్రత మరొక కారణం. ఈద్ రోజు మధ్యాహ్నం, ప్రార్థనలు, భోజనం తరువాత నిరసనలు జరిగే అవకాశం ఉంది. కానీ ఊహించిన విధంగా నిరసనలు అంత తీవ్రతరంగా గానూ లేవు, అంత విస్తృతంగానూ లేవు. అధికారిక అంచనా ప్రకారం, శ్రీనగర్‌లోని 22 ప్రదేశాలలో ఈద్ ప్రార్థనలు జరగలేదు. కానీ అసలు సంఖ్య అంతకంటే చాలా పెద్దదే కావచ్చు. మౌల్వీలు తమ ఈద్ ఉపన్యాసాలలో రాజకీయ పరిస్థితుల గురించి మాట్లాడవద్దని ముందుగానే హెచ్చరించారు. 'మీరు రాజకీయ ఉపన్యాసం ఇస్తే, అప్పుడు పోలీస్ స్టేషన్‌కి స్వచ్ఛందంగా వచ్చి లొంగిపోండి' అని పోలీసులు తమని హెచ్చరించినట్టు ఒక మౌల్వీ చెప్పారు.

మొదటి రోజు, ఆగస్టు 12న నేను లాల్ చౌక్‌కి వెళ్లాను. అక్కడ ఫోర్టిఫైడ్ సెక్యూరిటీ ఫోర్స్ వాహనాలు ఉన్నాయి. అక్కడి జనం మాతో చెప్పినట్టుగా అక్కడ నిరసన ర్యాలీ జరుగుతుందా అని చూడటానికి నాతో సహా ఒక చిన్న బృందం జర్నలిస్టులు కాలినడకన సౌరా వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. దారిలో ఈద్ దుస్తులను ధరించిన కొంతమంది వ్యక్తులు తమ సొంత కాలనీల్లో తిరగడం నేను చూశాను. గొడవలు జరిగే పరిస్థితిని అంచనా వేసి జమ్మూ కశ్మీర్ గవర్నర్‌కు సలహాదారు కె. విజయ్ కుమార్, అతనితో పాటు ఒక కాన్వాయ్ డౌన్‌టౌన్ ప్రాంతం మొదలయ్యే ఖన్యార్ దగ్గర మమ్మల్ని దాటి వెళ్లింది. ఆ తర్వాత, మేం దాదాపు ఘర్షణలో చిక్కుకున్నాం.

వీధిలో అడుగుపెట్టిన వాళ్లందర్నీ లోపలికి తిరిగి వెళ్లమనే సంకేతంగా భద్రతా సిబ్బంది విజిల్స్ వేస్తున్నారు. రోడ్డు పక్కన యాభై మీటర్ల దూరంలో కొత్త దుస్తులలో నిలబడి ఉన్న యువకులిద్దరు చేతులతో సైగ చేస్తూ తాము లోపలికి వెళ్లమని జవాబిచ్చారు. భద్రతా సిబ్బంది వాళ్లని నోటికొచ్చినట్లా తిట్టడం మొదలుపెట్టారు. వాళ్ల దగ్గరున్న కాటాపుల్ట్‌ను ఉపయోగించి వాళ్లపై రాళ్లు వేస్తూ వాళ్లని వెంబడించారు. ఆ యువకులు పారిపోయారు. ఆ గందరగోళమంతా ముగిసి సైనికులు యథాస్థానానికి తిరిగి చేరుకునే వరకు మేం ఆ సందుల్లోనే వెయిట్ చేశాం. ఆ తరువాత మేం మెయిన్ రోడ్‌ని ఉపయోగించకూడదనీ, ఇరుకైన సందుల్లోనే వెళ్లాలనీ నిర్ణయించుకున్నాం.

భారతదేశానికి విధేయులుగా ఉన్న కశ్మీరులు కూడా ఇప్పుడు వ్యతిరేకంగా తయారవుతున్న సంఘటనల గురించి నేను విన్నాను. 'హింసకు చట్టబద్ధత ఇప్పుడిక్కడ గరిష్ఠ స్థాయికి చేరుకుంది' అని ఒక సీనియర్ జర్నలిస్ట్ నాతో అన్నారు. 'పౌరులు, సైనికుల మధ్య గీత చాలా అస్పష్టంగా ఉంది. ప్రతి భారతీయుడూ ఇక్కడ చట్టబద్ధమైన లక్ష్యంగా మారతారు. మధ్య తరగతి, ఉన్నత మధ్యతరగతి కుటుంబాలలో కూడా ఇప్పుడు ఆత్మాహుతి దళాలకి ఎక్కువ ప్రాచుర్యం లభించే వాతావరణం కూడా ఉంది. శ్రీనగర్ కేంద్రంగా పనిచేస్తున్న ఒక వ్యాపారవేత్త పాకిస్తాన్ క్రియేషన్‌ని వ్యతిరేకిస్తూ, రెండు దేశాల సిద్ధాంతాన్ని సపోర్ట్ చేసే తన కుటుంబ సభ్యుని గురించి గురించి నాకు చెప్పారు.

కతీదర్వాజా దాటిన తరువాత, కొంతమంది జనం భారతీయ మీడియాను తిట్టడం మొదలుపెట్టారు. విదేశీ ప్రచురణ కోసం పనిచేసే ఒక జర్నలిస్ట్ వాళ్లని చల్లబరిచారు. వాళ్లలో ఒకరు, 'ఇధర్ లల్ హై' (ఇక్కడ ప్రశాంతంగా ఉంది) అన్నారు. నిజమే, ఇక్కడ ప్రశాంతంగా ఉంది. కానీ అది 'అది తుఫాను ముందు ప్రశాంతత.' మేం వదిలి పెట్టగానే మరొకరు, 'మోడీ కో మేరా నమస్కార్ బోల్‌నా' (మోడీకి నా శుభాకాంక్షలు తెలియజేయండి) అంతా నవ్వేశారు. కోల్‌కతాలో ఒక వృద్ధ వ్యాపారి నాతో కలిసి నడుస్తూ, 'ఇది షేక్ అబ్దుల్లా తప్పు. అబ్దుల్లా నేషనల్ కాన్ఫరెన్స్ వ్యవస్థాపకులు, జమ్మూ కశ్మీర్‌కి మాజీ ప్రధాన మంత్రి. ఆయన ఇందిరా గాంధీతో 1974లో వేర్పాటువాదులను లొంగిపోయినవారి క్రింద జమ కడతామనే ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆయన భారతదేశాన్ని విశ్వసించాడు. ఈ రోజు జరుగుతున్నదాన్ని స్వాగతించింది ఆయనే' అన్నారు. చాలా మంది షేక్ అబ్దుల్లానే అసలు పాపి అని చెప్తున్నారు.

• • •

అలీపోరాలో మేం కాసేపు విశ్రాంతి తీసుకోవడానికి కూర్చున్నప్పుడు, మాతో మాట్లాడటానికి ఒక గుంపు వచ్చింది. అందులో ఓ ఇరవై ఏళ్ల వ్యక్తి మాతో మాట్లాడుతూ, 'ఇంతకు ముందు, భారతీయుల్ని మేం అతిథులుగా చూసేవాళ్లం. మేం వాళ్లకి గొప్ప ఆతిథ్యం ఇచ్చేవాళ్లం. ఇప్పుడిక అలా జరగదు. మిలిటెన్సీ 10 శాతం నుండి 60 లేదా 70 శాతానికి పెరుగుతుంది. బీజేపీ గూండాగర్దీ మొదలుపెట్టింది. ఇక మీదట వాళ్లు పాస్‌పోర్ట్‌లతో రావాల్సిందే. లేకపోతే వాళ్లని మేం తన్ని తగలేస్తాం', అన్నాడు. మరో వృద్ధుడు, 'వీళ్లు ప్రారంభించారు, కానీ దీన్ని మేం ముగిస్తాం. నా పిల్లలిద్దరూ ఆత్మాహుతికి సిద్ధంగా ఉన్నారు. వాళ్లు సిద్ధంగా ఉన్నారని మోడీకి చెప్పండి', అన్నాడు. మరొకరు, 'మోడీ మాకు స్వేచ్ఛనివ్వడు, ఇన్షాఅల్లా!' అని వాపోయాడు.




మేం ఉద్యోగులను తీసుకురావడానికి ఉపయోగించే స్కిమ్స్ హాస్పిటల్ బస్సులో లిఫ్ట్ తీసుకున్నాం. బస్సులో ఒక వృద్ధురాలు, ఆమె భర్త మాత్రమే ఉన్నారు. ఆమె నడవలేకపోతోందని డ్రైవర్ మణిగం అనే స్థలం నుండి వాళ్లని తీసుకొచ్చాడు. అతను ఆమెను దించేయమని భద్రతా దళాలు చెప్పినట్టు మాకు చెప్పారు. ఈ బస్సులో మొన్న 40 మంది గాయపడిన వాళ్లని తీసుకుని ఆసుపత్రికి వచ్చాను. కానీ భారత మీడియా పరిస్థితి అంతా అదుపులో ఉందని చెప్పారు. 2016లో మిలిటెంట్ కమాండర్ బుర్హాన్ వాని మరణం తరువాత నిరసనల సమయంలో కూడా ఇంత కఠినమైన ఆంక్షలు లేవు. కొన్నిసార్లు, ఆపరేషన్ థియేటర్ సిబ్బందిని కూడా రానివ్వరు. వాళ్లు ఉద్దేశపూర్వకంగా మమ్మల్ని లోపలికి వెళ్లనీయకుండా అడ్డుకుంటారు, ఆలస్యం చేస్తారు,' అని ఆయన మాకు చెప్పారు.

రెండు గంటల నడక, మధ్యలో లిఫ్ట్ తీసుకుని మేం స్కిమ్స్ చేరుకున్నాం. మేం స్కిమ్స్ వెనుక గేట్ నుండి సౌరా యాంచర్ ప్రాంతంలోకి ప్రవేశించాం. అక్కడ రాళ్లు, చెక్క దుంగలతో ఆ ఇరుకైన మార్గం బ్లాక్ చేయబడింది. జెనాబ్ సాబ్ మసీదు ముందు నెగడు మండుతోంది. మేం మునుపటి రోజు మాట్లాడినవాళ్లలో కొంతమంది మమ్మల్ని గుర్తించారు. ఏం జరిగిందో వివరిస్తూ మాకు ఆ ప్రదేశాల్ని చూపించడం ప్రారంభించారు. రోడ్ మీద నాలుగైదు టియర్‌గాస్ షెల్స్ ఉన్నాయి. వీధి మొత్తం విరిగిన ఇటుకలతో నిండిపోయి ఉంది. బలగాలు ముందుకు రాకుండా ఆపడానికి ఉపయోగించే ఒక భారీ ఐరన్ వాటర్ ట్యాంక్ దారి మధ్యలో ఉంది. ఇది రాత్రి జరిగిన ఘర్షణని చెప్పకనే చెప్పింది.

ఒక యువకుడు పరిస్థితిని వివరిస్తూ, 'మేం అందరం మా విందు చాటింగ్ తర్వాత ఇక్కడ కూర్చున్నాము 'అకస్మాత్తుగా రాత్రి 11 గంటల సమయంలో ఈ రోడ్ మీద బలగాలు కనిపించాయి. వాళ్లు వెంటనే షెల్లింగ్ ప్రారంభించారు. మేం సమాధానం ఇచ్చాం. ఉదయాన్నే మా ఈద్ నమాజ్‌ని ఆపడానికి వచ్చిన బలగాలను ప్రతిఘటించాలని మసీదు నుంచి మాకు పిలుపు వచ్చింది. అందరం బయటకు వచ్చి అప్రమత్తంగా ఉంటూ బలగాలతో ఘర్షణ పడ్డాం. మేం ఉదయం 6 గంటల సమయంలో నిద్రపోయాం. చాలామంది ఇప్పటికీ ఇంకా నిద్రపోతూనే ఉన్నారు. వాళ్లు మాపై రెండు మూడు సార్లు దాడి చేసి లోపలికి వెళ్లడానికి ప్రయత్నించారు. మేం గానీ నిద్రపోయి ఉంటే, ఈ రోజు ఉదయం నమాజ్ చేయడానికి వాళ్లు మమ్మల్ని అనుమతించి ఉండేవాళ్లు కాదు,' అన్నాడు.

మూసివేసిన దుకాణాల చెక్క తలుపులపై బుర్హాన్ వాని ఇతర ఉగ్రవాదుల పోస్టర్లు ఉన్నాయి. 'మోడీ వేలిముద్రగాడు. పీహెచ్‌డీ చేసినవాళ్లు తుపాకీ ఎందుకు పడతారో ఆయనకు ఎలా తెలుస్తుంది?' ఒక పెద్దాయన అన్నాడు. చేతిలో బకెట్ పట్టుకుని ఉన్న మరొక వ్యక్తి మాట్లాడుతూ, 'ఉదయం నుండి ఆరు హెలికాప్టర్లు పైన రౌండ్లు కొట్టాయి. కనీసం మేం ఖుర్బానీ మాంసాన్ని పంచుకోవడానికి కూడా మాకు అనుమతి ఇవ్వడం లేదు. వాళ్లు ఎంట్రీ, ఎగ్జిట్ పాయింట్స్ అన్నీ మూసేసారు. కాబట్టి ఇంతకు ముందు ప్లాన్ చేసినట్టుగా నిరసన ర్యాలీకి ఇతర ప్రాంతాల ప్రజలు రాలేరు' అన్నాడు. మేం మళ్లీ స్కిమ్స్ వైపు వెళ్తుంటే, ఒక వ్యక్తి మాకు టీ ఇచ్చాడు. మేం మర్యాదగా వద్దన్నాం. దానికి అతను నవ్వి, 'యే మోడీ కీ చాయ్ నహీ హై, అప్‌నీ చాయ్ హై' అన్నాడు.

తిరిగి వెళ్లేటప్పుడు, రాళ్లు రువ్వుతుండడం వల్ల మేం రెండు చోట్ల దారి మళ్లించాం. సాయంత్రానికి ఆంక్షలు కొద్దిగా సడలించబడ్డాయి. ఈద్ కోసం ఉత్తర కశ్మీర్‌లోని పటాన్‌ను తరచూ సందర్శించే శ్రీనగర్ నివాసి అక్కడ చాలా విచారకర వాతావరణం అలుముకుందని చెప్పాడు. 'క్రితం సారి ఈద్ రోజున మౌల్వీ తన ధార్మికోపన్యాసంలో ఈద్ రోజున బాణసంచా పేల్చవద్దని యువతని కోరారు. కానీ ప్రార్థనలు ముగిసిన వెంటనే, వాళ్లు పటాసులు పేల్చడం ప్రారంభించారు. రాత్రి వరకు అడ్డూ అదుపూ లేకుండా సాగిందది. కానీ ఈసారి ఆయన ఆ విషయాన్ని ప్రస్తావించకపోయినా, అంతటా చాలా నిశ్శబ్దంగా ఉంది. గాలి కూడా స్తంభించిపోయింది. అందరూ షాక్‌లో ఉన్నారు' అన్నాడు. హింసాయుత సంఘటనల గురించి ఎలాంటి సమాచారమూ లేదు కాబట్టి కాస్త ఊపిరి తీసుకున్నాం. కానీ అంత ఖచ్చితమైన సమాచారం తెలియడం లేదని మాలో ప్రతి ఒక్కరికీ తెలుసు.

మరుసటి రోజు సాయంత్రం 6 గంటలకి శ్రీనగర్‌లోని శ్రీ మహారాజా హరి సింగ్ ఆసుపత్రిలో వార్డ్ నెంబర్ 11లో పెల్లెట్ కంటి గాయాలైన 35మంది బాధితుల గురించి తెలిసింది. ఇద్దరు సీనియర్ కశ్మీరీ జర్నలిస్టులతో కలిసి నేను ఆస్పత్రికి వెళ్లాను. కానీ అక్కడ ఎవరూ లేరు. ఆసుపత్రి దాదాపు ఖాళీగా ఉంది. వాళ్ల కోసం వెతుకుతున్నప్పుడు, మునీఫా నజీర్ అనే ఐదేళ్ల చిన్న పాపని కలిశాం. ఆమె కుడి కన్నుకి కట్టు కట్టి ఉంది. ఆమె చేతులకు ఈద్ మెహెందీ ఉంది. మంచం మీద నిద్రపోతోంది ఆ పాప. పది మందికి పైగా కుటుంబ సభ్యులు ఆమె చుట్టూ కూర్చున్నారు. సీఆర్‌పీఎఫ్ జవాన్ ఓ కాటాపుల్ట్‌తో రాయి విసిరినందువల్ల ఆమె కంటికి గాయమైంది. ఆ పాపని సఫకాదల్ నుంచి మునుపటి రోజు సాయంత్రం 6.30 గంటలకు తీసుకువచ్చారు. ఆమె మామయ్య బైక్ మీద కూర్చుంది.

ఫరూక్ అహ్మద్ వాని ఆమెకి మామయ్య అవుతాడు. అతను జరిగిన విషయమంతా చెప్పాడు. 'మేము ఖుర్బానీ మాంసాన్ని పంచడానికి బయల్దేరాం. పాప ఇంధన ట్యాంక్ మీద కూర్చుంది. ఇద్దరు నా వెనుక కూర్చున్నారు. నేను రోడ్ దాటబోతుంటే, ఒక సీఆర్‌పీఎఫ్ జవాన్ నన్ను మరో రోడ్‌లో వెళ్లమన్నాడు. అతను నాతో మాట్లాడుతుండగా, రోడ్డు మీదున్న మరో సీఆర్‌పీఎఫ్ వ్యక్తి రాయితో కొట్టాడు. మునీఫా గాయపడింది. చాలా రక్తం కారుతోంది. అతన్ని నేను ఎందుకలా చేశావని ఎదురు తిరగబోతే, అతను తుపాకీ తీసి నువ్వు ఇక్కడ నుంచి కదలకపోతే నిన్ను కాల్చేస్తానని చెప్పాడు. అప్పటిదాకా నన్ను సపోర్ట్ చేస్తూ మూగిన జనమంతా పారిపోయారు. అంతా నిశ్శబ్దంగా ఉండిపోయారు. సాయంత్రం 6 గంటలకు ఈ సంఘటన జరిగిన తర్వాత వాళ్ల షిఫ్ట్ కూడా ముగిసింది.

వాళ్లు ఆ పాపని ఆసుపత్రికి తీసుకువచ్చినప్పుడు ఒక వైద్యుడు అందుబాటులో ఉన్నాడు. డాక్టర్ తారిక్ ఖురేషీ కుడి కనుగ్రుడ్డు స్థానభ్రంశం చెందిందని చెప్పాడు. ఎంత వరకు నష్టం జరిగిందో

పరీక్షించి పది రోజుల తర్వాత సర్జరీ చేస్తానని చెప్పాడు. మునీఫా లోయర్ కిండర్ గార్టెన్‌లో చదువుతోంది. ఆమె ఆసియా న్యూస్ నెట్‌వర్క్‌తో కెమెరామెన్ అయిన నజీర్ అహ్మద్ వానీ చిన్న కూతురు. 'మీడియా ద్వారా నా కూతుర్ని డిశ్చార్జ్ చేసే వార్త రాకూడదని పోలీసులు ఆసుపత్రి ఉద్యోగులపై ఒత్తిడి తెచ్చారు. ఈ రోజు డాక్టర్ వచ్చి ఉంటే పాప డిశ్చార్జ్ అయ్యేదే. కానీ అతను రాలేదు,' అన్నాడతను. అతను జర్నలిస్ట్ అయినా గానీ, కమ్యూనికేట్ చేయడానికి వేరే మార్గం లేనందున అతను ఎవరికీ తెలియజేయలేకపోయాడు. 'ఈ రోజు మధ్యాహ్నం 2 గంటల వరకు ఆమె ఏమీ తినలేదు. 'నన్ను ఇంటికి తీసుకెళ్లండి, నేను ఇంటికెళ్లాలి!' అని ఒకటే గొడవ చేసింది.

• • •

నాలుగు రోజుల తరువాత, ఆర్టికల్ 370ను రద్దు చేయడం మీద శ్రీనగర్‌లోని షేర్-ఎ-కాశ్మీర్ స్టేడియంలో ఆగస్టు 15న జరిగిన స్వాతంత్ర్య దినోత్సవ కవాతుకు హాజరయ్యేందుకు వచ్చిన బుద్గాంకు చెందిన 33 ఏళ్ల పాఠశాల ఉపాధ్యాయుడు జాన్ మొహమ్మద్ ఒక్కటే నేను విన్న ఏకైక సయోధ్య స్వరం. ఎక్కడ చూసినా ఎంతో అభద్రత ఉంది. విద్యావంతులైన యువత కూడా ప్రభుత్వ సేవల్లోకి రావాలని కోరుకుంటున్నారు, ఎందుకంటే వాళ్లు ఇప్పుడు జాతీయ స్థాయిలో పోటీ పడవలసి ఉంది' అని ఆయన నాకు చెప్పారు. 'భూమికి కొంత భద్రత కల్పిస్తూ ఉద్యోగాల భద్రతని కల్పించడంలో ఒక సవరణ తీసుకురావాలి. అయితే ఇప్పటి నుంచీ కేంద్ర ప్రభుత్వం ఏం చేసినా, ఇప్పుడు కశ్మీర్ వ్యాలీ ప్రజల విశ్వాసాన్ని పొందడం మాత్రం అసాధ్యం,' అన్నాడు. కాశ్మీర్‌లో 2016లో బుర్హాన్ వాని చంపబడినప్పుడు, కోపంతో కశ్మీర్ జనం ఊగిపోయారు. ముఖ్యంగా దక్షిణ కాశ్మీర్‌లో పెద్ద ఎత్తున క్రూరమైన హింస చెలరేగినందుకు నిరసనలు జరిగాయి. ఈ విధమైన ప్రతిచర్యనే ఆశిస్తున్నట్లుగా మొదటిసారిగా ఉగ్రవాద ఛాయలు బయటపడగానే భారతదేశం అత్యధిక సంఖ్యలో శక్తులను మోహరించింది. ఆర్టికల్ 370ను సమర్థవంతంగా రద్దు చేయడం కశ్మీర్‌ను తమ మనుగడకు సంబంధించిన విషయంగా భావిస్తున్నందున వాళ్ల భూమి, మతం, సంస్కృతి, అస్తిత్వాల్ని అంతులేని సంక్షోభంలోకి నెట్టివేసింది. ఇప్పుడు కశ్మీరీలు తమ ప్రతిస్పందనని అంచనా వేసుకుంటున్నారు. ప్రతీదీ వ్యూహాత్మకంగానే ఉంటుంది. స్టేట్ పవర్‌ని వెంటనే ఎదుర్కోవడం అంత తెలివైన పని కాదని వాళ్లు భావిస్తున్నట్లు అనిపిస్తుంది. దక్షిణ కశ్మీర్‌లోని షోపియాన్‌ని ఇటీవల సందర్శించిన ఒక శ్రీనగర్ నివాసి, గత వారం బైక్‌లపై ఉగ్రవాదుల బృందం పింజురా గ్రామానికీ, జైన్‌పురాకీ వచ్చిందని చెప్పాడు. వాళ్లు ప్రజల్ని ప్రశాంతంగా ఉండమని కోరారట. గొడవలకి దిగితే అంతూ పొంతూ లేకుండా పోరాటాలు సాగుతూనే ఉంటాయి కాబట్టి భద్రతా దళాలతో గొడవ పడవద్దని చెప్పారట. ఇలాంటి సమయంలో, అర్థవంతమైన ప్రతిఘటన అంటే ఏమిటో తెలుసుకోవడానికి కొంత సమయం పడుతుంది, కానీ ప్రతిఘటన ఉంటుంది,' అని ఒక సీనియర్ పాత్రికేయుడు నాకు చెప్పారు.

వ్యాలీలో ఫరూక్ అబ్దుల్లా, ఒమర్ అబ్దుల్లా, మెహబూబా ముఫ్తీ వంటి భారత అనుకూల రాజకీయ నాయకుల్ని పూర్తిగా పక్కకి తోయడం, నోరెత్తకుండా చేయడం అతిపెద్ద చర్చనీయాంశంగా మారింది. ఈ నాయకులు, పార్టీల కారణంగానే పాకిస్తాన్ అనుకూల, ఆజాదీ అనుకూల లాబీ ఇన్నేళ్లుగా విజయవంతం కాలేకపోయింది. 70 ఏళ్లుగా వేర్పాటువాదులు సాధించలేనిది, బీజేపీ ప్రభుత్వం ఒకే దెబ్బలో సాధించింది. ఈ భారత అనుకూల రాజకీయ నాయకులు ఆజాదీ, పాకిస్తాన్ మనోభావాల్ని వ్యతిరేకించారు,' అన్నాడు ఒక జర్నలిస్ట్ నాతో.

లోయలో ఒక సాధారణ భావన ఏమిటంటే, ఆర్టికల్ 370ను రద్దు చేయడం ఆజాదీ కోసం పోరాడుతున్నవారికి సంబంధించినది కాదు, ఎందుకంటే వాళ్లు భారత రాజ్యాంగాన్ని ఎన్నడూ విశ్వసించలేదు, ఇది భారతదేశానికి అనుకూలంగా మెలిగిన నాయకుల బాధ్యత. భారత నాయకత్వాన్ని ఇక్కడ ముగించినందుకూ, పాకిస్తాన్‌కి అనుకూలంగా ప్రవర్తించినందుకూ కొంతమంది కశ్మీరీలు అజిత్ దోవల్‌ని ఒక ఐఎస్ఐ ఏజెంట్ అని చమత్కరించారు' అని ఒక జర్నలిస్ట్ చెప్పారు. జాతీయ భద్రతా సలహాదారు అయిన దోవల్ లోయలో పరిస్థితిని నిశితంగా పరిశీలించారు. మిడిల్ గ్రౌండ్ పూర్తయింది. 'యథాతథ స్థితి' ముగింపు కశ్మీర్‌కు మంచి సంకేతం. ఇప్పుడు ఏదో ఒక పరిష్కారం ఉంటుంది,' అని చెప్పాడతను.

అయితే, బీజేపీ ప్రభుత్వం కొత్త నాయకుల్ని వెలుగులోకి తెస్తుందని కశ్మీరీలు అనుమానిస్తున్నారు. 'మీర్ జునైద్, ఇంకా పేరు ప్రసిద్ధులు లేని వ్యక్తులందరి ఫోన్లూ ఇప్పుడు పనిచేస్తున్నాయి. ఇది చాలా అత్యున్నత స్థాయిలో జరుగుతోంది. వచ్చే ఎన్నికలకి భారతదేశం కోసం ర్యాలీ చేసే చిన్నా చితకా రాజకీయ నాయకులు ఇప్పటికీ ఉన్నారు. కానీ కొత్త నాయకత్వం సిద్ధం చేయబడిందనే విషయంలో నాకు మంచి అవగాహన ఉంది. ఆర్టికల్ 370 పై మోడీ చేసిన ప్రసంగం దానికి నిదర్శనం. ఆయన చెప్పారు 'వంశపాలన అంతమైంది, కొత్తవాళ్లు వస్తున్నార' ని ఒక సీనియర్ జర్నలిస్ట్ నాకు చెప్పారు.

మాజీ భారత అడ్మినిస్ట్రేటివ్ సర్వీసెస్ ఆఫీసర్, రాజకీయవేత్త షా ఫేసల్ పేరును భారత అనుకూల నాయకత్వాన్ని రిప్లేస్ చేయడానికి తగిన అభ్యర్థిగా అనేకమంది పేర్కొన్నారు. 'ఫరూక్ అబ్దుల్లా తర్వాత ఆయనే' అని సౌరాలోని ఒక యువకుడు చెప్పాడు. మరో సీనియర్ జర్నలిస్ట్ కూడా ఆ మాటని అంగీకరించారు. 'ఆర్టికల్ 370, 35ఏ రద్దయిపోయాయి. ఇప్పుడున్న వ్యవహారాల్లో ఏదీ వెనక్కి తిరిగి తీసుకురాబడదు. ఇప్పుడు వారు ఆశించగలిగిందీ, పోరాడగలిగిందీ కేవలం స్టేట్‌హుడ్ కోసమే. బిల్లు 38 పేజీల పత్రంలో దాని కోసం ఒక తలుపు తెరిచి ఉంచబడింది. షా ఫేసల్ ఏమి మాట్లాడుతున్నారో మీరు పరిశీలిస్తే, ఈ రకమైన పరిస్థితినీ, సందర్భాన్నీ వ్యవహరించడానికి సంసిద్ధం చేయబడిన పాత్ర పోషణకి ఆయన సన్నద్ధమవుతున్నట్లుగా ఉంది. షా ఫేసల్ పబ్లిక్ సేఫ్టీ యాక్ట్ క్రింద అదుపులోకి తీసుకున్నట్టు నివేదించబడినా, చాలా మంది అది ఈ రాజకీయ శూన్యత ఆవరించిన ఈ వాతావరణంలో

భారతదేశం అతన్ని హీరోగా నిలబెట్టడానికి చేసిన ప్రయత్నమేనని నమ్ముతాను. జమ్ములో డీలిమిటేషన్ తర్వాత సీట్లు పెంచడం ద్వారా బీజేపీ ప్రభుత్వం హిందూ ముఖ్యమంత్రిని తీసుకువస్తుందని భావించేవాళ్లు కూడా ఉన్నారు,' అని ఆయన నాకు చెప్పారు.

ప్రతిఘటన ఏదో విధంగా తీవ్రంగానే ఉంటుంది, కానీ చాలా వరకు పాకిస్తాన్ ఏం చేస్తుందో చూసుకుని దానిపై ఆ తీవ్రత ఆధారపడి ఉంటుంది. ప్రజలు నిజానిజాలు తెలుసుకునే ఆధారాల కోసం పాకిస్తాన్ టీవీ ఛానెళ్లను చూస్తున్నారు. 'కశ్మీర్ సమస్య వివిధ మార్గాల్లో ఇంటర్నేషనల్ వార్తగా మారింది' అని భద్రతా విశ్లేషకుడు నాతో అన్నారు. 'యూఎస్, పాకిస్తాన్‌కి ఇది ఇలాగే జరుగుతుందని ముందే ఊహించి ఉండవచ్చు. 40 వేల మంది ఉగ్రవాదులు తిరిగి ఇళ్లకి చేరుకుంటే తాను ఎలా చూసుకుంటారో ఆ విషయాలన్నీ ఇమ్రాన్ ఖాన్ చెప్తుంటే, తమాషాగా తోచింది. బహుశా అతనికి ఈ విషయం ముందే తెలిసి ఉండొచ్చు. అందుకే ఒక రకంగా భారతదేశాన్ని హెచ్చరిస్తున్నట్టే ఈ మాట అని ఉండాలి. ఆర్టికల్ 370 క్రింద కశ్మీర్ ప్రత్యేక హోదాని రద్దు చేయడానికి రెండు రోజుల ముందు హిజ్బుల్ ముజాహిదీన్ కమాండర్ రియాజ్ నాయక్ విడుదల చేసిన ఆడియో క్లిప్ మెసేజ్‌లో భారతదేశం నిరాశకి లోనవడం వల్లే ఇలాంటి చర్యలకు పాల్పడుతోందని చెప్పాడు. భారతదేశానికి అనుకూలంగా రాజకీయ నాయకుల్ని వాడుకుని దూరం పెట్టినట్టుగానే తనకు కూడా దూరం పెట్టవచ్చునీ, అందువల్ల తనకు మద్దతు ఇవ్వమనీ ఆయన కశ్మీర్ పోలీసులకు విజ్ఞప్తి చేశారు.

దిగువ, మధ్యస్థ స్థాయిల్లో ఉన్న కశ్మీర్ పోలీసులకి ముఖ్యంగా, ప్రభుత్వం తమని నిరాయుధులను చేయడం చాలా అవమానంగా ఉంది. అందుకు వాళ్లు బాగా కోపంగా ఉన్నారు. 'ఇక్కడ అంతర్యుద్ధం జరిగే పరిస్థితి ఉంది,' అని వ్యాఖ్యానించారు ఒక సీనియర్ జర్నలిస్ట్. 50మందిని పికప్ చేసుకురమ్మంటే ఆ ఆదేశాలను పాటించటానికి ఇద్దరు ఎస్‌హెచ్ఓ (సీనియర్ హౌస్ ఆఫీసర్) లు నిరాకరించారు. ఇలాంటి ఉదంతం నేనెన్నడూ వినలేదు. సమీపంలోని మరో ఎస్‌హెచ్ఓ 50 మందిని పికప్ చేసుకొచ్చి అప్పగించాడు. కశ్మీరీ బ్యూరోక్రసీ కూడా చాలా కోపంతో మండిపడుతోంది, కానీ ఏం చేయాలో తెలియని ఒక మొద్దుతనం ఆవరించి ఉంది వాళ్లని. ఇప్పుడు వాళ్లు విడిచిపెట్టి వెళ్తే తిరుగుబాటుదారులనే ముద్ర పడుతుంది. సరిగ్గా వ్యవహరించడం తెలియకపోతే, అమిత్ షా నుంచీ, మోదీ నుంచీ తమని ఎవరూ కాపాడలేరనే సెంటిమెంట్ వాళ్లలో బలంగా పాతుకుపోయింది. దాంతో భవిష్యత్తులో ఎప్పుడో ఒక సందర్భంలో విస్ఫోటన చెందేందుకు ఆ వాతావరణంలో మరింత ప్రెషర్ పెరుగుతోంది. కానీ ఆ విస్ఫోటన ఎప్పుడు జరుగుతుందనేది మాత్రం ఎవరికీ తెలియదు. కానీ కశ్మీరీలు మాత్రం దీర్ఘకాలిక పోరాటం కోసం సమాయత్తమవుతున్నారు. కానీ ఈ క్వాలిటీ, ఈ కోపాన్ని ప్రకటించే తీరు మాత్రం చాలా వైవిధ్యంగా ఉండబోతున్నాయి,' అన్నారాయన నాతో. ❁

(కారవాన్ పత్రిక నుండి)




## కర్ఫ్యూ విధించు

-అమ్జద్ మజీద్

అనువాదం: ఎన్. వేణుగోపాల్



వీథుల్లో కర్ఫ్యూ విధించు
బళ్లలో, మా ఇళ్లలో
కర్ఫ్యూ విధించు
వార్తల మీదా
వార్తాపత్రికల మీదా,
రేడియోల మీదా
ఇంటర్నెట్ మీదా
టెలివిజన్ ఛానళ్ల మీదా
కర్ఫ్యూ విధించు
మా మాటపై కర్ఫ్యూ
మా కదలికలపై కర్ఫ్యూ
మా నిరసనలపై కర్ఫ్యూ
మా శోకాలపై కర్ఫ్యూ
మా దుస్థితిపై కర్ఫ్యూ విధించు
సత్యంపై కర్ఫ్యూ విధించు
రాత్రిపై కర్ఫ్యూ విధించు
స్వేచ్ఛపైననే కర్ఫ్యూ విధించు
నువు విధించగలిగితే
నీకా ధైర్యం ఉంటే
ఆశ మీద కర్ఫ్యూ విధించు
బతుకు మీద కర్ఫ్యూ విధించు
అయినా సరే
మాలో ఒక్కరి మరణమైనా
నిన్ను భయబీభత్సంలో ముక్కలు చేస్తుంది
మృత్యువెటునుంచి వస్తుందో అని
భీతిల్లిపోతావు
కాని భయపడకు
ఒకానొక రోజు
ఏదో ఒకరోజు
మేమే నిన్నా భయం నుంచి విముక్తి చేస్తాం ❁

కారాగారంలో కశ్మీర్

# వెండితెరపై కశ్మీర్ జీవితాల చిత్రణ!




బాలాజీ (కోల్‌కతా)

కశ్మీరీ సామాన్యుడి జీవితాన్ని కన్నెత్తైనా చూడకుండా, కశ్మీర్ సమస్యపై జాతీయ అవార్డు సినిమా ఎలా తీయవచ్చో నిరూపించాడొక దర్శకరత్నం. అగ్నిగుండం లాంటి సమస్యని 'రోజా' పువ్వంత సుకుమారంగా హ్యాండిల్ చేశాడు. సినిమాలోని ఆ రోజాకు టీ ఆఫర్ చేసే పోలీసధికారులుంటారు, ఎల్లవేళల్లోనూ సహకరించే ఆర్మీ మేజర్లుంటారు. పౌరురాలి విన్నపాన్ని సానుకూలంగా వినే మంత్రులుంటారు. అంతా సవ్యంగానే వుంటుంది. టెర్రరిస్ట్‌ల బెడద తప్ప! చివరకు తనకూ మనసుందని రుజువు చేసుకుంటాడు ఒక 'ముస్లిం' టెర్రరిస్ట్!

గతంలో 'కాశ్మీర్ కీ కలీ', 'ఆర్జూ' వంటి హిందీ సినిమాలన్నీ కశ్మీర్ అందాల్ని జుర్రుకున్నాయి తప్ప అక్కడ జనాలుంటారనీ, వారి జీవితాలకు సుఖదు:ఖాలుంటాయనీ పట్టించుకోలేదు. అప్పట్లో డిఫరెంట్‌గా వచ్చిన సినిమా కూడా, ఇండియన్ ఆర్మీ కోసం క్రిప్టాలజిస్ట్‌గా పనిచేస్తున్న కుర్రాడి ప్రేమ కథనే చెప్పుకొచ్చింది. 'యహ' లాంటి సినిమాల నుండి మొన్నటి 'నోట్ బుక్' వరకూ ఈ తరహా సినిమాల్లో ఈ ట్రెండే నడిచింది. మరోవైపు ఇంకొంత అసభ్యంగా ఇండియన్ మీడియాలానే కశ్మీర్‌నూ, కశ్మీర్ ప్రజలనూ స్టీరియోటైపుగానూ, అంతకంటే మరింత భయంకరంగానూ చూపే బాలీవుడ్ సినిమాలు వచ్చాయి. కశ్మీరీలంటే ఆర్మీపై రాళ్లు రువ్వేవాళ్లు లేదా టెర్రరిస్ట్‌లు లేదా వారికి మద్దతు ఇచ్చేవారు అన్న కథనాలే ప్రధానంగా నడిచాయి ఈ సినిమాల్లో. 'దూద్ మాంగోగే తో ఖీర్ దేంగే, కాశ్మీర్ మాంగోగే తో చీర్ దేంగే' (పాలు కోరితే పాయసమిస్తాం, కాశ్మీర్ అడిగావో, చీరేస్తాం) తరహా పతాకస్థాయి అసభ్యకర డైలాగుల్లో ఇండియా-పాకిస్తాన్ తగాదా కనిపిస్తుంది తప్ప కశ్మీరోడి పట్టింపు వుండదు. కశ్మీరు మనదైతే కశ్మీరీలు కూడా మనవాళ్లన్న స్పృహ మనకుండాలి. కానీ, అందుకు భిన్నంగా సాధారణ కశ్మీరీల పట్ల భారతీయుల వైఖరి ఎలా వుందో పుల్వామా తదనంతర కాలంలో కశ్మీరీ విద్యార్థులపై జరిగిన దాడులే స్పష్టం చేశాయి. ఈ వైఖరి వారికీ, మనకీ మధ్య అగాధాల్ని పెంచుతోంది.

2014 లో 'హైదర్' చిత్రం వచ్చిన హిందీ వ్యాపార సినిమాల కథనాలకు భిన్నంగా లేకపోయినా ఇందులో ప్రత్యక్ష సాయుధ దళాల ప్రత్యేక అధికార చట్టాన్ని (ఆఫ్‌స్పా) విమర్శించాడు దర్శకుడు విశాల్ భరద్వాజ్. మిలటరీ ద్వారా అపహరించబడ్డ తన తండ్రి కోసం వెతుకులాడుతున్న కథానాయకుడి కోసం ఒక పాటను కేటాయించడం గమనించదగ్గ అంశం. ఈ 'ఝీలం' నదిలో కొట్టుకుపోయిన అనామక శవాలెన్నో అన్న విధంగా పాట సాగుతుంది. తమ పరిజనుల ఫొటోలను పట్టుకుని ప్రదర్శనలు జరుపుతున్న కశ్మీరు బాధితులను చూపడం కూడా కమర్షియల్ సినిమా విషయంలో ఒక సాహసమే అని చెప్పాలి. ఇది కశ్మీర్ నేపథ్యంలో షేక్స్‌పియర్ 'హేమ్లెట్' అనుకరణ. కశ్మీరును మానవీయ కోణంలో చూపే చిన్న బడ్జెట్ సినిమాలు కొన్ని వచ్చాయి ఇటీవలి కాలంలో. 2010లో 'హరూద్' (శరదృతువు) సినిమా వచ్చింది. కథ విషయానికొస్తే, రఫీక్ కుటుంబం పాకిస్తాన్ – ఇండియా బార్డర్‌కు దగ్గర్లో నివసిస్తోంది. రఫీక్ అన్నయ్య తారీక్ మిలటరీ ద్వారా నాలుగేళ్ల క్రితం అపహరించబడ్డాడు. బహుశా చనిపోయి వుంటాడు. కానీ ఆ సంగతిని జీర్ణంచేసుకోలేక పోతున్న తల్లి పెద్దకొడుకు ఎప్పటికైనా తిరిగొస్తాడని ఎదురుచూస్తూ వుంటుంది. రఫీక్ ముళ్ల కంచెను దాటి పొరుగు దేశానికి వెళిపోతాననుకుంటాడు. కానీ అతడ్ని అతని తండ్రి శ్రీనగర్ తీసుకొచ్చేస్తాడు. రఫీక్‌కి యాదృచ్ఛికంగా తన అన్నయ్య కెమేరా దొరుకుతుంది. అందులోని ఫోటోలను డెవలప్ చేయిస్తాడు. ఆ ఫొటోలు అతడి జీవితానికొక దిశానిర్దేశం చేస్తాయి. ఇంతలో మిలటరీ గుండు మరొకర్ని బలిగొంటుంది. రఫీక్ తండ్రి మానసిక స్థిరత్వం దెబ్బతింటుంది. ఇరాన్ సినిమాలా సాగే ఈ సినిమా కశ్మీరును వాస్తవానికి కొంత దగ్గరలో చిత్రించింది. ఇది నటుడు ఆమీర్ బషీర్ దర్శకత్వంలో వచ్చిన మొదటి సినిమా. కశ్మీర్‌పై నిర్మితమైన కథా చిత్రాల్లో మరో చెప్పుకోదగ్గ మంచి సినిమా 'జీరో బ్రిడ్జ్' (2012). నిర్మాణపరంగా లోపాలున్నా, నటీనటులు కొత్తవాళ్లు కావడం వలన లోపాలువున్నా, ఇది రొటీను బాలీవుడ్ సినిమాలకు భిన్నంగా వున్న మంచి సినిమా. గత రెండేళ్లలో కొన్ని లోబడ్జెట్ మంచి సినిమాలు వచ్చాయి. వాటి గురించి కొంచెం వివరంగా చూద్దాం.

**1. విడో ఆఫ్ సైలెన్స్ (2018) :** కశ్మీరులో మిలటరీ అర్ధరాత్రి పూట ఎత్తుకుపోగా శాశ్వతంగా 'మిస్సింగ్' లిస్టులోకి చేరిపోయే అమాయకులెందరో! తమ భర్తల జాడ తెలీక ఏళ్ల తరబడి గవర్నమెంటు ఆఫీసుల చుట్టూ తిరిగే వారిని 'హాఫ్ విడో'లంటారు.




11 ఏళ్ల పాప, అనారోగ్యంతో బాధపడే అత్తతో బ్రతుకీడ్చుతూ వారానికోరోజు రిజిస్ట్రారాఫీసు చుట్టూ తిరిగే ఒక హాఫ్ విడో కథ ఈ సినిమా. కనీసం భర్త డెత్ సర్టిఫికేట్ అయినా ఇప్పించండని ప్రాధేయపడుతుంది. హోటల్లో ఒక రాత్రి తనతో గడిపితే సర్టిఫికేట్ ఇస్తానంటాడు రిజిస్ట్రారాఫీసరు. నిరాకరించిన ఆమెపై కక్ష సాధిస్తాడు. బ్యాంకుకు వెళితే ఆమె చనిపోయినట్టు ప్రకటించే దస్తావేజులు రిజిస్ట్రారాఫీసు నుండి అందాయనీ, బతికున్నట్టు లైఫ్ సర్టిఫికేట్ జమకడితేనే డబ్బు విత్‌డ్రా సాధ్యమనీ బ్యాంకు వాళ్లు చెబుతారు. బతికున్నా ఇక చచ్చినట్టే! 'నన్ను కాదన్నావ్, ఇక బతికినన్నాళ్ళూ లైఫ్ సర్టిఫికేట్ కోసం తిరుగు' అని సవాలు చేస్తాడు ఆ ఆఫీసురు. చివరికి ఆమె లొంగుతుంది. చెప్పిన హోటలుకి వెళుతుంది. హోటల్ గదిలో ఆ అధికారిని హత్య చేస్తుంది. ఇప్పుడు చట్టం ముందు చిక్కు ప్రశ్న. ఆల్రెడీ చనిపోయిన వ్యక్తి వేరొకర్ని చంపగలదా? కశ్మీరులో వందల కొలది అనామక శవాలను పాతిపెట్టిన స్థలాలు బయటపడ్డాయనీ, అమాయకుల్ని చంపి టెర్రరిస్టులను చంపామని లెక్కచూపితే ప్రమోషన్లు రావడం వలన ఇటువంటి 'మిస్సింగు' ఉదంతాలు ఎక్కువయ్యాయనీ, తను టూరిస్టుగా వెళ్లి సీక్రెట్‌గా సినిమా తీశాననీ దర్శకుడు ప్రవీణ్ మొర్చాలే కోల్కతా అంతర్జాతీయ ఫిలిం ఫెస్టివల్ స్క్రీనింగ్ అనంతరం ఈ సమీక్షకుడికి ఇష్టాగోష్టిలో చెప్పాడు. ఈ సినిమా ఈ చిత్రోత్సవంలో భారతీయ భాషల విభాగంలో ఉత్తమ సినిమా అవార్డు గెల్చుకుంది.

**2. హమీద్ (2019):** ఎనిమిదేళ్ల హమీద్ తల్లి ఇష్రత్ మరో హాఫ్ విడో. నాన్న ఎక్కడ అనడిగిన పిల్లాడికి 'దేవుడి దగ్గరకు వెళ్ళాడు' అని చెప్పి సమాధానపరుస్తుంది. దేవుడి ఫోన్ నెంబర్ ఏమిటని ఒక మతగురువును అడుగుతాడు హమీద్. '786' అని చెబుతాడు మతగురువు. ఆ నెంబరుకు చాలాసార్లు ఫోన్ కలుపుతాడు. ఓ రోజు అవతలి ఫోన్ రింగవుతుంది. 'హలో' చెబుతాడు అభయ్ అనే ఒక సీఆర్‌పీఎఫ్ జవాను. కశ్మీర్‌ను మిగతా భారతదేశపు దృష్టితో చూస్తున్నవాడే అభయ్ కూడా. 'ఆజాదీ' అని చేసే ప్రతి నినాదమూ పాకిస్తాన్ ప్రేరిత ఉగ్రవాదమేనని నమ్మి భారత సైన్యం తరుపున యుద్ధం చేస్తున్నాడతడు. సెలవు కూడా మంజూరు కాని స్థితిలో సొంతింటికి వేల మైళ్ల దూరంలో వున్నాడు.

'మీరు అల్లానా?'- హమీద్.

'అల్లాకు ఫోన్ చేశావుగా? అయితే అల్లానే! చెప్పు' - అభయ్.

'మా నాన్న మీ దగ్గర ఉన్నాడుగా?' - హమీద్.

కశ్మీర్ మొత్తం తనను అమాయకంగా ప్రశ్నించినట్టనిపిస్తుంది అభయ్‌కి. ఒకరి గురించి మరొకరికి పట్టని రెండు వేర్వేరు ప్రపంచాలు సంభాషించుకుంటాయి. కశ్మీరుకీ, మిగతా భారతానికీ మధ్య ఏనాడో జరగాల్సిన ఈ సంవాదాన్ని దర్శకుడు ఐజాజ్ ఖాన్ ఇరాన్ సినిమాల మాదిరిగా, చిన్నపిల్లల దృక్కోణంలో ప్రారంభిస్తాడు.

అసలు మాజిద్ మజిది వంటి ఇరాన్ దర్శకులు చిన్న పిల్లల కథల ద్వారానే పెద్ద వారికీ, దేశాధినేతలకూ సందేశం ఇవ్వాలని ఎందుకనుకుంటారు? దీని వెనుక కథ వుంది. 1979లో ఇరానియన్ విప్లవం జరిగింది. షా మొహమ్మద్ ఓడిపోయాడు. ఆయతుల్లా ఖుమేనీ అనే సనాతనవాది రాజ్యాధికారంలోకి వచ్చాడు. అతడికి సినిమాలంటే ఇష్టమున్నా సినిమాల కోసం చాలా కట్టుదిట్టమైన సెన్సార్ నియమాలు ప్రవేశపెట్టాడు. అంచేత ప్రగతిశీల ఇరాన్ దర్శకులు మార్గాంతరం యోచించి, చిన్నపిల్లల ఇతివృత్తాలతో ఇరాన్ సమాజాన్నీ, రాజకీయాల్నీ పరోక్షంగా విమర్శిస్తున్నారు. (ప్రత్యక్షంగా విమర్శించే జాఫర్ పనాహీ లాంటి వాళ్లు అంక్షలూ, నిర్బంధాలూ ఎదుర్కొంటున్నారు.) మనదేశంలో కశ్మీరును కొంత వాస్తవంగా చూపాలనుకునే దర్శకుల సంగతీ అలానే వుంది. ఉదాహరణకి అశ్విన్ కుమార్ అనే దర్శకున్నే తీసుకుందాం. కశ్మీరును నిశితంగా పరిశోధిస్తూ గతంలో రెండు డాక్యుమెంటరీలు తీశాడు. ఒకటోది 'ఇంషాల్లా ఫుట్బాల్' (2010), రెండోది 'ఇంషాల్లా కాశ్మీర్' (2012). చాలా రిస్కుతో కశ్మీర్ ఫుట్బాల్‌ను చిత్రిస్తున్న వ్యక్తిలా సాధారణ కశ్మీరీలతో, గ్రామీణులతో, రాజకీయవేత్తలతో, హాఫ్ విడోలతో, లోయను విడిచివచ్చిన, విడిచిరాని కశ్మీరీ పండిట్లతో, చిత్రకారులతో, టెర్రరిస్ట్‌లతో, సరెండర్ అయ్యాక ఇంఫార్మెర్లుగా మార్చబడ్డ వారితో, డబల్ ఏజెంట్లతో మాట్లాడి వారి ఇంటర్వ్యూలతో ఈ సినిమాలు తయారుచేశాడు. సెన్సార్ ఈ రెండింటినీ మొదట్లో అడ్డుకుంది. విడుదలైన తర్వాత అదే భారత ప్రభుత్వం జాతీయ అవార్డులు ప్రకటించింది. ఈయన తీసిన మరో సినిమా 'లిటిల్ టెర్రరిస్ట్'



(2004) ఆస్కార్‌కి నామినేట్ అయింది. కశ్మీర్ నేపథ్యంలో అశ్విన్ కుమార్ తీసిన తాజా సినిమా 'నో ఫాదర్స్ ఇన్ కాశ్మీర్'.

**3. నో ఫాదర్స్ ఇన్ కాశ్మీర్ (2019):** 'నో ఫాదర్స్ ఇన్ కాశ్మీర్' కోసం కూడా సెన్సార్‌తో పది నెలల యుద్ధం చేయాల్సి వచ్చింది




దర్శకుడికి. చాలా నరికివేతల తర్వాత, సంభాషణల తొలగింపు తర్వాత సినిమాను విడుదల చేశారు. ఇలాంటి సినిమాలకు హాళ్లు కేటాయించరు. ఒకటి రెండు హాళ్లిచ్చినా అసదుపాయకరమైన టైమింగ్‌లు పెట్టి సినిమాను ఎవరూ చూడకుండా అడ్డుపడతారు. ఈ సినిమా ఇంగ్లీష్-హిందీ-ఉర్దూ భాషల్లో సాగుతుంది.

కశ్మీర్లో పుట్టి, బ్రిటన్లో ఉంటున్న పదహారేళ్ల ముస్లిం యువతి నూర్ (జారా వెబ్). తను కశ్మీర్ వెళుతున్నట్టు తన లండన్ మిత్రుడికి చెబుతుంది. 'అయితే అక్కడొక టెర్రరిస్ట్‌తో కూల్‌గా సెల్ఫీ తీసుకుంటే భలేగా వుంటుంది. ట్రై చెయ్. కశ్మీర్ నిండా టెర్రరిస్ట్‌లు వుంటారు. అల్కైదా, తాలిబాన్, ఐసిస్ ఎవరైనా దొరుకుతారు' – ఆ ఫ్రెండ్ నూర్‌కు ఉసిగొల్పుతాడు. నూర్ తల్లి జైనాబ్ (నటాషా మాగో). లండన్‌లో చదువుకున్న ఆమె భర్త కశ్మీర్లో మిలటరీ ద్వారా 'మిస్సింగ్' కాబడ్డాడు. లండన్‌లో ప్రస్తుతం ఇండియన్ ఫారిన్ సర్వీస్ అధికారిగా పనిచేస్తున్న వాహిద్ మీర్జా (సుశీల్ దహియా)తో తిరిగి పెళ్లి చేసుకోవాలంటే తన భర్తకు సంబంధించిన కేసు క్లోజ్ చెయ్యాలి. అతడు చనిపోయినట్టు చెప్పే పత్రాల్లో అత్తమామల సంతకాలు అవసరం. అందుకని కూతురు నూర్, వాహిద్‌లతో బయల్దేరి ఇండియా పాకిస్తాన్ బోర్డర్‌కి దగ్గర్లోని అత్తగారింటికి వస్తుంది.

సదా సరదాగా వుండే తన ఈడువాడైన మాజిద్ (శివం రైనా) అనే లోకల్ కుర్రాడు నూర్‌కి పరిచయమౌతాడు. టెర్రరిస్ట్‌తో సెల్ఫీ అన్న కోరికను అతడే తీరుస్తాడు. ముఖానికి ముసుగు వేసుకుని, పక్కనున్న సెక్యూరిటీ గార్డ్ తుపాకీతో ఫోజిస్తాడు. టెర్రరిస్ట్‌కీ, మిలిటెంట్‌కీ తేడా ఏమిటో చెబుతాడు ఆమెకి. 'మిలిటెంట్ అంటే ఆజాదీ కోసం పోరాడుతున్నవాడు, టెర్రరిస్ట్ అంటే నేరస్తుడు!' నాన్న తన చిన్నప్పుడు తమని విడిచి ఎక్కడికో వెళిపోయాడని మాత్రమే తెలుసు నూర్‌కి. కానీ అసలు విషయం ఇక్కడికొచ్చాక తెలుస్తుంది. మాజిద్ తండ్రీ, తన తండ్రీ ఒకప్పుడు మంచి స్నేహితులనీ, వారిద్దర్నీ మిలటరీ అపహరించిందనీ, ఆ తర్వాత వారెన్నటికీ తిరిగిరాలేదనీ చెబుతుంది మాజిద్ తల్లి పర్వీనా (మాయా సరావ్). ఇక తండ్రి వివరాల కోసం ఆరాటపడుతుంది నూర్.

నాన్నకు సంబంధించిన ఒక్క ఫోటో అయినా చూపమని తాతయ్య అబ్దుల్ రషీద్ (కుల్భూషన్ ఖర్బందా), నాన్నమ్మ హలీమా (సోనీ రజ్దాన్)లను ప్రాధేయపడుతుంది. తమ బిడ్డ ఫోటోలను తమ చేతులతోనే నాశనం చేశామని చెబుతారు ఆ అసహాయ వృద్ధులు. మిలిటరీ వారి అదనపు వేధింపుల నుండి కాపాడుకోవాలంటే జ్ఞాపకాల్ని చెరిపేసుకోవాలి. ఇది కశ్మీరీల వ్యధ. జ్ఞాపకాల నుండి విముక్తం కావాలనే తన తల్లి కూడా వచ్చిందిక్కడికి. కానీ నూర్ మాత్రం తండ్రి జ్ఞాపకాల గుర్తులు వెతకాలని కంకణం కట్టుకుంటుంది. ఆమెకు తనలాంటి బాధితుడు మాజిద్ దొరికాడు. నూర్, మాజిద్ల మధ్య కౌమారపు తొలిప్రేమ చిగురిస్తుంది. తమ తండ్రులిద్దర్నీ మిలటరీ వారు చంపేసి పాకిస్తాన్ బోర్డర్‌కు దగ్గరలో గల అనామక శ్మశానంలో పాతేశారని మాజిద్ పినతండ్రి అర్షిద్ లోనె (దర్శకుడు అశ్విన్ కుమార్) చెబుతాడు. చిత్రహింసలు తట్టుకోలేక తనే వారి తండ్రుల వివరాలను ఆర్మీకి అందించాననీ చెబుతాడు.

ఇండో-పాక్ బార్డర్‌కు సమీపాన తమ తండ్రుల శవాలను పాతిపెట్టిన చోటును వెతికేందుకు ఒక రాత్రి బయలుదేరుతారు నూర్, మజిద్. సీక్రెట్ ఇంటరాగేషన్ స్థలాలు, అనామక శవాల శ్మశానాలు – ఇలా కశ్మీరు గుండెల్లో దాగిన రహస్యాలెన్నో నూర్ తన మొబైల్‌లో బంధిస్తుంది. చివరికి వారిద్దరూ గస్తీ సైనికులకు దొరికిపోతారు. బ్రిటిష్ నేపథ్యం, కాబోయే సవతి తండ్రి పలుకుబడి కారణంగా నూర్ సులువుగా విడుదలవుతుంది. కానీ మాజిద్ చిక్కుకుంటాడు. అతడ్ని విడుదల చేయించందే అక్కడ్నించి కదలనంటుంది నూర్. ఆర్మీ రహస్యాల మొబైలును అప్పజెబితేనే మాజిద్‌కి విముక్తి అని షరతు విధిస్తాడు మేజర్ మనోజ్ పాండే (అంశుమాన్ ఝా). ఆమె అందించిన మొబైలు సరికొత్త చిక్కు తెస్తుంది. ఆకతాయిగా తీసిన టెర్రరిస్ట్ సెల్ఫీ మాజిద్‌కి మెడతాడుగా మారుతుంది. చివరికి అర్షిద్ ప్రయత్నంతో మాజిద్ విడుదలౌతాడు.

ఇది ఫీచర్ ఫిల్మ్ కాబట్టి కశ్మీర్ సమస్యలోని ఎన్నో కోణాలను పైపైనే తడిమాడు దర్శకుడు. నూర్ తండ్రి, మాజిద్ తండ్రి లౌకిక, ప్రజాతంత్ర కశ్మీర్ వాదులకు ప్రతీకలు. అర్షిద్ ఇస్లామిక్ సనాతన వాదానికి ప్రతినిధి. ఇతడు ఒక వైపు ఇస్లామిక్ దళం కోసం పనిచేస్తూ, మరోవైపు ఆర్మీ ఇంఫోర్మెర్‌గా డబల్ ఏజెంట్‌గా వ్యవహరిస్తుంటాడు. తన ఆశ్రయంలో వున్న గాయపడిన టెర్రరిస్ట్‌ను అప్పజెప్పి, మాజిద్ విడుదలను సాధిస్తాడు. మిలటరీ వారు ఆ టెర్రరిస్ట్‌ను ఎన్కౌంటర్లో చనిపోయినట్టు చూపి, పనిలో పనిగా మానవత్వంతో వ్యవహరించిన పంజాబీ సైనికుడ్ని ఆ ఏర్పాటుకు బలిపశువును చేస్తారు. మీడియా వారు 'అపహరించబడ్డ తండ్రుల' కోసం జరుగుతున్న జనాందోళనను ఏ మాత్రం పట్టించుకోకుండా, చనిపోయిన సైనికుడి మొహంపై కెమెరాలు ఫోకస్ చేస్తూ తమ స్వభావాన్ని నగ్నంగా ప్రదర్శిస్తారు.

'నాకొక స్పష్టమైన యుద్ధం కావాలి. శత్రువెవరో కనిపించాలి. ఇక్కడ ప్రతి గ్రామస్తుడూ శత్రువులానూ, దేశపౌరుడిగానూ కన్పిస్తున్నాడు. ఎవరితో యుద్ధం చేయాలి, ఎవర్ని కాపాడాలి?' – అని ఒక సైనికుడు చెప్పే డైలాగు కశ్మీరులోని సైనికుల అసహాయతకు అద్దం పడుతుంది. ఈ దర్శకుడి డాక్యుమెంటరీలో కూడా 'రెస్పెక్ట్ ఎవ్రీబడీ – సస్పెక్ట్ ఎవ్రీబడీ' (అందర్నీ గౌరవించు – అందర్నీ సందేహించు) అన్న మాట ఒక సైనిక స్థావరం మీద రాసుండడం గమనించవచ్చు. ఈ సినిమాలో హీరోలు, విలన్లు అంటూ ఎవరూ వుండరు. అందరూ నేటి కశ్మీర్ పరిస్థితుల్లో

అసహాయులుగా మారిన పాత్రలే. సినిమాలో జీన్ మెర్క్ సెల్వా కెమెరా పనితనాన్ని ప్రశంసించాలి. జ్ఞాపకాలు ప్రోదిచేసుకోవడం, అవసరమైతే అవే జ్ఞాపకాలను బలవంతంగా చెరిపేసుకోవడం అన్న అంశాలు కథలో, పాత్రల జీవితాలలో అంతర్లీనంగా వున్నాయి. లండన్‌లో బయలేదరినప్పటి నుండీ నూర్ ప్రతి సందర్భాన్నీ తన మొబైల్‌లో ఫోటోలు తీస్తూవుంటుంది. ఆమె ఫోటో తీసే ప్రతిసారీ సినిమా స్క్రీన్ రేషియో మొబైల్ స్క్రీన్ రేషియోకి మారిపోతూ వుంటుంది. జ్ఞాపకాలు భద్రపరుచుకున్న మొబైల్ మిలటరీ బూట్ల కింద పచ్చడయ్యే దృశ్యం ఇటీవలి కాలంలో అత్యుత్తమ ఎడిటింగ్ మచ్చుతునక అనిపిస్తుంది.

అశ్విన్ కుమార్ డాక్యుమెంటరీలే కాక కశ్మీర్‌పై వచ్చిన మరికొన్ని డాక్యుమెంటరీల గురించి చూద్దాం.

**జష్న్-ఎ-ఆజాది (2007)** (దర్శకుడు: సంజయ్ కాక్): 2007లో భారతదేశం 60వ స్వాతంత్ర్యవార్షికోత్సవాన్ని జరుపుకుంటోంది. శ్రీనగర్ లాల్ చౌక్‌లో త్రివర్ణ పతాకం ఎగురుతుండగా రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. ఈ సందర్భంలో భారత్-పాక్‌ల మధ్య సగభాగాలుగా బంధీలుగా వున్న కాశ్మీరీలకు 'ఆజాదీ' అన్న మాటకు అర్థం ఏమిటి? కాశ్మీరీలు నగరం రోడ్ల నడిబొడ్డులో విస్తరించిన ముళ్లకంచెల మధ్య, నిరంతరం నిఘావేసి తమ మధ్యలోంచి పోతూ వుండే మిలటరీ వాహనాల మధ్య, తమ 'ఆజాదీ'ని ఎలా జరుపుకుంటారు అన్న విషయాన్ని ఎన్నెన్నో కోణాల్లో విశ్లేషిస్తుంది ఈ సినిమా. 'ఆజాదీ' అన్న మాటకున్న రకరకాల అర్థాల్ని కవిత్వం, చిత్రలేఖనం, సంగీతం, సాహిత్యం, కశ్మీరు చరిత్ర, కశ్మీరీల అనుదిన జీవితం నుండి వెదికితీసే ప్రయత్నం చేస్తుంది. 2007 నుండి 2010 వరకు మూడేళ్ల శ్రమించి ఈ సినిమాను నిర్మించాడు దర్శకుడు. సినిమా ప్రదర్శనలను హిందూత్వశక్తులు పలుచోట్ల పలుమార్లు అడ్డుకున్నాయి. ఖూన్ డి బారావ్ (2012) (దర్శకురాలు: ఇఫ్ఫత్ ఫాతిమా): తొమ్మిది సంవత్సరాల ప్రయాసతో నిర్మించబడిన చిత్రమిది. బలవంతపు అదృశ్యాలకు గురైన వారి కుటుంబాల జీవితాల చెదిరిన, చెరిగిన కథలను జ్ఞాపకాల గదుల్లోంచి దొంగిలించి భద్రపరుస్తుందీ సినిమా. కశ్మీరీ మహిళల సామూహిక స్మృతిని నమోదు చేసే ప్రయత్నం ఈ సినిమా.

**ఇన్ ది షేడ్ ఆఫ్ ఫాలెన్ చినార్ (2016)** (దర్శకులు: ఫాజిల్ ఎన్.సీ., షాన్ సెబాస్టియన్): ఈ సినిమా కొందరు విశ్వవిద్యాలయ విద్యార్థులు, యువ కశ్మీరీ కళాకారుల జీవితాలను పరిశీలిస్తుంది. సంఘర్షణ మయమైన లోయలో వారి కళను ప్రేరేపించే కారకాల గురించి వివరిస్తూ, ఆ కళ ప్రతిఘటన రూపాన్ని ఎలా సంతరించుకుంటుందో వివరిస్తుంది. సోజ్ - ఎ బలాడ్ ఆఫ్ మెలడీస్ (2016)(దర్శకులు: తుషార్ మాధవ్, సార్వనిక్ కౌర్): కశ్మీరు పర్యాటకులకే కాదు, భారత, పాకిస్తాన్ పాలకులకూ స్వర్గమే. కానీ ప్రపంచంలోనే అత్యధిక మిలటరీ ఆక్రమణలో (ప్రతి 15 మంది పౌరులకూ ఒక భటుడి చొప్పున) కశ్మీరీ ప్రజల జీవితాలే నరకంలా తయారయ్యాయి. ఈ స్థితిలో జానపద, రాక్, హిప్-హాప్ పాటల ద్వారా, కర్టూన్ల ద్వారా కశ్మీర్ లోయలో అణచివేత, హింసలపై ప్రతిఘటన రూపాలను తెరకెక్కించింది ఈ సినిమా. ఈ సినిమాను




దూరదర్శన్ నిర్మించిందంటే నమ్మబుద్ధి కాదు. శుక్రవారం నిరసనల ప్రపంచం (ఇన్‌సైడ్ ఎ ఫ్రైడే ప్రొటెస్ట్) (2016) (దర్శకులు - సాహిల్ అలీ, అవలోక్ లాంగర్) (స్కూప్ వూప్, న్యూస్‌లాండ్రీల సహకారంతో రెండు భాగాలుగా వచ్చిన తాజా డాక్యుమెంటరీ): 2008 వేసవి కాలం. వివాదాస్పదమైన అమర్‌నాథ్ భూ బదిలీకి నిరసనగా పెద్ద సంఖ్యలో పౌరులు రాళ్లతో సాయుధమై వీధుల్లోకి వచ్చారు. వారిలో నలుగురు కుర్రాళ్లు (మిస్టర్ ఎ, బి, జి, ఓ) ప్రతి శుక్రవారమూ నమాజు తర్వాత డౌన్‌టౌన్ శ్రీనగర్‌లో రువ్వే ప్రదర్శనలో ఎలా పాల్గొంటారు. డాక్టర్లు, ఇంజినీర్లు కావాలనుకున్న వారూ, అయిన వారూ పరిస్థితుల రీత్యా ఎలా వుద్యమాల్లోకి ఆకర్షితులౌతున్నదీ విశ్లేషిస్తుంది ఈ డాక్యుమెంటరీ. కేవలం ఇండియన్ సెక్యూరిటీని వెక్కిరించడానికే 'ఐసిస్' జెండాను ప్రదర్శించామనీ, నిజానికి ఐసిస్ కశ్మీరులో లేనేలేదనీ చెబుతాడో కుర్రాడు. తాము విసిరే రాళ్లు సెక్యూరిటీ బలగాలపై కాదనీ, ఇండియా పాలసీపైనే అనీ మరొకడు చెబుతాడు. కశ్మీర్ సమస్యను పలుకోణాల్లో విశ్లేషిస్తుంది ఈ చిన్న డాక్యుమెంటరీ.

పోలీసులు, మిలటరీ వారు ఈ సినిమాకు ఇంటర్వ్యూ ఇవ్వడానికి నిరాకరించారు. మానస్ శంకర్ బరువా నేపథ్య సంగీతం సినిమాను మరింత ఆసక్తికరంగా మలచింది. ఒక మొత్తం జనసముదాయానికి సంబంధించిన సమస్యను దీర్ఘకాలంగా అలక్ష్యం చేయడం వల్ల, కశ్మీరీల ప్రతి ప్రజాస్వామ్య ప్రయత్నాలన్నిటినీ ఇరు దేశాలూ కాలరాయడం వల్ల రోజురోజుకీ జటిలంగా మారుతోంది కాశ్మీరు సమస్య. పాక్-ఇండియా పొట్లగిత్తల నడుమ లేగదూడలా కశ్మీరు విలవిల్లాడుతోంది. చిత్తశుద్ధి గల సినిమావాళ్లు కశ్మీరీల బాధల్ని సానుభూతితో గుర్తిస్తున్నామని సంకేతం ఇచ్చినా, అవతలి వారికి ఎంతో ఊరట కలిగి సమస్య సమాధానం దిశగా ఒక ముందడుగు వేసే పరిస్థితి ఏర్పడుతుంది. కానీ ఇప్పుడు అందుకు విరుద్ధంగా జరిగింది. ఆర్టికల్ 370 రద్దయిన తర్వాత కొందరు రాజకీయ నేతలకు కశ్మీరులో భూమి కొనుగోలుపై, కశ్మీరీ అమ్మాయిల్ని పెళ్లాడటంపై ఆశ పెరిగింది. ఈ పురుష వాంఛ ప్రకోపం తీరేలోగా, కశ్మీరు సమస్య పరిష్కారానికి ముందు ఇంకెంత రక్త చరిత్ర మిగిలివుందో! ✿

# కశ్మీర్ ప్రజలకు సంఘీభావం ప్రకటించండి

కవితాకృష్ణన్

అనువాదం : కరుణాకర్



1947 నుండి కశ్మీర్‌కు అంతర్గత పాలనా వ్యవహారాల్లో స్వయం ప్రతిపత్తి, ప్రత్యేక రాజ్యాంగంతో కూడిన ప్రత్యేక హోదాను కల్పించే ఆర్టికల్ 370ను భారత ప్రభుత్వం ఆగస్ట్ 5న రద్దు చేసింది. ప్రధాని నరేంద్రమోడీ జాతినుద్దేశించి చేసిన తన నలభై నిముషాల ప్రసంగంలో కశ్మీర్ స్వయం ప్రతిపత్తి రద్దు ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుందని, ఇస్లామిక్ ఉగ్రవాదాన్ని నిర్మూలిస్తుందని ప్రకటించడం ద్వారా బీజేపీ హిందూ జాతీయవాదాన్ని, నయా ఉదారవాద ఎజెండాని అద్భుతంగా మేళవించాడు.

ఆర్టికల్ 370 రద్దుకు బలప్రయోగం చేయవలసి వచ్చింది. ఆగస్ట్ 5 నుండి భారత ప్రభుత్వం పారామిలటరీని దించడం ద్వారా ఇంటర్నెట్ టెలిఫోన్ సర్వీసులను నిలిపి వేయడం ద్వారా కశ్మీర్‌కు ప్రపంచంతో సంబంధాలు తెంచి వేసింది. కశ్మీర్ ప్రస్తుత పరిస్థితి గురించి, కశ్మీర్లో తన అనుభవాన్ని గురించి ప్రముఖ భారతీయ మహిళా ఉద్యమకారిణి, కశ్మీర్ నిజనిర్ధారణ కమిటీ సభ్యురాలు కవితా కృష్ణన్‌తో జాకోబిన్ పత్రిక విలేఖరి, కార్యకర్త తితి భట్టాచార్య మాట్లాడారు.

**కశ్మీర్ ప్రస్తుత సంక్షోభ మూలాలు తెలియని పాఠకుల కోసం, 'ఇలాంటి పరిస్థితి ఎలా వచ్చింది? బ్రిటీష్ వలసవాదం ఎలాంటి పాత్ర పోషించింది?' అనే విషయాలు చెప్పండి.**

ఉపఖండంలోని చాలా సమస్యలలాగానే, సుదీర్ఘమైన జమ్మూ కశ్మీర్ సమస్య మూలాలు కూడా బ్రిటీష్ వలస పాలనలోనే ఉన్నాయి. స్వాతంత్ర్యంతో పాటు రక్తసిక్తమైన దేశ విభజన, హిందూ ముస్లిముల మతకలహాలు వెన్నంటే వచ్చాయి. సరిహద్దు వెంబడి ఉన్న ముస్లిం మెజారిటీ ప్రాంతాలను పాకిస్తాన్‌లో చేర్చారు.

స్వతంత్రంగా ఉండేందుకు లేదా కొత్త ఏర్పడిన రెండు దేశాలలో ఏదో ఒక దానిలో చేరేందుకు చాలా రాష్ట్రాలకు అవకాశం ఇచ్చారు. జమ్మూ కశ్మీర్ అలాంటి రాజాస్థానాలలో ఒకటి. దాని భౌగోళిక స్థితి వల్ల, మెజారిటీ ప్రజలు ముస్లిములు అయినందువల్ల సహజంగానే అది పాకిస్తాన్‌లో కలిసేందుకు నిర్ణయించుకుంది. అయితే జమ్ముకశ్మీర్‌కు పాలకుడిగా వున్న హిందూ రాజు మహారాజా హరిసింగ్‌కు పాకిస్తాన్‌లో గానీ ఇండియాలో గానీ చేరడం ఇష్టంలేదు. ఇక రాష్ట్రంలోని ముస్లిములకు గానీ పండిట్లకు గానీ 'కశ్మీరీ' అనే గుర్తింపు ముఖ్యమయినది. ఫలితంగా 1947 ఆగస్ట్, అక్టోబర్‌ల మధ్యకాలంలో కశ్మీర్ స్వతంత్రంగా ఉండిపోయింది.

1947 అక్టోబర్‌లో పాకిస్తాన్ మద్దతు ఉన్న ఆఫ్ఘన్ గిరిజన తెగలు జరిపిన సాయుధ దాడితో మహారాజా హరిసింగ్ ఇండియా వైపు తిరిగాడు. కశ్మీర్‌కు రక్షణ, విదేశీ, సమాచార రంగాలు మినహా మిగిలిన అంశాలలో స్వయంప్రతిపత్తిని కల్పిస్తూ ఇండియాలో విలీనం చేసే ఒప్పదం పై సంతకం చేశాడు. భారత రాజ్యాంగానికి కశ్మీర్ కట్టుబడవలసిన పనిలేదని ఈ ఒప్పందం స్పష్టం చేసింది. అంతేకాకుండా ఇండియాలో కలిసేందుకు మహారాజు అంగీకరించినా ఆ తరవాత రెఫరెండం ద్వారా ప్రజల ఆమోదం కూడా పొందాలని ఈ ఒప్పందం నిర్దేశించింది. భారత కశ్మీర్ నాయకత్వాల సంప్రదింపుల ఫలితంగా కుదిరిన చట్టబద్ధ ఒప్పందం, పైన చెప్పిన మూడు రంగాలు తప్ప మిగిలిన అన్ని అంశాలలో కశ్మీర్ స్వయం ప్రతిపత్తికి హామీనిస్తున్నది. దీని భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 370గా పొందు పరచడం జరిగింది.

అప్పటి కశ్మీరు ప్రజలు తమ కశ్మీరియత్ (కశ్మీర్ గుర్తింపు) తోపాటు తమ స్వయం ప్రతిపత్తి పాకిస్తాన్ లోకంటే లౌకిక, ప్రజాస్వామ్య, బహుళ, సమాఖ్య భారతదేశంలో భద్రంగా ఉంటుందని భావించారు. అప్పటి కశ్మీర్ ప్రజల నాయకుడు షేక్ అబ్దుల్లా 'దేశ విభజన సూత్రాలననుసరించి కశ్మీర్ సహజంగానే పాకిస్తాన్‌లో కలవవలసి ఉంది. కానీ మేము ఇండియాని దాని లౌకిక లక్షణం వల్ల , దాని ప్రజాస్వామ్యం వ్యవస్థ వల్ల , జమ్మూ కశ్మీర్ ప్రజల పట్ల దాని సంరక్షణ స్వభావం వల్ల ఎంచుకున్నాం' అన్నాడు.

భారతదేశంలోని మిగిలిన రాష్ట్రాలలో కూడా ఆర్టికల్ 370ని పోలిన నిబంధనలు ఉన్నాయి. అయితే వాటికి విలీన ఒడబడిక లాంటి చట్టబద్ధ ఒప్పంద మద్దతు లేదు. తరువాతి కాలంలో భారత ప్రభుత్వాలు ఆర్టికల్ 370ని డొల్లగా మార్చి, జమ్మూ కశ్మీర్ పై వరుస విద్రోహాలకు పాల్పడ్డాయి.

భారతదేశంలోని ఏ ఇతర రాష్ట్రనాయకుడిని షేక్ అబ్దుల్లాలాగా రెండు దశాబ్దాలపాటు జైలులో పెట్టారు? ఏ ఇతర రాష్ట్రంలోని ప్రభుత్వాలను న్యూఢిల్లీకి తోకలుగా మార్చారు? ఏ ఇతర రాష్ట్రంలో వేలాది మందిని నిర్బంధంలో హత్య చేసి, మీడియాలోగానీ పార్లమెంటులోగానీ కనీస ప్రస్తావనకూడా లేకుండా, సామూహికంగా ఖననం చేసిన

స్మశానాలున్నాయి?

కశ్మీరీ స్వయం ప్రతిపత్తి అనే సారం కోల్పోయిన వాగ్దానానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆర్టికల్ 370, ఆర్టికల్ 35ఏ రద్దు ద్వారా మోడీ ప్రభుత్వం కశ్మీర్‌కు భారతదేశానికి గల వారధిని తగులబెట్టింది. ఇంతకు ముందటి రాజకీయ నాయకులు కశ్మీరును భారతదేశంతో అనుసంధానం చేస్తున్న రాజ్యాంగబద్ధ ఒప్పందానికి ఆనవాలుగా ఆర్టికల్ 370 అనే ఫిగ్ ఆకును ఊపుతూ ఉండేవారు. ఇప్పుడా ఫిగ్ ఆకు రాలిపోయింది ఇక మిగిలిందల్లా కశ్మీర్ ప్రజలపై బహిరంగ క్రూర నిర్బంధం మాత్రమే.

**మీరు ఇప్పుడే కశ్మీర్ నుండి తిరిగి వచ్చారు. కశ్మీర్ పరిస్థితి గురించి మాకు ఏం చెప్పగలరు?**

ఇప్పుడు మొత్తం కశ్మీరు ఒక జైలు . మిగతా ప్రపంచంతో అన్ని సంబంధాలను - ఇంటర్నెట్, ల్యాండ్ లైన్, సెల్ఫోన్ లాంటి సమాచార సంబంధాలను- నిలిపి వేయడం జరిగింది. వీధులను పార్లమెంటరీ బలగాలతోనూ ఇనుప కంచెలతోనూ మూసి వేయడం జరిగింది. జమ్మూ కశ్మీరు పోలీసులను కూడా ట్రాఫిక్ నియంత్రణకు కుదించారు. ఇప్పుడు అధికారాలన్నీ పారా మిలటరీ బలగాలవే. ప్రజలు తీవ్రమైన బాధలో కోపంలో వేదనలో ఉన్నారు. తమకు తీవ్ర అవమానంగా, బానిసత్వంలోకి పోయినట్టు అనిపిస్తుందని పదే పదే చెప్పారు. ప్రత్యేకించి ముస్లిం ద్వేషి అయిన మోడీ కావాలనే ఈ దాడిని బక్రీద్ పండగ ముందు చేశారు అని భావిస్తున్నారు. అంతటా భయం, దుఃఖం పరుచుకొని ఉంది. ఇనుప కంచెలు, తుపాకుల ధరించిన సైనికులు, సమాచార వ్యవస్థను నిలిపి వేయడం కలవరపరుస్తున్నది. అంతకంటే కలచి వేసే అంశం అమలవుతున్న దారుణ నిర్బంధం. 9, 10 ఏళ్ల వయసున్న చిన్నపిల్లలను కూడా పెద్ద సంఖ్యలో నిర్బంధంలోకి తీసుకున్నారు. అలాంటి బాలుర తల్లులను చాలామందిని కలిశాను. వాళ్లు తమ మనసులోని తీవ్రమైన భయాన్ని బయటికి చెప్పలేకపోతున్నారు. అదేమంటే వాళ్ల బిడ్డలు ఎప్పటికీ తిరిగిరారేమోనని; పోలీసులు, సైన్యం వాళ్లని తీసుకెళ్ల లేదని చెబుతారేమోనని. పుల్వామా ప్రాంతంలో మాతో మాట్లాడుతున్న వ్యక్తి మేము ఢిల్లీ వెళ్లి నిజాలను వెల్లడించడంపై తనకు ఎంత తక్కువ నమ్మకం వుందో చెబుతుండగానే, ఒక మహిళ మా దగ్గరకు వచ్చింది. నా చేతిని పట్టుకొని కళ్లల్లో నీళ్లతో, కశ్మీరీలో కోపంగా ఏదో అన్నది. ఆమె మాటలను నాతో మాట్లాడుతున్న వ్యక్తి వివరించాడు.

'2005లో వాళ్ల కొడుకుని భద్రతా బలగాలు ఎత్తుకుపోయాయి. అతనిక తిరిగి రాలేదు. మీతో మాట్లాడటం వ్యర్థం అని ఆమె అంటున్నది. మీరు మా అబ్బాయిని తిరిగి తీసుకు రాగలరా?'

ఇలాంటి దృశ్యాలు గురించి నాకు తెలిసినప్పటికీ, మొత్తం ప్రజల్ని నియంత్రించడానికి పిల్లలని ఉపయోగించుకోవడం మాత్రం చాలా దుర్మార్గమైనది. కశ్మీరు నిర్బంధానికి మోడీ, అతని సైన్యాధ్యక్షుడు షాలు ఒక పాతకాలపు సాకును పదేపదే చెబుతున్నారు. అది కశ్మీరి స్త్రీలకు విముక్తి. పూర్వ కాంగ్రెస్ ప్రభుత్వంలో రాయబారిగా పనిచేసిన నిరుపమాన రావు కశ్మీరు మిగతా భారతదేశంతో పోలిస్తే రెండు వందల సంవత్సరాలు వెనకబడి ఉందని చెప్పింది. మేము దానికి విరుద్ధంగా, కశ్మీర్‌లో ఉత్తర భారతదేశానికి పర్యాయపదాలు అయిన పేదరికాన్ని దారిద్ర్యాన్ని మచ్చుకు కూడా చూడలేదు. వీరిలో ఎక్కువ స్థాయి విద్యాభాసం ఉంది. కశ్మీర్ మహిళలు, బాలికలు మాత్రం చాలా స్పష్టతతో వున్నారు. 'మా సోదరులు నిర్బంధంలో ఉంటే మేం ఈదిని ఎలా జరుపుకుంటాం' అని వారిలో ఒకరు అన్నారు. రాత్రిళ్లు భద్రతాదళాలు ఇళ్లలోకి చొరబడి మా పిల్లలను తీసుకెళ్తారు. ప్రపంచంలోని చాలా చోట్ల లాగానే లైంగిక దాడి గురించి మాట్లాడటానికి కశ్మీరీ సమాజంలో కూడా నిషిద్ధమే. 'అయినా ఇలాంటి దాడులు సమయంలో అత్యాచారాల గురవుతామేమోనని భయపడుతూనే ఉంటాము' అని కొంతమంది అమ్మాయిలు చెప్పారు. వాళ్ల విముక్తి సంబంధించి మోడీ ప్రకటన గురించి ప్రస్తావించినప్పుడు వాళ్లు చాలా ఆగ్రహంతో స్పందించారు.

'ఎవరు మమ్మల్ని విముక్తి చేసేది? ఉత్తరప్రదేశ్, హర్యానాలోని యువకులు ఇక కశ్మీర్ నుంచి పెళ్లి కూతుర్లను తెచ్చుకోవచ్చు అని చెబుతున్న బీజేపీ నాయకులా? మేము గెలిచిన వాళ్లు దోచుకొని వెళ్లే కశ్మీరీ యాపిల్, పీచ్ పళ్లమా?' అని.

వాళ్ల ఆగ్రహం అర్థం చేసుకోగలిగింది. పెల్లెట్ గన్స్ చీల్చేసిన పిల్లల ముఖాలను రక్తం గడ్డకట్టి అంధత్వం వచ్చిన వారి కళ్లనూ చూశాం. ఈ అకృత్యాలు మన పేరు మీదుగా జరుగుతున్నందుకు సిగ్గుపడ్డాం.

**కశ్మీర్ విషయంలో గత ప్రభుత్వాలు అనుసరించిన విధానాలనే మోడీ కొనసాగిస్తున్నాడా? లేక అతను, అతని పార్టీ బీజేపీ ఏదైనా నా కొత్త మార్పు తీసుకొచ్చారనుకోవచ్చా?**

కాంగ్రెస్ నాయకత్వంలోని గతం భారత ప్రభుత్వాలు కశ్మీర్ విషయంలో సాచివేత ధోరణి అవలంబించడం, కీలుబొమ్మ ప్రభుత్వాలను ఏర్పాటు చేయడం, హృదయాలను గెలుచుకోవడం గురించి మాట్లాడడం, అంతర్జాతీయ సమాజానికి ఎన్నికలు, ఆర్టికల్ 370 ద్వారా కశ్మీరీలు భారత ప్రభుత్వంతోనే ఉన్నారని నమ్మబలకడం, మరోవైపు కస్టడీ మరణాలు, సామూహిక ఖననాలు, నిరాయుధ ప్రదర్శనకారుల ఊచకోతలు లాంటి సుదీర్ఘమైన బహుముఖ విధానాలను అనుసరించాయి. మోడీ ప్రభుత్వ విధానం ఎలాంటి ఉపశమనాన్ని ఇవ్వదలుచుకోలేదు. ఇది ఉదారవాదులు దాక్కునే చోటు లేదు. హృదయాన్ని గెలుచుకోవడం లాంటి మాటలు మాట్లాడే వీలు లేదు. కశ్మీరిల మాటల్లో చెప్పాలంటే కాంగ్రెసు వెనకనుంచి పొడిస్తే బీజేపీ ముందు నుంచే పొడిచింది . బీజేపీది నరికి తగలబెట్టే విధానం. కశ్మీర్‌ను కాపాడుకోవడంపై గానీ లేదా అంతర్జాతీయంగా తన ప్రతిష్టను నిలబెట్టుకోవడంలోగానీ దానికి ఆసక్తి లేదు. కశ్మీర్‌ని తగలబెట్టి ఆ మంటలో తన రాజకీయ రొట్టెను కాల్చుకుంటున్నది. ఇందుకోసం హిందూ జాతీయవాదులు తమ కల్పనాశక్తితో కశ్మీరును ఇండియాని ద్వేషించే, పాకిస్థాన్ ప్రేమించే తిరుగుబాటుదారులైన ముసల్మానుల భూమిగా చూపుతారు. మోడీ, 'షా'లను ఈ తిరుగుబాటు ప్రాంతాన్ని జయించినా వీరులుగా చూపెడుతున్నారు.

**ప్రధాన స్రవంతి మీడియా కశ్మీర్ స్వయంప్రతిపత్తిని రద్దు చేస్తూ మోడీ తీసుకున్న నిర్ణయానికి భారతదేశంలో అత్యధిక మద్దతు ఉంది అని చెబుతోంది. ఇది నిజమేనా అయితే ఎందుకు?**

దీనికి నా సమాధానం అవును, కాదు. అవును భారతీయ పాఠశాలలో కశ్మీరు వివాదం గురించి గానీ కశ్మీర్ విలీన చరిత్ర గురించి

గానీ ఎప్పుడూ బోధించలేదు. కాబట్టి ఎక్కువమంది చరిత్రను ఫాసిస్టు ప్రచార ప్రసార సాధనాల ద్వారా తెలుసుకుంటున్నారు. కాస్త అర్ధవంతంగా ఉండే ఉదారవాదులు కూడా చాలామంది ప్రభుత్వ చర్యకు స్వాగతం పలుకుతున్నారు.

అయితే ఒక విషయం మాత్రం చెప్పాలనుకుంటున్న. ఆర్టికల్ 370ని వ్యతిరేకిస్తూ భారతదేశమంతటా విద్యార్థులు, కార్మికులు, మహిళలు, దళితులు, వామపక్షాలు, సామాజిక ఉద్యమకారులు పెద్ద ఎత్తున ప్రదర్శనలు నిర్వహించారు. దళిత, మహిళా ఉద్యమకారులు చెబుతున్న విషయం ఏమిటంటే 'కశ్మీర్‌కి సంబంధించిన ఆర్టికల్ 370 రాజ్యాంగంలో తాత్కాలికమైన ఏర్పాటని, అది ఎప్పటికైనా పోవాల్సిందేనని బీజేపీ అంటున్నది. అలా అనటం అంటే; అణచివేతకు గురవుతున్న దళిత, గిరిజన వర్గాల రక్షణ కోసం ఉన్నటువంటి చట్టాలు కూడా తాత్కాలికమేననీ, ఎప్పటికైనా తీసి వేయవలసిందేనని బీజేపీ అంటుందని మనం గుర్తుంచుకోవాలి.'

రాత్రికి రాత్రి జమ్మూ కశ్మీర్ స్వయం ప్రతిపత్తిని అంతం చేసి దానిని రెండు కేంద్ర పాలిత ప్రాంతాలుగా మార్చ కలిగినప్పుడు రేపు తమ మాట వినని రాష్ట్రాన్ని కూడా అంతే సులభంగా చేయగలరు. తమిళ్‌నాడు హిందీని అంగీకరించకపోతే వాడు దాన్ని కేంద్ర పాలిత ప్రాంతం స్థాయికి కుదించి తమిళ్‌ప్రదేశ్ అని అనొచ్చు. రాజ్యాంగంలోని ఒక నిబంధనను ఇంత సులభంగా తీసివేయగలగడం లౌకిక, ప్రజాస్వామ్య, సమాఖ్య రాజ్యాంగం యొక్క మౌలిక అంశాల జోలికి వెళ్ల గలిగే ధైర్యాన్ని ఇస్తుంది. మోడీ తన ఆగస్టు 15 ఉపన్యాసంలో తన ఐదు సంవత్సరాలు పాలనలో కనీసం ఒక అనవసర చట్టాన్ని తీసివేయగలిగానని అని గొప్పలు చెప్పుకున్నాడు. ఇంకా ఈ అనవసర చట్టాలలో కార్మిక చట్టాలు, పర్యావరణ సంరక్షణ చట్టాలు, పని ప్రదేశాల్లో భద్రత చట్టాలు ఉన్నాయి.

ఇప్పుడు ఎవరికైనా దేశంలో కశ్మీర్ గురించిన నిజాలు మాట్లాడడానికి ధైర్యం కావాలి. మనుషుల్ని సులభంగా టెర్రరిస్టులుగా ముద్ర వేయగలిగిన చట్టాలను మోడీ ప్రభుత్వం ఆమోదించింది. ఇది ఇండియాలో ఇప్పటివరకు చూడని ఒంటెద్దు పోకడ గలిగిన టెర్రరిస్టుల వంకతో మాట్లాడుతున్నట్లు ఉంటుంది. కానీ నిజానికి జాతీయ భద్రత పేరుతో అన్ని రకాల అసమ్మతులను అణచివేయడమే ఈ చర్యల అసలు ఉద్దేశం. కనుక కాశ్మీర్ పట్ల మోడీ విధానానికి వ్యతిరేకంగా మాట్లాడుతున్న మనమంతా కనీసంగా అరెస్ట్ అయ్యే ప్రమాదమూ, గరిష్టంగా ఫాసిస్టుల దాడికి గురయ్యే ప్రమాదమూ వుంది.

**కశ్మీరు విషయంలో పాకిస్తాన్ పాత్ర ఏమిటి? రెండు దేశాలు అణ్వస్త్ర దేశాలుగా ఉన్నా ఈ సందర్భంలో భారత పాకిస్తాన్ సంబంధాల విషయంలో మన వైఖరి ఎలా ఉండాలి?**

కశ్మీరులో పాకిస్తాన్ పాత్ర అవాస్తవికమైనది. ప్రమాదకరమైంది. ఒక రకంగా చెబితే భారత ప్రభుత్వం ఇప్పుడు చేసిన దానికి తగిన సాకును పాకిస్తాన్ ప్రభుత్వం సమకూర్చింది. పాకిస్తాన్ పరిపాలనలో ఉన్న కశ్మీరులోని కొన్నిప్రాంతాలను కేంద్ర పాలనలోకి తీసుకువచ్చారు. ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల హై కమిషనర్ కశ్మీర్‌లో మానవ హక్కుల నివేదికలో పేర్కొన్నట్టుగా పాకిస్తాన్‌కు కూడా కశ్మీరీల అభిప్రాయాలపై గౌరవం లేదు. భారత్‌పై తమ విధానానికి కశ్మీర్ ఒక పావు. ఇవేవీ కశ్మీరీ సమస్యను పరిష్కరించలేవు. ఇది కశ్మీర్‌లోనూ ఇండియాలోనూ స్వతంత్ర గొంతులను నొక్కేసి కశ్మీరును ఇండియా పాకిస్తాన్‌ల మధ్య సమస్యగా మార్చడం ద్వారా హిందుత్వ శక్తులకు సహాయ పడుతుంది.

క్రికెట్ మ్యాచ్ జరిగే టప్పుడు ఎందుకు పాకిస్తాన్ అనుకూల నినాదాలు ఇస్తారు అని అడిగినప్పుడు ఒక యువకుడు అన్నాడు 'పాకిస్థాన్‌లోని అప్రజాస్వామిక పరిస్థితుల గురించి మాకు తెలుసు. పాకిస్తానీల పట్ల మాకు ఎలాంటి అసూయ లేదు. మేము ఎందుకు పాకిస్తాన్‌ని పొగుడుతామంటే భారత సైనికులను ఏడిపించడానికి. పాకిస్తాన్ ప్రస్తావన ఏ రకంగా వచ్చినా వాళ్లు ఉడుక్కుంటారని మాకు అర్థం అయ్యింది.

**ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తున్న ఇస్లామోఫోఫియాలో కాశ్మీరు సమస్య ఒక భాగం అనుకుంటున్నారా?**

ఖచ్చితంగా, ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఇస్లామోఫోబియా భారతదేశంలో దక్షిణ ఆసియాలో ప్రత్యేకంగా కశ్మీర్లో హిందుత్వ రాజకీయాలు సంఘటితం అవడానికి ఉపయోగపడింది. పాలస్తీనియన్ల పై ఇజ్రాయిల్ అనుసరించిన విధానాన్ని బీజేపీ భారతదేశం ముస్లింలు, కశ్మీరీలు అలాగే పాకిస్తాన్‌పై తన విధానానికి నమూనాగా తీసుకున్నది. ఇస్లామోఫోబియా మూస నమూనా కొంతమంది ఉదారవాదులతో కూడా కశ్మీరీలకి సపోర్ట్ చేయడం అంటే ఇస్లామిక్ స్టేట్‌కి సపోర్ట్ చేయడం అనిపించగలిగింది.

ప్రజలు గుర్తించని అంశమేమంటే, కశ్మీర్ ఉద్యమం ఇస్లామీకరణ చెందడం దానిపై అమలవుతున్న అణచివేత యొక్క హిందుత్వ స్వభావం వల్లనే. ఆర్మీ ట్రక్ మీద హిందూ మత చిహ్నాలు, మసీదులో ప్రార్థనలు నిషేధించడం, కశ్మీర్ అంతటా ప్రాథమిక హక్కుల రద్దుకు భారతదేశంలోని పలుకుబడి కలిగిన ఉదారవాద వ్యాఖ్యాతలు సమర్థింపుల వల్ల భారతదేశంలో ముస్లింలు మెజారిటీగా ఉన్న జమ్మూ కశ్మీర్ రాష్ట్ర ప్రజలు తాము ముస్లిములు అయినందుకే అణిచివేయ బడుతున్నాం అని భావించడం సహజం.

**కశ్మీర్ ప్రజలకు మద్దతుగా అంతర్జాతీయ వామపక్షంగా మనం ఏం చేయగలం?**

కశ్మీర్‌కు భారతదేశంలోని ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమానికి అత్యవసరంగా సంఘీభావం అవసరం. భారత్ పెద్ద మార్కెట్ అయినందువల్ల అంతర్జాతీయ ప్రభుత్వాలకు, ట్రంపు, బాల్సోనారో, డ్యూటేర్ట్, ఎర్దోగాన్ లేదా పుతిన్‌లకు మోడీ, షాలు సన్నిహితులు అవుతారు. కాబట్టి మోడీని పొగుడుతూ ఒబామా సంపాదకీయం రాస్తారు, బేర్ గ్రిల్స్ మోడీతో అడవిలో షో చేస్తాడు - భారత అటవీ చట్టాలను మోడీ ఎలా రద్దు చేస్తున్నాడు, భారతదేశపు దట్టమైన అడవులను తన కార్పొరేట్ మిత్రులైన ఆదానిలకు ఎలాకట్ట పెడుతున్నాడో ప్రస్తావించకుండా. కనుక కశ్మీర్ సంబంధించిన నివేదికలను పెద్ద ఎత్తున ప్రచారం చేయండి. కశ్మీరీ మేధావులు రచయితలు ఉన్నచోట చర్చలు నిర్వహించండి. కశ్మీరీ సినిమాలు ప్రదర్శించండి. భారతదేశంలో ప్రజాస్వామ్యాన్ని మోడీ నాశనం చేస్తున్నారో తెలుసుకొని దానిని వ్యతిరేకించండి. ❁






# విముక్తి పోరాటాలకు దిక్సూచి కాశ్మీర్!

శివలక్ష్మి

**జష్న్-ఎ-ఆజాది డాక్యుమెంటరీ**

భారతదేశం నుంచి 'జష్న్-ఎ-ఆజాది' అనే డాక్యుమెంటరీ చిత్రం 2007లో వచ్చింది. ఈ చిత్ర దర్శకుడు 'సంజయ్ కాక్'. ఆయన దీన్ని ఇంగ్లీష్, ఉర్దూ, కశ్మీరీ భాషల్లో నిర్మించారు. దీని నిడివి 138 నిమిషాలు.

శతాబ్దాల తరబడి స్వేచ్ఛకోసం కశ్మీరీ అమాయక ప్రజలు పడుతున్న తపన, అది సాధించే దిశలో వారి మృత్యుఘోషను వివరిస్తుంది చిత్రం. కశ్మీర్ గురించి భారతదేశపు పాలకులకున్న పూర్తి అసత్యపు ఆలోచనా విధానాన్ని తెలియజేస్తూ, భారత్‌తో పాటు, ప్రపంచ వ్యాప్తంగా ప్రజలకు వాస్తవాలను చెప్పి, కశ్మీర్‌కి మద్దతు కూడగట్టాలనే ఆరాటంతో ఈ చిత్రాన్ని దృశ్యీకరించారు సంజయ్ కాక్.

ఈ డాక్యుమెంటరీని 2004 శీతాకాలంలో ప్రారంభించారు. మొదలవడంతోనే ప్రజలు సన్నని వీధుల్లో పరుగులు తీస్తూ కనపడతారు. వారిమీద ప్రభుత్వ బలగాలు పేల్చే బాంబులూ, వదిలే టియర్ గ్యాస్ కనిపిస్తాయి. ఉత్తర కశ్మీర్లోని బందీపురా అని కెమెరా చూపిస్తున్నప్పుడు, 1947లో ఇండియా-పాకిస్థాన్ విభజన జరిగిందనీ, ఎనిమిది మిలియన్ల ముస్లిం ప్రజల్ని హతమార్చారనీ, 1947 ప్రాంతాల్లో హిందూరాజు పరిపాలనలో ముస్లిం ప్రజలు అష్టకష్టాలు పడ్డారనీ అంతకు ముందు 500 సంవత్సరాలుగా జహంగీర్, సుల్తాన్, మొఘలాయీ మొదలైన రాజుల పాలనలో కశ్మీరీ ప్రజలు స్వేచ్ఛ అనేది తెలియకుండా మగ్గిపోయారనీ వ్యాఖ్యాత చెప్తారు. అల్తాఫ్ ఖురేషీ అనే అమరుడి అంతిమ యాత్రలో ప్రజలు తండోప తండాలుగా ఊరేగింపులో పాల్గొని 'మాకు స్వేచ్ఛకావాలి' (We want freedom), 'తిరస్కరించండీ భారత రాజ్యాంగాన్ని' (we reject Indian Constitution-We reject), "తగలబెట్టండీ-భారత సంస్థలన్నిటినీ" (Burn all Institutions of the Indian state - Burn them) అని పెద్ద పెద్దగా నినాదాలిస్తుంటారు. తర్వాత సీన్‌లో ప్రజలు, యుక్త వయసు పిల్లలు వారి వారి కుటుంబాల్లో సంపాదించే మనుషులు తుపాకుల పేలుళ్లకి ఎలా బలయ్యారో, తాము కుటుంబ పోషకుల్ని పోగొట్టుకుని ఏ విధంగా అనాధులయ్యారో వీరికి వివరిస్తుంటారు.

తర్వాత దృశ్యం మారి, ఆగస్టు 15, 2005లో భారతదేశ స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకోవడం కనిపిస్తుంది. కశ్మీర్‌లోని శ్రీనగర్ నడిబొడ్డున ఉన్నలాల్ చౌక్, రెడ్ స్క్వేర్‌లో ప్రతి సంవత్సరం ఆగస్టు 15న భారతదేశపు జెండా వందన కార్యక్రమం ఒక ఆచారంగా జరుగుతుంది. సాధారణంగా సందడిగా, జనంతో కిటకిటలాడే ఆ స్థలం ఆ సమయంలో ఖాళీగా, నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉంది. ఈ దృశ్యంలోని కవాతులో చాలా తక్కువమంది సైనికులు (పదిమంది లోపే) జెండా వందనం చేసి, జాతీయ గీతాన్ని నీరసంగా ఆలపిస్తూ కనిపిస్తారు. అటెండర్లు, వారికి కాపలా కాసేవారు కాకుండా, యూనిఫాం లేకుండా ఉన్న వ్యక్తులు మీడియా సిబ్బంది మాత్రమే! అంతే తప్ప, కశ్మీరీలు ఒక్కరంటే ఒక్కరైనా లేరు! ఆగష్టు 15వ తేదీన జెండా వందనం దృశ్యంతోపాటు ఒక పక్కనుంచి పేలుళ్లు వినిపిస్తుంటాయి. ఇంకో పక్క ప్రజలు దుఃఖంతో 'మాకీ కష్టాలెప్పుడు తీరతాయి? మాకు శాంతి ఎప్పుడు లభిస్తుంది?' అని ప్రార్థిస్తూ ఉంటారు.

ఒక దశాబ్దానికి పైగా, కశ్మీర్‌లో ఆగస్టు 15న ఇటువంటి నిరసన కార్యక్రమాలు చాలా జరిగాయి. కశ్మీర్‌లో 'స్వేచ్ఛ-ఆజాది' లాంటి అనేక అర్థాలను అన్వేషించడానికి 'జష్న్-ఎ-ఆజాది' ఇక్కడే, ఈ రెడ్ స్క్వేర్‌లోని లాల్ చౌక్‌లోనే ప్రారంభమైంది. 'కాశ్మీర్లో సంఘర్షణల గురించి భారతదేశంలో ప్రజలకి, ఆమాటకొస్తే మొత్తం ప్రపంచానికి నిజాల్ని పాతిపెట్టి, అబద్ధపు వర్ణనల్ని ప్రచారం చేస్తోంది ప్రభుత్వం. కశ్మీరీ అమాయక ప్రజలు ఉగ్రవాద తుపాకీ - సైన్యం బూట్ల మధ్య చిక్కుకుపోయారు! 18 సంవత్సరాల రక్తపాత సాయుధ పోరాటం తర్వాత, 60,000 మంది పౌరులు మరణించిన తర్వాత, దాదాపు 7,000 మంది అదృశ్యమైన తర్వాత, స్వేచ్ఛ కోసం ఆజాది పట్ల ఉన్న సంవేదనకర్థమేమిటి?' అని వాపోతారు వ్యాఖ్యాత. ఈ చిత్రాన్ని 2007లో నిర్మించారు గనుక అప్పటివరకూ జరిగిన నష్టాన్ని మాత్రమే అంచనా వేశారు సంజయ్ కాక్.

తర్వాత షాట్‌లో అమరవీరుల స్మశానవాటికలో ఒక వృద్ధుడైన తండ్రి ఈద్ రోజున తన కుమారుడి సమాధి కోసం వెతుకుతుంటాడు. సమాధులన్నీ మంచుతో కప్పబడి ఉంటాయి. ఆయన తంటాలు పడి ఒక సమాధి మీద మంచు తీసి, అడుగున తన కుమారుడి పేరుంది చూడమంటాడు. తేదీ చూస్తే ఏప్రిల్ 8, 1996 అని ఉంటుంది. అతని పేరు ఫరూక్ అహ్మద్ అనీ, బద్గావ్‌లో జరిగిన ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడనీ, హిజ్బుల్ ముజాహిదీన్‌లో డివిజనల్ కమాండర్‌గా పనిచేశాడనీ చెప్తాడు. ఆయన స్వరంలో ఎలాంటి పశ్చాత్తాపం కనిపించదు!

ఉత్తర కశ్మీర్‌లోని కుప్వారా జిల్లాలోని మరో యువకుడు ఇలా అంటాడు "దావా వేయని మృతదేహాలను పాతిపెట్టడం నా పని. అది ఒక అమాయక పౌరుడు కావచ్చు లేదా ఉగ్రవాది కావచ్చు. 10 సంవత్సరాల క్రితం నేను ఈ ఉద్యోగంలోకి వచ్చినప్పుడు నా వయసు కేవలం 15 ఏళ్లు మాత్రమే! ఒకరోజు తలలేని ఒక శవాన్ని చూచి వణికిపోయాను. ప్రతిరోజూ ఖండించబడ్డ మృతదేహాలను చూసి భయంతో బిగదీసుకుపోయేవాణ్ణి. కానీ ఇప్పుడు నా గుండె రాయిలా మారినట్లు, అలవాటై రాటు దేలిపోయాను"- అని చేష్టలుడిగి పోయినట్లు నిర్వికారంగా చెప్తాడు.

సంఘటనలు జరుగుతూ ఉంటాయి. కెమెరా మాత్రం జామా మస్జిద్ అనీ, కుప్వారా అనీ, టేకీ పురా అనీ మనం నిత్యం టీవీలో వార్తల్లో చూసే పేర్లు కనిపిస్తాయి. మొఘల్ గార్డెన్, అక్కడినుంచి గుల్మార్గ్‌కి షాట్ మారుతుంది. ఏ కాలంలోనైనా కశ్మీర్ 'భూమి మీద కొలువు తీరిన స్వర్గమని' నేపథ్యంలో వినిపిస్తుంది. ఆ విషయాన్ని బలపరుస్తూ పర్యాటకులైతే గుల్మార్గ్ దగ్గర మంచును చూసి పులకించిపోతూ "ఇది భూమి మీద స్వర్గమనీ, దీనికి సాటి అయినదేదీ లేదనీ, స్విట్జర్‌లాండ్ లాంటి దేశాలకు వెళ్లక్కర లేదనీ, పక్కనే ఉన్న కశ్మీర్‌ని చూడగలిగితే చాలనీ మురిసిపోతూ మాట్లాడతారు. చిన్న చిన్న వ్యాపారాలు చేసుకుని రోజులు వెళ్లదీసే అక్కడి కశ్మీరీ పేద ప్రజలు పర్యాటకులతో కనిపిస్తారు.

1470లో రాజుల పరిపాలన అంతమైంది. ఆ తర్వాత సుల్తానులు, ఆఫ్ఘానులు, మొఘలాయీలు, సిక్కులు, డోగ్రాలు మొదలైనవారు 500 సంవత్సరాల నుంచి కశ్మీరీలను రకరకాల అణచివేతలకు గురి చేశారు. అయినప్పటికీ స్వేచ్ఛ కోసం కశ్మీరీ ప్రజలు పట్టుదలతో పోరాడుతూనే ఉన్నారని నేపథ్యంలో వినిపిస్తుంది.

ఉత్తర కశ్మీర్లోని, టేకీ పురా, లోలబ్ లోయలో మిలిటెంట్స్ ఉన్నారనే నెపంతో ఊరు ఊరంతా ప్రభుత్వ బలగాలు నిప్పు పెడతారు. ప్రజలు భయంతో పరుగులు తీస్తారు. వచ్చి చూస్తే మొత్తం సర్వనాశనమై పోయి ఉంటుంది. 'మా ఇంటికీ, పశువులకీ నిప్పంటించారు. పశువుల్లో రెండు మేకలు, ఒక ఎద్దు శలభాల్లా మాడి మసైపోయాయి. నా జీవనాధారం పోయింది. మళ్లీ ఇల్లు కట్టుకునే శక్తి నాకు లేదు. పిల్లలు పసివాళ్లు. కట్టు బట్టలతో బయట పడ్డాం' అని ప్రజలలోనుంచి ఒకతను చెప్తాడు. 'కొందరికి మంటలు చుట్టుముట్టి, గాయాలు కూడా అయ్యాయి. ఇప్పుడు మా దేశంలో మేము దేశ దిమ్మరుల్లాగా మిగిలిపోయాం. తగలబెట్టినవాళ్లు వాళ్ల దారిన వాళ్లు ఉడాయించారు. జీవితకాలమంతా శ్రమించి సంపాదించుకున్న వస్తువులన్నీ బుగ్గి పాలయ్యాయి. పిల్లా పాపలతో మేమెట్లా బతకాలి?" అని ఒక మహిళ చెప్తుంది. అక్కడి మహిళలూ, ప్రజలూ ఎవరి బాధలు వారు చెప్తూ ఆ ఊరిని, ఆ కాలిన ప్రాంతాన్ని చూపిస్తుంటే ప్రేక్షకులు నిస్సహాయంగా, నిస్తేజంగా చూస్తూ ఉండి పోతారు.

ఆ పక్కనే టేకీపురాలోనే ఆర్మీ కేంప్ కనిపిస్తుంది. ఉత్తర కశ్మీర్లో మిలటరీ ఆపరేషన్ ఐపోవడంతో సీన్ దక్షిణ కశ్మీర్‌కి మారుతుంది. 1991, ఫిబ్రవరి 15న, హజ్రత్ మస్జిద్ దగ్గర పెద్దగా గుమిగూడిన సాధారణ ప్రజలను దృశ్యీకరించారు. ఈ పౌరులు 20 ఏళ్ల నుంచి నిరాయుధంగా పోరాటమే ప్రాణంగా స్వేచ్ఛ కోసం శాంతియుతంగా ఉద్యమిస్తున్నారని చెప్తారు. మొదట్లో హక్కులకోసం అడుగుతూ శాంతియుతంగానే ఉద్యమించారు. చేయని నేరాలకు వారిని నిందితుల్ని చేస్తూ, వారి నేల మీదే వారిని ఉగ్రవాదులని ముద్ర వేస్తుంటే, కొందరు యువకులు పోరాట బాట పట్టి సాయుధులవుతున్నారు. కశ్మీర్ సాధారణ పౌరులు వారిని వారు అణచబడ్డవారుగా, బానిసలుగా భావించుకుంటారు. వారు 'మమ్మల్ని ఉగ్రవాదులుగా ముద్ర వేస్తున్న ఇండియాకి మేము ఈ విషయం చెప్పదలచుకున్నాం. మాలో ఎవరూ ఉగ్రవాదులు లేరు. కొంతమంది దారి తప్పిన వారుంటే ఉండవచ్చు. కానీ ఇన్నేళ్ల మా స్వాతంత్ర్య పోరాటం తర్వాత ఇప్పుడు చెప్తున్నాం. జాతి స్వేచ్ఛ కోసం సాయుధులై పోరాడుతున్న ముజాహిదీన్లతో కలిసి ఇకముందు మేము పోరాడ దలచుకున్నాం"- అని అంటూ స్వేచ్ఛనాకాంక్షిస్తూ నినాదాలు చేస్తారు.

బందీపురాలోని ఎరిన్ ప్రాంతంలోని పర్వతాల మధ్య గ్రామాల్లో చనిపోయినవారి గురించి జమ్మూ కశ్మీర్ కొయలేషన్ ఆఫ్ సివిల్ సొసైటీ (Jammu Kashmir Coalation of Civil Society) సభ్యులు, మిలిటరీ ద్వారా, మిలిటెంట్స్ ద్వారా చనిపోయినవారి వివరాలు సేకరించడం కనిపిస్తుంది. ఇక ప్రజలు చెప్పే ఒక్కో కథని వింటున్న ప్రేక్షకులకు గుండెలు బేజారెత్తిపోతాయి. బంధించి పట్టుకెళ్లారంటే ఇక తిరిగి రావడం గురించి నమ్మకంలేదు. కొందరు మాయమవుతారు. కొందరు చిత్రహింసల బారిన పడి చనిపోతారు. కొందర్ని బతకడానికి పనికిరాకుండా చావూ బతుకూ కాకుండా చితగ్గొట్టి మంచంలో పడేస్తారు. కొందర్ని హత్యలు చేస్తారు. తలిదండ్రుల్ని కోల్పోయి, అనాథలైన పాలుగారే పసిపిల్లలు తమ తల్లీ-తండ్రుల హత్యల గురించి వింటూ అమాయకంగా చూస్తుంటారు. వారిని చూస్తున్న ప్రేక్షకుల గుండెలవిసిపోతాయి. కానీ ఇది చెప్తున్న వృద్ధుల మాటల్లో ముజాహిదీన్లలో పని చేస్తున్నందుకు పట్టుకు పోయారని చెప్తున్నప్పుడు వాళ్లలో అపరాధ భావనలేమీ కనిపించలేదు. మావాళ్లు అమరులయ్యారని చాలా సహజంగా విముక్తి పోరాటంలో వీరమరణం పొందినట్లుగా గర్విస్తున్నట్లనిపించింది. శ్మశానంలో 2003లోనూ, 2004లోనూ చనిపోయిన, కనిపించకుండా పోయిన, అవిటివారై మంచానికతుక్కుపోయిన వారి లెక్కలు చెప్తారు!

డైరెక్టర్ బృందం శ్రీనగర్‌లోని ఒక ప్రభుత్వ ఒక మానసిక ఆరోగ్య నిలయం బయట పేషెంట్స్ వార్డ్‌లో నిశ్శబ్దంగా కూర్చుని రోగుల్ని గమనిస్తారు. మానసిక వైద్యుడు ప్రశ్నలు అడుగుతున్నప్పుడు వారిలో కొందరు రక్తాలు కనిపించి నిద్రే లేకుండా చేస్తున్నాయనీ, తమ కుటుంబంలో చనిపోయినవారు రారమ్మని పిలుస్తున్నారనీ చెప్తుంటారు. ఒక మహిళను డాక్టర్ ప్రశ్నిస్తుంటాడు. ఆమె తలలు తెగిపడిన మొండెంలు కనిపించి, నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయంటుంది. ఆమె సోదరుడు మిలిటెంట్ కాకపోయినా సాధారణ పౌరుడైనప్పటికీ పోలీసులు చంపేశారని, ఆమెను హాస్పటల్‌కి తీసుకొచ్చిన పక్కనున్న ఒకతను చెప్తాడు. రకరకాల మానసిక రోగుల్ని చూస్తున్నప్పుడు, వారి వేదనల్ని వింటున్నప్పుడు మనసు చెదిరిపోయేలా రక్తపు మడుగులు కనిపిస్తాయి. అవి చూస్తున్న ప్రేక్షకులు విషాదంలో కూరుకుపోతారు!

ఇంతలో యూనివర్సిటీ నుంచి వచ్చిన ఒక యువతి మానసిక వైద్యుడితో ఇంటర్వ్యూ కావాలంటుంది. మీ పరిశోధనాంశం ఏమిటని డాక్టర్ అడిగితే 'ప్రజల మానసిక ఆరోగ్యంపై ఘర్షణ వాతావరణ ప్రభావం' అని చెప్తుంది!

భండ్ అనే జానపద కళాకారులు ఒక గ్రామ కూడలిలో ఆడుతున్నప్పుడు వారి వ్యంగ్య ప్రహసనంలోనూ, ఉత్తర కశ్మీర్‌లోని ఆర్మీ సద్భావనా శిబిరం దగ్గర ఉద్రిక్త పరిస్థితులలోనూ, నేపథ్యంలో సమకాలీన కశ్మీరీ కవుల కవిత్వం ద్వారా వినిపించే వివరణల్లోనూ ప్రేక్షకులకు చాలా సమాచారం తెలుస్తుంది.

1993 మార్చ్ 14వ తేదీనాడు 'నాసిర్ ఉల్ ఇస్లాం' అనే అమరుడి అంతిమయాత్రలో పెద్ద ఎత్తున ప్రజలు రావల్పోరాలో ఊరేగింపులో పాల్గొంటారు. నినాదాల హోరు చాలాచోట్ల, చాలాసార్లు వినిపిస్తుంది. ప్రతి ఒక్కర్నీ ఆపి ఐడీ కార్డులూ, లైసెన్సులూ పరిశీలిస్తుంటారు. '700,000 సైనికులు కనపడని శత్రువులను వేటాడుతున్నారు. ఒక్క 2006 సంవత్సరంలో మాత్రమే కశ్మీర్‌లో భారతదేశ భద్రతా ఉనికికి 3000 కోట్లకు పైగా ఖర్చయింది. 5000 మంది భారతీయ సైనికులు కశ్మీర్‌లో చనిపోయారు. ఒక్కో సంవత్సరం గడిచేకొద్దీ సైనికుల సంఖ్య, ఇరువైపులా మరణాల సంఖ్య విపరీతంగా పెరుగుతుందే తప్ప కించిత్తుకూడా తరగడంలేదు'- అని వెనకనుంచి వినిపిస్తుంది.

12 ఏళ్ల క్రితం నిర్మించిన ఈ చిత్రాన్ని ఇప్పుడు 2016లో మళ్లీ ఎందుకు చూడాలి? అని అడిగి, ఇప్పటి పరిస్థితినీ, ప్రాసంగికతనూ వివరిస్తారు సంజయ్ కాక్.

ఈ సినిమాలో 'స్వేచ్ఛ కోసం పోరాటం'కి సంతకాల సేకరణ కోసం ప్రచారం చెయ్యడానికి వచ్చిన 'జమ్మూ కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్" (JKLF) చైర్మన్, యువ నాయకుడు మహ్మద్ యాసిన్ మాలిక్ ప్రసంగాన్ని ప్రేక్షకులు వింటారు. 1966లో జన్మించిన ఇతడు, 1985లో మొదటిసారి అరెస్టు చేయబడి, 10 సంవత్సరాలు భారత జైళ్లలో గడిపాడు. '55 సంవత్సరాలు గడిచాయి. ఇప్పటికీ అన్యాయం, పశుబలం, క్రూరత్వం, దోపిడీలు, హత్యలు రాజ్యమేలుతున్నాయి. కానీ మన శత్రువు పేరు బ్రాహ్మణ సామ్రాజ్యవాదం. దీనికి ఒకే ఒక విలక్షణమైన లక్షణం వుంది. ఇది మోసం చేస్తూ, పచ్చి అబద్ధాలను నిజాలుగా ప్రచారం చేస్తుంది. లక్షమంది కశ్మీరీ ప్రజలను చంపి, వారు ఉగ్రవాదులని చెప్తుంది. బీహార్, అస్సాం, నాగాలాండ్, తమిళనాడు నుండి వచ్చిన సైన్యం, ఇక్కడ పుట్టి, ఇక్కడే జీవిస్తున్న పౌరులను ఐడి కార్డులు చూపించమని, బస్సుల నుండి బయటకు లాగి మైళ్ల దూరం నడవమని ఆజ్ఞాపిస్తున్నారు. వారిని కొట్టి, వారికే చెందిన తోటలు, పొలాలు, ఇళ్లల్లో మనుషుల్ని విసిరేసిపోతున్నారు. వాళ్లు మనుషులు కాదు, యూనిఫారంలో ఉన్న బందిపోట్లలాగా ప్రవర్తిస్తున్నారు. కానీ ఈ దౌర్జన్యాన్ని ఇకముందు సాగనివ్వకూడదు. ఈ భూమి ఎవరికి చెందినది? ఈ ఆకాశం, ఈ అడవులు, ఈ గాలి ఎవరికి చెందినవి? మీరంతా ఎవరు? ఎక్కడనుంచి వచ్చారు? అని ప్రశ్నించండి. లక్షల్లో ప్రాణత్యాగాలు చేస్తున్నప్పటికీ ఈ ప్రపంచానికి ఇంకా తెలియడం లేదా? కాశ్మీరీలు స్వేచ్ఛను కోరుకుంటున్నారని ప్రపంచానికి ఎలుగెత్తి చాటి చెప్పండి. వాజపేయి హయాంలో కశ్మీర్ ప్రజలు ఇండియాతో లేరని అబద్ధపు ప్రచారం జరుగుతుందని చెప్పు, ఎన్నికలు పెట్టారు. ఆ ఎన్నికల్లో దిష్టిబొమ్మలాంటి పీడీపీ పార్టీని గెలిపించి, తమ యవ్వనాన్నీ, ప్రాణాల్నీ త్యాగం చేసిన లక్షమంది అమరులకు ద్రోహం చేశార'ని అక్కడ గుమిగూడిన ప్రజలనుద్దేశించి ఉపన్యసిస్తాడు యాసిన్ మాలిక్. ఆ తర్వాత జరిగిన ఎన్నికలను ఈ సినిమాలో చిత్రీకరించారు. ఒక నియోజకవర్గంలో ఉన్న 810 ఓట్లకి 74 మంది మాత్రమే ఓట్లేశారనీ, అంటే 9% ఓట్లు మాత్రమే పోలయ్యాయని ఎలక్షన్ డ్యూటీలో ఉన్నవాళ్లు చెప్పుకోవడం చూస్తాం. ఒక పక్కన ప్రభుత్వ బలగాలు ప్రజల్ని సమావేశపరిచి 'మీరు మాకు సహకరించాలి. మిలిటెంట్ల ఆచూకీ తెలుసుకుని చెప్పాలి. సాధారణ పౌరులు సహకరించకపోతే మేమేమీ చెయ్యలేము' అని ఉపన్యసిస్తుంటే, అదే సమయంలో నేపథ్యం నుంచి 'మీరు మా స్వేచ్ఛను తుడిచెయ్యలేరు. చిరునవ్వుతో బుల్లెట్లకు ఎదురుగా గుండెల్ని నిలుపుతాం. మా ప్రతిష్టని మేమెప్పుడూ కాపాడుకుంటాం. వేలమంది సైన్యమున్నా మా ఐక్యతా దారిలోకి రాలేరు' అంటూ అతి శ్రావ్యంగా వినిపించే కశ్మీరీ కవితలే చెవుల్లో ఎక్కువగా ప్రతిధ్వనించి ప్రేక్షకుల నాకట్టుకుంటాయి! జనమంతా ఒక్కటై దిక్కులు పిక్కటిల్లేలా ఇచ్చే నినాదాలు ప్రేక్షకుల హృదయాల్లో హోరుమంటాయి. ఇంకో పక్కనుంచి పోలీసులు శాంతికపోతాలను ఎగరేస్తుంటారు. అందులోని డొల్లతనం ప్రేక్షకులకు తెలిసొచ్చి పేలవమైన నవ్వు తెప్పిస్తాయి. యాసిన్ మాలిక్ ఉపన్యాసం నడుస్తుండగానే కొన్ని సీన్లు సమాంతరంగా నడుస్తుంటాయి. 'ఇది భారత్‌కీ పాకిస్తాన్‌కీ మధ్య సరిహద్దుల సమస్య కాదు. అదే అయితే దాన్ని రెండు దేశాలూ చర్చల ద్వారా తేల్చుకోవచ్చు. ఇది ఉగ్రవాద సమస్య అంతకన్నా కాదు. ఇది కశ్మీరీ ప్రజలకు సంబంధించింది. ఇది మన స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలకు సంబంధించిన సమస్య. ఈ నేలకు మనమే నిజమైన, న్యాయమైన హక్కుదారులం! మన హక్కుల్ని మనం సాధించి తీరాలి"- అని మళ్లీ ప్రసంగిస్తాడు.

1990లో కశ్మీర్ లోయలో చెలరేగిన మతకలహాలవల్ల 200 మంది కశ్మీరీ పండిట్లను టెర్రరిస్టులు ఘోరంగా చిత్రవధల పాల్జేసి చంపేశారు. 1991 సంవత్సరాంతానికి 1,60000 మంది హిందువులు కశ్మీర్ లోయను విడిచిపెట్టి వెళ్లారు. లోయలో నివశిస్తున్న హిందువుల రక్షణ కోసం ప్రభుత్వం ఎటువంటి హామీ ఇవ్వలేకపోయింది.

## ఈ డాక్యుమెంటరీ ప్రత్యేకతలు

కశ్మీర్ లో 'స్వేచ్ఛ' కోసం తిరుగుబాటుతో వచ్చిన మొట్టమొదటి డాక్యుమెంటరీలలో ఇది ఒకటి. అతి సాహసోపేతమైన రాజకీయ ప్రకటనను ధైర్యంగా చేశారు సంజయ్ కాక్. 1958లో బ్రాహ్మణుల కశ్మీరీ పండిట్ వర్గానికి చెందిన కుటుంబంలో జన్మించిన సంజయ్ కాక్ ఒక వామపక్ష కార్యకర్త. సొంతంగా నేర్చుకున్న పరిజ్ఞానంతో చిత్రనిర్మాణం చేస్తున్నారు. కశ్మీరీ జాతికి చెందినప్పటికీ అతని కుటుంబం అనేక తరాలుగా ఢిల్లీలో స్థిరపడింది. పౌర ప్రతిఘటనను ప్రేరేపించే రాజకీయ అంశాలతో డాక్యుమెంటరీలను దృశ్యీకరించడంలో సిద్ధహస్తులుగా ప్రసిద్ధి చెందారు. "జష్న్-ఎ-ఆజాది" కాశ్మీర్ పట్ల భారత్ దృష్టికోణాన్ని విస్తృతంగా ప్రభావితం చేసిన చిత్రం!

ఆయన 'జష్న్-ఎ-ఆజాది' ని 2007లోనే నిర్మించినప్పటికీ, కశ్మీర్‌లోని బీజేపీ, ఆర్ఎస్ఎస్ అనుయాయులు విడుదల కానివ్వకుండా, కాల్పులు జరిపారు. పోలీసులు ముంబైలో, 'సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిల్మ్ సర్టిఫికేషన్' క్లియరెన్స్ లేదని బహిరంగ ప్రదర్శనలను ఆపివేశారు. స్వేచ్ఛా సంభాషణలను ప్రోత్సహించే లక్ష్యంతో ఉన్న సాంస్కృతిక కేంద్రాల్లో, పుత్సవాల్లో కొన్ని సంవత్సరాలనుంచి ఈ చిత్రం ప్రదర్శింపబడుతూ వచ్చింది. చివరకు ఎజైన్ రైయోట్ తన అధికారిక వెబ్ సైట్ ద్వారా 'జష్న్-ఎ-ఆజాది'ని విడుదల చేసింది!

ఈ చిత్రం గతాన్ని జ్ఞాపకం చేసుకుంటూ, వర్తమానంలోని చిక్కుముడులను విప్పటానికి అనేక రకాల వ్యక్తీకరణ రీతులను మిళితం చేస్తుంది! ఒక పక్క ప్రభుత్వ కార్యక్రమాలు- వాటికి వ్యతిరేకంగా ఇంకోపక్క ప్రజల ఆందోళనలను సమాంతరంగా దృశ్యీకరించారు. ఉగ్రవాద తుపాకి - సైన్యం బూట్ల మధ్య కశ్మీరీ అమాయక ప్రజలు నలిగిపోతున్న విధానాలనూ, పరిస్థితులనూ హృద్యంగా చిత్రీకరించారు సంజయ్ కాక్.

అమరవీరుల స్మశానవాటికలో తండ్రి కొడుకు సమాధి కోసం వెతుకుతూ అక్కడ లెక్కలేనన్ని సమాధులుండడం వల్ల ఎవరిది ఎక్కడుందో అని వెతకడం చాలా కష్టమని చాలా ధీమాగా, ఒకింత గర్వాగా చెప్తాడు.

అంటే తన కుమారుడు తమ జాతి స్వతంత్రం కోసం ప్రాణాలర్పించాడన్నట్లు ధ్వనిస్తుంది. ఈ సమాధుల సన్నివేశం చాలా హృదయవిదారకంగా ఉండి గుండెలకు గురి పెట్టిన బాణం లాగా ప్రేక్షకులకు బలంగా తాకుతుంది! ఆర్మీ ఆపరేషన్ సమయంలో హత్య గావింపబడిన పొరుగున ఉన్న ఒక యువకుడి మృతదేహం గురించి ఒక టీనేజ్ అమ్మాయి ఇలా వివరిస్తుంది, - "మృతదేహం ఇళ్ల మధ్య నాలుగు రోడ్ల కూడలిలో పడి ఉంది, ఎవరినీ ముట్టుకోవడానికి అనుమతించలేదు. చివరికి కుక్క కూడా దాని దగ్గరకు వెళ్లలేదు" అని ఆమె దృఢంగా బలంగా చెప్పే స్వరం ఇంకా చాలా క్రూరమైన విషయాలను చెప్పకనే చెప్తుంది. మృతదేహాలను పాతిపెట్టే పని చేసే యువకుడు "ఖండించబడ్డ మృతదేహాలను చూసి భయంతో బిగదీసుకుపోయేవాణ్ణి"- అని చెప్పే సీన్, ఇంకా ఈ చిత్రంలోని ఇలాంటి ఎన్నో సీన్లు వెన్నులో వణుకు తెప్పిస్తాయి!

'భండ్స్' అని పిలువబడే కశ్మీర్ జానపద కళాకారులు ఐదు శతాబ్దాల పురాతన బానిసరాజ్యాన్ని వ్యంగ్యంగా ప్రదర్శిస్తారు. "ఈ శాపగ్రస్థ భూమిలో ఎవరెవరో మళ్లీ మళ్లీ ప్రజల విధిని నిర్ణయించారు. ఈ నేల స్వంతదారులు పరాయి పాలకుల దౌష్ట్యానికి బలవుతారు కానీ వారికేమీ నిర్ణయాత్మక శక్తులుండవు"! అని ప్రదర్శన సారాంశం.

తిరణాలలో పెద్ద సంఖ్యలో కనిపించేటట్లున్న శవాల ఊరేగింపులు, నిరంతరం ఒకదాని తర్వాత ఒకటి సాగిపోతూనే వుంటాయి. అలుపులేకుండా జరిపే అంత్యక్రియలు, ఆ సందర్భాల్లో హోరెత్తే నినాదాలు వారి ఐక్యతను సూచిస్తాయి. వందలాది పిడికిళ్లను గాలిలో పంపుతూ చేస్తున్న వీధి కవాతుల్లో, 'మనకేంకావాలి? ఆజాదీ' అనే నినాదం చాలా శక్తివంతంగా వినిపిస్తుంది! వారి మనసుల్లో తిష్ట వేసుకున్న అతి గాఢమైన కాంక్ష వల్ల వారికే స్వంతమైన, ప్రత్యేకమైన కవితలు, పాటలు, నినాదాల సృష్టికి దారితీసింది.

ప్రేక్షకులు సినిమా చూడటానికి తమను తాము ఎంతగా మానసికంగా సిద్ధం చేసుకుని, అలవాటు పడినా కొన్ని సీన్లకు స్పందన కరువై బండరాళ్లలా మారిపోతారు. మళ్లీ ప్రేక్షకుల్ని సున్నితంగా ఆకర్షిస్తూ, లలితలలితంగా అతి మధురంగా

**"స్వేచ్ఛ కోసం భయంకరమైన దాహం కాశ్మీర్లో వరదలై పోటెత్తుతుంది,**
**ప్రేమతో అంతులేని వ్యధతో వ్యాకులపడుతున్న గాజు ముక్కల్లా మిగిలిపోయాం,**
**ఓ అపరిచితుడా, మాకు వారసత్వంగా ఈ చివరి రాత్రి ఎవరొస్తారు?**
**నేను గతం గురించి దేనిని పాడొచ్చు? దేనిని పాడకూడదు?"**

అని ఆఘా షాహిద్ అలీ అనే కశ్మీరీ కవి, కవిత శ్రావ్యంగా నేపథ్యంలో వినిపిస్తూ ఉంటుంది.

షకీల్ బక్షి అనే ఆయన 'ఎన్ని కష్టాలెదురైనా, ఎంత ధన, మాన, ప్రాణ నష్టాలు జరిగినా కశ్మీరీ ప్రజలు పోరాట తత్వాన్ని వదలలేదు. ప్రపంచంలో జాతుల విముక్తికోసం ప్రతిఘటిస్తూ జీవించదలచుకున్న వారెవరైనా కశ్మీరీ ప్రజలనుంచి పాఠాలు నేర్చుకోవలసిందే' అని చెప్తారు. ఈ షకీల్ బక్షి 1963లోజన్మించి, 1884లో అరెస్ట్ చేయబడి, 12 ఏళ్లు భారత జైళ్లలో జుడీషియల్ ట్రయల్ కూడా లేకుండా గడిపారు. 1947లో మెజూర్ (Mehjoor) అనే కవి "తూర్పును మేల్కొల్పే వారెవరు? ఆ స్వరం కశ్మీర్ నుండే రావాలి" అని అన్నారని ఉదహరించి, కశ్మీర్‌కి ప్రపంచ చరిత్రలో ఒక బాధ్యతాయుతమైన పాత్ర ఉంది- అని షకీల్ బక్షి అంటారు. శ్రీనగర్ నుంచి 'జారిఫ్ అహ్మద్' తన గజల్ కవితలను వినిపిస్తారు.

కశ్మీరీ యువత బలిదానం పొందటానికి ఏమాత్రం సందేహించదు. మాతృభూమి రక్షణ కోసం అమరత్వాన్ని మనస్ఫూర్తిగా స్వీకరిస్తున్నారు. కానీ ప్రతిసారీ సాధించిన దానికంటే నష్టపోవడమే ఎక్కువగా జరుగుతుంది. ఒక ఎన్‌కౌంటర్‌తో పదిమంది చురుకైన యువకుల్ని గుర్తిస్తున్నారు. మరొక ఎన్‌కౌంటర్‌తో మరింత ఎక్కువమందిని గుర్తించి చంపుతున్నారు. మొత్తానికి నిరసనలు, నినాదాలహోరుతో అంత్యక్రియలు జరపడం అంతులేని నష్టాన్నే కలిగిస్తున్నాయి.

యవ్వనంలో ఉన్నవారైనా, వృద్ధాప్యంలో ఉన్నవారైనా ప్రతి ఒక్కరూ తమతమ కోర్కెల్ని తీర్చుకోవాలంటూ ఆడవాళ్లకి సాంప్రదాయ దుస్తులిస్తున్న చిన్నవ్యాపారి అంటాడు. ప్రతిమనిషి మాటా మనిషికి స్వేచ్ఛ ఎంత అవసరమో నొక్కి చెప్తుంది. 'లవ్ కశ్మీర్, లవ్ గుల్మార్గ్, లవ్ ఇండియా', అంటూ మా దేశం (ఇండియా)లో ఇలాంటి స్వర్గం లేదని కూడా అంటారు పర్యాటకులు. జహంగీర్ కశ్మీర్ గురించి 'ఈ భూమి మీద స్వర్గమంటూ ఉంటే అది ఇదే' అని అన్నాడు. అలాంటి భూతల స్వర్గంలో నరకపు ఆనవాళ్లుగా నిరంతరం సిఆర్‌పిఎఫ్ దళాలు కర్కశ పద ఘట్టనలతో కాలుష్యానికి గురిచేస్తున్నారు.

సూర్యుడి నుండి వచ్చే లేలేత కిరణాల వెలుగులో తెల్లటి మంచు లోయల నుండి పర్యాటకులు రంగురంగుల కాశ్మీరీ వేషధారణలలో ప్రశాంతంగా, సంతోషంగా కనిపిస్తారు. వారు మెచ్చుకునే భూతల స్వర్గం నుంచి నేరుగా ఎర్రటి రక్తపు వీధులలోకి ప్రయాణింపజేస్తారు. హింస నుండి మరింత హింసకు, పోయే కొద్దీ భరించలేని హింసకు దారి తియ్యడం-అంతకంతకూ పెరిగిపోవడమే గానీ తగ్గడంలేదనే వాస్తవ పరిస్థితిని కళ్లకు కట్టిస్తారు సంజయ్.

ఈ డాక్యుమెంటరీ వివరించినట్లుగా 'జష్న్-ఎ-ఆజాది' అంటే 'మేము స్వేచ్ఛని ఎలా ఉత్సవంగా చేసుకుంటాం?" అనే శీర్షికలోనే అంతస్సూత్రంగా ఉండే ఒక ఎడతెగని దుఃఖం, అంతులేని విషాదం వెల్లడవుతాయి. కశ్మీర్ ప్రజలందరికీ ఆజాది ఒక శాశ్వతమైన ఆకాంక్ష. ఇది భవిష్యత్తులో ఒకరోజు సాధించబోయే ఆదర్శవంతమైన దేశం! బహుశా ఇది రాజకీయ స్వేచ్ఛ కావచ్చు లేదా అది 'జన్నత్' (అమరవీరులకు వాగ్దానం చేసిన స్వర్గం) కావచ్చు. ఆ దారి ముళ్లదారి. కశ్మీరీలందరికీ ఇది గొప్ప సవాలు. కానీ సాధించి తీరాలనే దృఢ దీక్షతో ఉన్నారని ఈ చిత్రం తెలుపుతుంది!

స్వాతంత్ర్య దినోత్సవం రోజున అనాథ, పిల్లలు ఇక్బాల్ 'సారె జహాన్ సే అచ్ఛా, హిందోస్తాన్ హమారా' అని పాడతారు. అప్పటికి వారిని వదిలేసినా వారి కుటుంబసభ్యులను చంపేస్తారు. సాయుధ దళాలు తమను తాము సమర్థించుకోవడానికి చేసే ప్రయత్నాలలో నిజాయితీ, విశ్వసనీయత లేనితనాన్ని చూపించడంలో ఈ చిత్రం సఫలమైంది. సైన్యం నడుపుతున్న పాఠశాలలు, అనాథాశ్రమాలు, బాధితులకు పోర్టబుల్ రేడియో సెట్లను విరాళమివ్వడం మొదలైన పనులు శాంతి స్థాపన కోసం చేస్తున్నట్లుగా రవ్వంత భ్రమ కలిగిస్తాయి. కానీ జాతీయగీతం పాడాలని ప్రజలమీద ఒత్తిడి తేవడం, మామూలు ప్రజల్ని అన్యాయంగా చంపడం, ఆ తప్పును సరిదిద్దే నెపంతో తర్వాత పరిహారాల పేరుతో వారిని అపహాస్యం చేయడం మొదలైన వికృత చేష్టలు చేస్తారు. పరిహారం పోయిన మనిషుల్ని తిరిగి తెచ్చివ్వలేదు కదా- వాళ్లు చేసే ఈ చేష్టలన్నీ చాలా గొప్ప విషయాలన్నట్లు బలగాలు వారిలో వారు 'ఆపరేషన్ విజయవంతమైంది' అని ప్రగల్భాలు పలుక్కుంటారు.

**మిగతా 15 పేజీలో**



కారాగారంలో కశ్మీర్




# చివరి సారిగా మాట్లాడిన మాటలు

ఉజ్మా ఫలాక్

అనుసృజన: అనామిక

1.

ఏ ఉద్వేగమూ లేకుండా
చివరిసారిగా మాట్లాడిన మాటలు
భూనభోంతరాళాలలో అనంతంగా ప్రతిధ్వనిస్తాయి.

. . .

చివరిసారిగా మాట్లాడిన మాటలు
చాలావాటిని తిరిగి జన్మింపచేస్తాయి
నిష్క్రమణాన్ని ఆగమనంగా
ముగింపులను ప్రారంభాలుగా
ఇళ్లను సమాధులుగా
వీధులను నదులుగా
గోడలను కిటికీలుగా
వసారాలను వంతెనలుగా
మంటలను పువ్వులుగా
నిరీక్షణలను తీరానికి దూరంగా
మినుకు మినుకుమనే పడవలుగా
బూడిదను స్మృతి చిహ్నంగా
సంతకం పెట్టిన కవితలను వాఙ్మాలాలుగా
తలలో, ఛాతీలో దిగిన బుల్లెట్లను అక్షరాలుగా
గర్భకోశాలను గోరీలుగా
దేహాలను మృతుని మెడలో వేసిన పూలదండల్లా.

చివరిసారిగా మాట్లాడిన మాటలు
తగలబడిన ఇళ్లమధ్య ప్రతిధ్వనిస్తాయి
చివరిసారిగా మాట్లాడిన మాటలు
మొండి గోడలపై రాతలుగా ప్రత్యక్షమౌతాయి

చివరిసారిగా మాట్లాడిన మాటలు
సంగీతం తన శ్రావ్యతను రద్దుచేసుకొని
ఏడుపులా రూపాంతరం చెందేలా చేస్తాయి

చివరిసారిగా మాట్లాడిన మాటలు
పదాలను దుఃఖ సమావేశపరచి
వాటి అందమైన అర్థాల దుస్తులు తొలగించి
అగోచరమైన ప్రేతవస్త్రాలను ధరింపచేసి
భాషను బంధవిముక్తి చేస్తాయి.

చివరిసారిగా మాట్లాడిన మాటలు ...
చివరి మాటలు కావు.

2.

జ్ఞాపకం అంటే విధ్వంసం
చిత్రహింసలకు గురైన, మానభంగాలు చేయబడిన,
అంగాలు నరికిన, ఖైదుచేసిన,
చావుతప్పించుకొన్న వేలాది వ్యక్తుల
జ్ఞాపకమే ఈ దేహం

జ్ఞాపకం అంటే చచ్చినవాళ్ల చావగా మిగిలి ఉండే వ్యక్తులు
అమ్మమ్మలు, కూతుళ్లు, తండ్రులు, సోదరులు,
కునన్, సోపియన్, దార్డ్ పూర్, ఉరి, శ్రీనగర్‌ల
స్త్రీలు, పురుషులు, చిన్నారులు

జ్ఞాపకం ఒక సలిపే గాయం
గాయమే మన జ్ఞాపకం, మన సాక్ష్యం
మన స్వేచ్ఛా దేశం. ✿



KLVA106m17-2




# యుద్ధం ముగిసాకా




షబీర్ అహ్మద్ మీర్

అనుసృజన: బొల్లోజు బాబా

యుద్ధం ముగిసాకా
నువ్వు ఇలా వస్తే
బుల్లెట్లు, పెల్లెట్లు చేసిన రంధ్రాలను
నీకు నేను చూపిస్తాను
నీ చేతివేళ్లతో తడిమి చూస్తే
నీకే అర్థమౌతుంది వాళ్లెంత గాయపరచారో

యుద్ధం ముగిసాకా
శిధిలాల మధ్య భయం భయంగా వికసిస్తోన్న
ప్రిమ్ రోజెస్ పూల వాసన నీకు చూపిస్తాను
ఎంతటి దివ్యసౌందర్యం ఉండేదిక్కడ!

యుద్ధం ముగిసాకా
మా అఖండ పురాతన గిరుల మధ్య ప్రవహించే
సెలయేళ్ల గలగలల్ని నీకు వినిపిస్తాను
వాటి గొంతును కోపోద్రిక్త సరిహద్దుల చప్పుళ్లు
ఇకపై అణచలేవు.

యుద్ధం ముగిసాకా
నేను నిన్ను దగ్గరుండి తీసుకెళ్తాను
వెరినాగ్ నీటి చెలమలో నీ పాదాలను తడుపుకో
సుఖనాగ్ నీటిబుగ్గలోని నీళ్లు దోసెళ్లతో తాగు
ఏ భద్రతా లేకుండానే దాల్ సరస్సులో
పడవ షికారు చేస్తూ చేతిని నీళ్లలో ఆడించు
ఇదెంత ప్రశాంత ప్రదేశమో నీకే తెలుస్తుంది,

యుద్ధం ముగిసాకా
భాష్పవాయువులు, పెప్పర్ స్ప్రేలు
సైరన్‌లు, అరుపులు, మూలుగులు లేని
స్వేచ్ఛా గాలుల్ని శ్వాసించే మంచు శిల్పాలు
ఎంత అందంగా ఉంటాయో నీకు తెలిసేలా చేస్తాను.

నువ్వే చూస్తావు! నువ్వే చూస్తావు!
ఈ సువిశాల మంచు లోకపు ప్రశాంతత
అకాల సమాధులు తవ్వటానికై భగ్నం చేయకుండా
ఉన్నప్పుడు
ఎంత అందంగా ఉంటుందో!

యుద్ధం ముగిసాకా
మా వాన్‌వున్* బృందగానానికి తీసుకెళతాను, గొంతుకలుపు
వెండి వెన్నెల రాత్రివేళ
మా రవూఫ్* బృందనాట్యంలో చేరి ఆడుదుగాని.
మేము సంతోషంగా ఉండటం నీకూ సంతోషమేనని
నీకే తెలుస్తుంది.

యుద్ధం ముగిసాకా
నిన్ను టీకి ఆహ్వానిస్తాను
కలిసి టీ తాగుదాం
ఉప్పని రుచితో, కుంకుమ రంగు కలిగిన టీ
నీకే తెలుస్తుంది
నేనేనాడూ నీకు శత్రువుని కానని.

షబీర్ అహమద్ మీర్ ప్రముఖ కశ్మీరీ కవి.
★ వాన్‌వున్- కశ్మీర్ సాంప్రదాయ బృందగానం
★ రవూఫ్ -కశ్మీర్ సాంప్రదాయ బృందనృత్యం.

If undelivered please return to
Manager
**MAHILA GONTUKA MATRUKA**
H.NO. 35-3-6931 (4), Com. Madala Narayana Swamy Bhavan
Sanjay Gandhi Colony, Near Sarma College, Ongole - 523 001.
Mobile : 9676206230, Ph. 08592 - 238350

Printed Matter - BOOK POST
September - 2019

To

EDITED, PRINTED, PUBLISHED AND OWNED BY CHOPPARA PADMA, PRINTED AT NAVYA PRINTERS, 3-6-194, OPP URDU HALL, HIMAYATHNAGAR, HYDERABAD - 500 029, PUBLISHED AT H.NO. 1-9-295/19/A-1, SRILAXMI NILAYAM, VIDYANAGAR, DIST - HYDERABAD, TELANGANA
**EDITOR : CHOPPARA PADMA**

BC



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M173 |
| పుస్తకం పేరు | మాతృక |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | R. Ayyamma |
| పేజీలు విడదీసినది | R. Ayyamma |
| స్కాన్ చేసినది | S. Lakshmi |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| సంస్థితి | good |